# స్వాతి సపరివార పత్రిక

## కృతార్థులం

స్వాతి సపరి వారపత్రిక వస్తోంది అనగానే ప్రతి తెలుగు ఇంటా అపరిమితమైన ఆసక్తి వెల్లివిరిసింది.

విలువైన సూచనలూ, సలహాలు అందజేస్తూ పాఠకులు పత్రికకి స్వాగతంపలుకుతున్నారు.

విశిష్టమైన రచనలు పంపి ప్రోత్సహిస్తున్నారు రచయిత(త్రు)లూ, చిత్రకారులు.

స్వాతి సపరివార పత్రిక అందించే నవరసాల నైవేద్యం పంచేందుకు పూజారులం మేమున్నామంటూ ముందుకొస్తున్నారు ఏజెంట్లు.

ఇందరు ఇన్నివిధాల అభిమానవర్షం కురిపిస్తుంటే కళ్లుచెమ్మగిల్లుతున్నై, కృతార్థులం.

పెరుగుతున్న ఆదరణకి శిరసు వంచి అభివందనం చేస్తూ అందరి అభిరుచులను శిరసావహిస్తూ మీమీ వూహల మేరకు స్వాతి సపరివార పత్రికను తీర్చిదిద్దేందుకు శతధా పరిశ్రమిస్తామని మనవిచేస్తున్నాం.

ఇంతగా మీరు ఎదురుచూస్తున్న స్వాతి సపరివార పత్రికను త్వరలోనే ప్రారంభిస్తున్నాం.

మల్లి చందన






## సినిమా బాలట్ ఫలితాలు !

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1983 సినిమా బాలట్ ఫలితాలు చాలా సంతృప్తికరంగా ఉన్నవి. ''బహుదూరపు బాటసారి'' ఉత్తమ చిత్రంగా ఎన్నికైనందులకు, ఈ చిత్రం ఎవ్వర్ గ్రీన్ హీరో డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు గారు ఉత్తమ నటుడుగా ఎన్నికైనందులకు మాకు చాలా ఆనందంగా ఉంది. అక్కినేనికి మా హృదయపూర్వక అభినందనలు.

బి. లక్ష్మణశాస్త్రి, భీమవరం.

## నరమేధం

''నరమేధం'' అన్న కథ చాలా నచ్చింది. రచయిత(త్రి) అరుణగారికి ధన్యవాదాలు. నేను సుమారు 10 సంవత్సరముల నుండి పత్రిక చదువుచున్నాను. కాని ఇంతగా కదిలించిన కథ నేను చదువలేదు.

వై. శశిభూషణరావు, సునాబెడ.

*　　*　　*

కళ్ళకు కట్టినట్లు, అక్కడకు వెళ్ళి చూస్తున్నట్లే అనిపించింది. అరుణగారు చాల చక్కని శైలిలో కథసాంతం ఎంతో ఉత్కంఠతతో చదివేటట్లు వ్రాశారు. కథకు సరిగ్గా సరిపోయేటట్లు బొమ్మలు గీసిన చిత్రకారుణ్ణి మెచ్చుకోవాలి.

వెన్న వరలక్ష్మి, హైదరాబాదు.

## "మానసిక జాడ్యం"

23–3–84 సంచికలో డా. అశోక్ కుమార్‌గారి వ్యాసం ''భార్యని హింసించటం మానసిక జాడ్యమా ?'' అన్న వ్యాసం బాగుంది. ఇలా హింసించే భర్తలని మా బంధువుల్లో నలుగురైదుగురిని చూశాను – మా ఆడబడుచు భర్త ఒకరు. ముఖ్యంగా ఆయనకి అదో 'మగ లక్షణం'గా భావించి ప్రవర్తిస్తారు. నిత్యం భార్యని వేధించనిదే నిద్రపోడు ... మానసిక జాడ్యమేనని మానసిక వైద్యులు తీర్మానించారు. భార్య ఉద్యోగం చేయాలని పట్టుబట్టాడు మొదట్లో – ఉద్యోగం చేస్తే వారి సంసారం కుదుటపడుతుందని భావించాము. కష్టపడి ఉద్యోగంలో చేరింది ... ఉద్యోగంలో చేరాక మరీ సాధింపులు ఎక్కువైంది. భార్యని, తప్పితే పిల్లలని హింస పెట్టటం ... (తిట్టటం లేదా కొట్టటం) చేస్తూంటాడు. అదొక నరకం స్త్రీకి ! ...

అలా భార్యలను హింసపెట్టే భర్తల వల్ల స్త్రీకి జీవితంమీద విసుగుపుట్టి ఆత్మహత్యకి పాల్పడుతుంది. లేదా పిల్లల కోసం ఆ బాధలు భరిస్తుంది. ఈ మధ్య ఒకటి రెండు సంఘటనలు చూశాను. ఈ హింసలు భరించలేక ఆ స్త్రీ పిల్లలను చంపి, తాను ఆత్మహత్య చేసుకుంది. పేపర్లోకూడా అలాంటి వార్తలు వస్తూనేవున్నాయి. పిల్లల్ని చంపే ఆ తల్లి ఎంత కర్కోటకురాలో ? అని ఈసడిస్తారు ? కాని ఆ పరిస్థితికి దిగజార్చే సంఘటనల గురించి ఎవరూ ఆలోచించరు ? ...

ఈ మధ్య వచ్చే సినిమాల్లో ఇద్దరు హీరోయిన్స్ వుండే హీరో కథలు చూపిస్తున్నారు. ఎందరు భార్యలుంటే అంత గొప్పగా భావించే పురుషులున్నారు. భార్య పిల్లలుండగా ఇంకో స్త్రీతో సంబంధం పెట్టుకోవటం. ఆ స్త్రీ కోసం ఇటు భార్యని హింసించటం ఇలాంటి దౌర్బల్యం పురుషులలో బాగా ప్రబలింది ఈనాడు.

''ప్రేమించే హృదయానికే ప్రేమ విలువ తెలుస్తుంది. వారు భార్యచే ప్రేమింపబడతారు అని గుర్తుంచుకొంటే చాలు !

ఆ సంసారం నందనవనం అవుతుంది.

పి. అనూరాధ, విశాఖపట్నం.

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
**దేశోద్ధారక కాశీనాథుని**
**నాగేశ్వరరావు పంతులుగారు**
స్థాపితం : 1908
***శివలెంక శంభుప్రసాద్***
**సంపాదకుడు :**
[1938–1972]
శుక్రవారం : 4–5–'84
శ్రీ రక్తాక్షినామ సం.వైశాఖ శు. తదియ
**సంపుటము 76 : సంచిక 34**
**సంపాదకుడు :**
***శివలెంక రాధాకృష్ణ***
విడి ప్రతి వెల రు. 1-80
ఆరు మాసాల చందా రు. 46-80
పోస్టులో ఏడాదిచందా రు. 101-40
**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధీనగరం. విజయవాడ-**520 003**.

## విషయానుక్రమణిక



## లోకం పోకడ....ఊమెన్



# పులికి వానపాము ద్రోహం చెయ్యగలదా?

1942లో కమ్యూనిస్టులు మన వెన్ను పొడిచారన్న సంగతి స్కూల్లో చదువుకునే పిల్లలకికూడా తెలుసు. వాళ్ళు ఎమర్జెన్సీలోకూడా అదేపని చేశారన్న సంగతికూడా అందరికీ తెలుసు. ఇంకొక అవకాశం వస్తే వెన్ను పొడవటానికి వెనుతియ్యరు వాళ్ళు అని నేను అనుకుంటూ వుంటాను. వాళ్ళు వెన్ను పొడిస్తే వచ్చే నష్టమేమీ లేదు–1942లోనూ లేదు, 1977లోనూ లేదు. 1977లోనే శ్రీమతి గాంధీ, ఆమె పార్టీ చారిత్రికంగా చెత్తబుట్టని చేరుకున్నారు. వెన్ను పొడవటాన్ని ఒక కళగా మార్చేశారు కమ్యూనిస్టులు. ఇందులో వింత ఏమీలేదు – ఎందుకంటే ద్రోహం చేసే వాడు ఒక రకం కళాకారుడేకదా! కమ్యూనిస్టులు చేసినది ఒక "మహాద్రోహం" అంటారు కొందరు. ఇది సరయిన వర్ణనగా నాకు తోచదు. కమ్యూనిస్టులు చేసినది మహత్కార్యంకాదు, వాళ్లది ద్రోహం అనటానికీ వీలులేదు. ఎంత ప్రయత్నించినా ఒక వానపాము సింహానికి ద్రోహం చెయ్యగలదా? పోలాండు, చెకోస్లొవాకియాలాంటి చిన్న దేశాలలో వాళ్ల ఆటలు సాగుతాయేమోకాని భారతదేశంలో అవి సాగవు. ఈ దేశం సంగతేవేరు.

1942 లో నేను చిన్నవాడిని. అయినా అప్పుడు జరిగిందంతా నాకు బాగా గుర్తు. ఏదో పెద్ద మార్పు వస్తోందని మేము పసిగట్టాము. దేశం మళ్ళీ పాత స్థితికి రాదని గ్రహించాము. బొంబాయి నుంచి వచ్చి చదువుకుంటున్న అబ్బాయి మా క్లాసులో ఉండేవాడు. అతను కమ్యూనిస్టూ, జాతీయవాదీ కూడా. మాలో ఎక్కువ మంది జాతీయవాదులమే. అయితే, ఈ అబ్బాయికి స్టాలిన్ అన్నా అతని రౌడీలన్నా సానుభూతి ఉండేది. ఉందికదా అని అందరితో దానిని గురించి మాట్లాడేవాడు కాడు. స్టాలిన్, హిట్లర్‌లు యూరోపుని కలిసి మింగేందుకు ఒప్పందం చేసుకున్నప్పుడు మా వాడికి మతిపోయినట్లయింది. "పీపుల్స్ వార్" లాంటి అసభ్యకరమయిన పత్రికలని అమ్మటం మొదలు పెట్టాడు. ఎక్కడ అనుకున్నారు? ఒక సినిమా హాలు దగ్గిరగా. [అక్కడే పడుపువృత్తి చేసుకునే వనితలు తిరుగుతూ ఉండేవాళ్ళు.] అతని వైఖరి చూసి మాకు వళ్లుమండింది ఒక రోజు అతని మీద చీమలు మూగినట్లు మూగి అతని వద్ద ఉన్న వస్తువులన్నిటినీ తీసేసుకున్నాము. అతను తారెత్తి పారిపోయాడు. కొన్ని సంవత్సరాల తర్వాత అతనే బొంబాయిలో తేలాడు – రజనీ పటేల్ చెంచాగా. ఈ పటేల్ ఇంకొక దగాకోరు. కుమారమంగళమ్, హక్సర్ తదితరులతో స్నేహం చేసినట్లే శ్రీమతి గాంధీ ఇతనితోకూడా స్నేహం చేసింది. ప్రస్తుతం మా క్లాసు అబ్బాయి ఏమి చేస్తున్నాడో తెలీదు కాని లక్షాధికారి, కోటీశ్వరుడూ అయినా ఆశ్చర్యపడను. అంతూాలే చెంచా ఏమోకూడాను. ఇప్పుడు ఆలోచించి చూస్తే అనిపిస్తుంది – పటేల్, అంతూాలేలు అత్యవసర పరిస్థితి కాలంలో బ్రహ్మాండంగా వెలిగిపోయారు. చివరికి ఢిల్లీలో ఎవరో వాళ్ల ఆట కట్టేసేదాకా భలేగా వెలిగిపోయారు. కమ్యూనిస్టులు ఎప్పుడూ ఇంతే. ఎంత తెలివి ఉన్నదని చెప్పుకున్నాసరే వాళ్ళు వానపాములలాంటి వాళ్ళు. ఆఖరుకి ఏదో పెంటకుప్పలో తలదాచుకోవలసిందే వాళ్ళు.

నేను చెప్పేది నమ్మరా? ఆఫ్గనిస్తాన్‌కి వెళ్లి చూడండి. ఆ సమస్య సంగతే మనం మర్చిపోతున్నాము – అది ఎంత తీవ్రంగా ఉన్నప్పటికీ. ఈ మధ్యనే నేను విమానంలో ప్రయాణం చేస్తూ ఉండగా ఒక ఆఫ్గన్ డాక్టరుని కలుసుకోవటం తటస్థించింది. ఆయన తన కుమార్తెని ఒక కాలేజిలో చేర్పటానికి భారతదేశం వచ్చాడు. ఆయన ఆ దేశంలో ప్రభుత్వోద్యోగి. ఆయన పని బాగానే ఉందని తెలుసుకున్నాను. ఆఫ్గనిస్తాన్‌లో రష్యావారు ఏలుతున్నారనటం అతిశయోక్తి అన్నాడు ఆయన. నేటి బంగళాదేశ్‌లో ఒకప్పుడు జనరల్ యాహ్యా ఎంత ఏలగలిగారో ఈ రోజు ఆఫ్గనిస్తాన్‌లో రష్యావారూ అంతే ఏలగలుగుతున్నారన్నమాట. కాబుల్‌ని దాటి ఒక కిలోమీటరు వెళ్లాలంటే భయం, అసలు తను మిలిటరీ "బారకేస్" దాటి వెళ్లాలంటేనే భయం. గ్రామాలనిండా గెరిల్లాలు. వాళ్లే అప్పుడప్పుడు కాబుల్ మీద వచ్చి పడుతూ ఉంటారు. ధరలు 5 రెట్లు పెరిగాయి (రష్యా ఆక్రమణ తరువాత.) ఆ దేశంలో చీకటి బజార్ కనుక లేకపోతే జనం ఆకలితో మాడిపోయేవాళ్ళు. విద్యాలయాలు పని చెయ్యటంలేదు. వాటిలో టీచరులు చాలామంది రష్యావాళ్ళు. ఈ అధ్యాపకులు రాగానే విద్యార్థులు చాలామంది బయటికి వెళ్లిపోతూ ఉంటారు. ఇంతకి ముందు అమెరికా, భారతదేశం టీచరులు ఉండేవాళ్ళు. వాళ్ళు ఇంగ్లీషులో బోధించేవాళ్ళు. ఇప్పుడు రష్యా భాషలో చెబితే ఎవరు వింటారు? చరిత్ర పుస్తకాలని తిరగ రాస్తున్నారుట.

ప్రభుత్వం కార్యాలయాలలో రష్యావాళ్లదే పయిచెయ్యి. రష్యా అధికారుల కింద ఆఫ్గనిస్తాన్ అధికారులు ఉంటారు. ఏదయినా పని కావాలంటే ఇద్దరికీ లంచం ఇవ్వాలి. వీళ్ళుకాక సైనికాధికారులు వేరే ఉంటారు. ఒక ఊరినుంచి మరొక ఊరు పోవాలంటే 'పాస్' కావాలి. టెలిగ్రామ్ ఇస్తే దాన్ని "సెన్సారు" చేస్తారు. ఒక "పాస్‌పోర్టు" కావాలంటే రెండు మూడు సంవత్సరాలు పడుతుంది. [పాస్‌పోర్టు దొరికితే వలస వెళ్లిపోదామనే వాళ్ళు జనాభాలో సగం మంది ఉంటారేమో!] రష్యా, ఆఫ్గనిస్తాన్ దేశస్తుల మధ్య తరుచు తగాదాలు వస్తూ ఉంటాయి. కాబుల్ పెద్ద బజారులలో తిరగాలంటే రష్యా వాళ్లకి కాపలా అవసరం. ఈ కాపలాదారులు "మెషిన్ గన్" లతో వెంట రావాలన్నమాట. రాత్రిపూట కర్‌ఫ్యూ తప్పదు. పోలీసుస్టేషనుకి జనాన్ని తీసుకుపోయి లంచం పుచ్చుకుని వదిలిపెడుతూ ఉంటారు రక్షకదళం అధికారులు ...

"ఉస్టినోవ్‌కి మీ దేశంలో అంత స్వాగతం ఎలాగ ఇచ్చారు? ఆయన సేనలే కదా మమ్మల్ని అణచి వేస్తున్నది? ఆ సేనలే కదా ఇన్ని హత్యలు చేసేది? మా దేశంలో ఇంకా భారతీయులంటే స్నేహ భావమే ఉంది కాని ఇలాగే కొనసాగితే కొంతకాలం తరువాత ఆఫ్గనిస్తాన్‌లో ప్రతి భారతీయుడూ ఆగ్రహానికి గురి కాగలడు– మాకు తెలుసు మొత్తంమీద భారతదేశంలో ఆఫ్గనిస్తాన్ పరిస్థితి పట్ల హర్షం లేదని!" అన్నాడు ఆ డాక్టరు.

కమ్యూనిస్టులతో ఎన్నికల సంఘటనని గురించి మాట్లాడేవాళ్లు ఒక సంగతి జ్ఞాపకం చేసుకోవాలి – వాళ్లతో పొత్తు కుదరటం కష్టం. వాళ్లు ప్రజాస్వామ్యాన్ని గురించీ ఇతర విలువలని గురించీ ఎన్ని కబుర్లయినా చెప్పవచ్చు




[66 వ పేజీ చూడండి]



ఎం.హరం. అయోధ్యారెడ్డి

# పొగమేఘాలు

ఆ కుర్రాడికి పదహారేళ్ళుకూడా వుండవేమో —

అంత చిన్న వయసులో అతను రిక్షా తొక్కుతుంటే చూసేవాళ్ళకి బాధాకరంగానే వుంటుంది. ఆ సమయంలో రిక్షాలో కూర్చుని వున్నది నేనే కనుక కొంచెం ఎక్కువే బాధ పడ్డాను.

ఆ కుర్రాడిదేం కొట్టొచ్చే పర్సనాలిటీ కాదు. సన్నగా పొడుగ్గా వున్నాడు. చురుకైన కళ్ళు, అమాయికమైన మొహం —కాకి నిక్కరూ నీలంరంగు చొక్కా వేసుకున్నాడు.

ఆ రోజు తీసుకోవాల్సిన చివరిక్లాసు అనుకోకుండా కాన్సిలవటంతో ఓ గంటముందు గానే కాలేజిలోంచి బయటపడ్డాను. గేటు దాటి రోడ్డుమీదికొచ్చి రిక్షాకోసం చూస్తున్నాను. ఇంతలో ''నమస్కారం మాస్టారూ...! రిక్షా కావాలా ?'' అనే మాటతో నా పక్కనే రిక్షా వొచ్చి ఆగింది.

బేరమేమీ చెయ్యకుండానే రిక్షా యెక్కాను. కారణం—నేను ఆ కుర్రాడి రిక్షాలో యెక్కటం వరుసగా అది మూడోరోజు.



''లక్‌డికాపూల్ ఎంతివ్వమంటావోయ్ ?'' అన్నాను మొదటిరోజు అతనితో బేరమాడుతూ.

''మీ ఇష్టం మాష్టారూ! మీకు తోచినంత యివ్వండి—'' అతని గొంతులో విధేయత.

''మీ రిక్షావాళ్ళతో యిదేనోయ్ చిక్కు. మొదట రిక్షా ఎక్కేముందు ఇలాగే మీ ఇష్టమంటారు. తీరా దిగేటప్పుడు గొడవ చేస్తారు.''

''లేదు మాష్టారు! నేనలాంటివాణ్ణి కాదు. అసలు మీరు నాకు బాడుగ ఇవ్వకున్నా కూడా సంతోషంగా వెళ్ళిపోతాను —'' అన్నాడా కుర్రాడు మెడచుట్టూవున్న రుమాలుతీసి సీటు మీద దుమ్ము దులుపుతూ.

అతనలా మాట్లాడ్డం విచిత్రంగానే తోచినా నేనిక బేరం చెయ్యలేదు. ఎక్కికూర్చున్నాను. రిక్షా లక్‌డికాపూల్ చేరుకున్నాక — ''మీ ఇల్లెక్కడో చెప్పండి మాష్టారూ! తీసుకెళ్ళి దింపుతాను —'' అన్నాడా కుర్రాడు.

''ఫర్వాలేదు లేవోయ్ దగ్గిరే — నడిచి వెళ్తాను'' అని నేనెంత చెప్పినా అతను విన్పించుకోలేదు. చేసేదిలేక అడ్రస్ చెప్పాను. రిక్షా దిగాక రెండ్రూపాయల నోటిస్తే తీసుకొని — ''వస్తాను మాష్టారూ...నమస్తే...!'' అంటూ వినయంగా చేతులు జోడించి, రిక్షా మలుపుకొని వెళ్ళిపోయాడు. చాలా చిత్రమైన కుర్రాడు అనుకున్నాను లోపలకువెళ్తూ.

ఆ మరునాడుకూడా నేను క్లాసులు ముగించుకొని బయటికొచ్చేసరికి ''రిక్షాకావాలా మాష్టారూ ?'' అంటూ అతను నా ప్రక్కనే ప్రత్యక్షమయ్యాడు. అతను నా రాకకోసం కావాలనే అలా కాలేజి బయట చాలా సేపట్నుంచి కాచుకొని వున్నాడన్పించింది. అతనెందుకలా చేస్తున్నాడో నాకర్థంకాలేదు. అలాగే ఇది మూడవ రోజు ...

నేను ఆలోచన్ల నుంచి తేరుకొనే సరికి రిక్షా తొక్కుతూ చిన్నగా పాడుతున్నాడు. ''విశ్వమంతా నిండి, వెలిబూది వోలె— బహుళ పంచమి జ్యోత్స్న భయపెట్టు నన్ను!''

నేను ఉలిక్కిపడినంత పన్చేశాను.

# పొగ మేడలు

మామూలుగా రిక్షావాళ్ళు ఏ సినిమా పాటో పాడతారు. కానీ అతను పాడినవి శ్రీశ్రీ గేయం లోని చరణాలు.

కుతూహలాణ్ణచుకోవటం నావల్ల కాలేదు. అప్పటికతని వివరాలు సేకరించాలన్పించింది.

"చూడు బాబూ— నీ పేరేమిటి ...?" అడిగాను.

గాలివాలున నా ప్రశ్న సరిగా విన్పించనట్లుంది. చిన్నగా తల వెనక్కి తిప్పి "ఏమిటి మాష్టారూ ?" అన్నాడతను.

"నీ పేరేమిటని అడుగుతున్నా—"

"రాములు మాష్టారూ."

"ఎంతవరకూ చదువుకున్నావ్ ?" అతని మాటలు, నడవడీ చూశాక ఈ ప్రశ్న అడగాలన్పించింది.

లక్డికాపూల్ చౌరస్తా వద్ద సిగ్నల్ పచ్చలైటు చూపగానే రిక్షాను ముందుకు కదిలిస్తూ చెప్పాడు రాములు — "పదోక్లాసు వరకూ చదివానండీ— కానీ ప్యాసవలేదు —"

"పోయిందన్నమాట —"

"లేదు మాష్టారు ! నేనసలు పరీక్షే ఇవ్వలేదు. ఇస్తుంటే పోవటమన్న ప్రశ్నేలేదు. తప్పక ఫస్టుక్లాసులో ప్యాసయేవాణ్ణి —"

ముచ్చటేసిందా కుర్రాడి మాటలు వింటుంటే. ఎంత ఆత్మవిశ్వాసమో అనుకున్నా.

"మరెందుకివ్వలేదోయ్ ? ఏదైనా జబ్బు పడ్డావా ?"

"కాదండీ... జబ్బు పడలేదు" రాములు గొంతు విషాదంగా పల్కింది "మా కుటుంబ పరిస్థితులు అనుకూలించక —"

ఈలోగా మా ఇల్లొచ్చేసింది. రాములు రిక్షా ఆపి దిగాడు.

"నీకు అమ్మా నాన్నా లేరా రాములూ ?" ప్రశ్నించాను అతనికి రెండు రూపాయలూ అందజేస్తూ.

"ఉన్నారు మాష్టారూ ! తల్లిలేదు గాని తండ్రి, ఓ తమ్ముడూ, ఇద్దరు చెల్లాయిలూ ఉన్నారు—" ఈ మాటలంటున్నప్పుడు రాములు ముఖం యెందుకో మబ్బులు కమ్మిన ఆకాశంలా అయ్యింది. అతను నమస్కారం చేసి రిక్షా తిప్పుకొని వెళ్ళిపోయాడు.

* * *

నా జీవితంలో సాయంకాలం జరిగే అనుభవాల్లో ఒక అనుభవంగా మొదలైన రాములు పరిచయం క్రమంగా వృద్ధి చెందింది.

రోజూ నేను కాలేజి ముగించుకొని బయట కొచ్చే సమయానికి రాములు రిక్షాతో గేటువద్ద సిద్ధంగా ఉండేవాడు. ఒకవేళ ఏనాడైనా అనుకోకుండా నేను ముందుగానే వెళ్ళిపోవాల్సి వొస్తే తను సాయంత్రం కాలేజి వరకొచ్చి చాలాసేపు చూసి తిరిగి వెళ్ళిపోయేవాడు.

## సందేశం?

నోటి నుండి
కురిసేవి మధురసూక్తులు
దినమంతా
పన్నేవి కుటిల యుక్తులు
నవీన
నాగరికతలో
ఇది
వినూత్న సందేశమేమో ?

— దశశ్రీ

రానురాను రాములుతో పరిచయం పెరిగిన కొద్దీ అతన్లో ఒక కొత్త రూపం కన్పించ సాగింది నాకు. అతను చదివింది పదో తరగతే అయినా అతన్లో వున్న విజ్ఞాన దాహం నాకు అబ్బుర మన్పించేది. రోడ్డు పక్కన ఎవరైనా విద్యార్థులు చేత పుస్తకాలతో వెళ్ళటం కన్పిస్తే చాలు రాములు రిక్షాకి హఠాత్తుగా బ్రేకులు పడేవి. ఎంతో ఆరాటంగా చూసేవాడు వాళ్ళకేసి —

"చదువుకోవటమనేది నిజంగా గొప్ప వరం కదూ మాష్టారూ ?" అనేవాడు నాకేసి తిరిగి. నాకెంతో జాలి వేసేది—"అవునోయ్" అనేవాణ్ణే ఏమనడానికి తోచక.

చదువుమీదున్న రాములు ఆసక్తి పరిమితమైంది కాదు. ముఖ్యంగా రాములుకి సాహిత్యంతో పరిచయం బాగా వుందన్న సత్యం గ్రహించగల్గాను.

"చూడు రాములూ ! ఓ మాటడుగుతాను నిజం చెప్తావా ?" అన్నానోరోజు, రిక్షాలో పోతున్నప్పుడు.

"అడగండి మాష్టారూ"

"రోజు కాలేజి వొదలగానే వొచ్చి నన్ను రిక్షాలో దిగబెడుతున్నావు కదా ! దీనికోసం ఎంత టైము వృధా...? ఈ ఒక్క బేరంవల్ల నీకెంత నష్టం ? వొచ్చే సంపాదన పోవటం లేదూ...?"

"ఇది బేరం కాదు మాష్టారూ ! అభిమానం. అభిమానమున్నచోట లాభనష్టాల ప్రసక్తి ఉండకూడదు —" అన్నాడు రాములు.

"నేనంటే నీకెందుకోయ్ అభిమానం ?"

"చెప్పమంటారా ? కవిగా, రచయితగా నాకు మీరంటే వెర్రి అభిమానం. మీ రచనలు అన్ని కాకపోయినా కొన్ని చదివాను. వాటిల్లో మీరెన్నుకొన్న వస్తువూ, యిచ్చిన సందేశాలూ, మీ సామాజిక స్పృహ గొప్పది మాష్టారూ ! అందుకే నా హృదయంలో రచయితగా మీరు అపూర్వ స్థానాన్ని పొందారు. ఇప్పుడు వ్యక్తిగా

# మీ కొక చెడువార్త! పత్రికలకి వ్యతిరేకంగా అవలంభించబడుతున్న విధానాలు!

రోజూ మీరు సుపరిచితమయిన వార్తాపత్రికని చదువుతూ ఉంటారు.

వార్తలు, వ్యాఖ్యలు, వినోదం— అంతా ఒక కప్పు కాఫీకన్నా చవుకగా అందిస్తుంది ప్రతి దినమూ మీ పత్రిక.

మీ వార్తా పత్రిక ద్వారా ప్రపంచమే మీ ముందు ఉంటుంది.

కాని, వార్తా పత్రికల ప్రపంచం కష్టాలలో ఉందని మీకు తెలుసా? ఒక వేళ తెలియక పోతే తెలుసుకోవాలని మా అభిప్రాయం.

## వార్తాపత్రికల మెడలకి ఉచ్చులు

వార్తాపత్రికల ఉనికికే ముప్పుతెచ్చే పన్నులు, సుంకాలని గురించి మీకు తెలుసా?

న్యూస్‌ప్రింట్ మీద 15 శాతం సుంకం ముందు వేశారు. దాన్ని టన్నుకి రు. 825 గా మార్చారు. ఒక వార్తా పత్రిక ఉత్పత్తి ఖర్చులో 50 శాతం న్యూస్‌ప్రింట్‌కే అవుతుంది.

ఇక దిగుమతి అయిన యంత్రపరికరాల మీద, ఇతర వస్తువుల మీద 40 నుంచి 150 శాతం దాకా సుంకం వేశారు.

1983 బడ్జెట్‌లో ప్రకటనల వ్యయం మీద 20 శాతం ఒప్పుకోమన్నారు. అంటే ప్రకటనదారుల ఖర్చు మీద 20 శాతం వ్యయంగా అంగీకరించకుండా దానిని లాభాలలో కలుపుతారన్నమాట. దీనితో ప్రకటనలు తగ్గిపోతున్నాయి. ప్రకటనలు 'దండగ' అనీ 'అవసరం కాదు' అనీ ప్రభుత్వం వారి అభిప్రాయం.

ఇదంతా ఎక్కడికి దారి తీస్తోంది?

పత్రికలు తమ అమ్మకం ధరలని పెంచుతాయి. పెంచటం వల్ల అమ్మకాలు తగ్గుతాయి.

అమ్మకాలు తగ్గితే ప్రకటనలు తగ్గుతాయి. అందుచేత మళ్ళీ అమ్మకం ధరలు పెరగాలి.

ఇది నిరంతరంగా జరిగితే చివరికి ఒక వార్తాపత్రిక ధర మరీ అధికం అయిపోయి, కొనే వారికి అది "అందుబాటులో లేదు" అనిపించి నిజంగానే వినియోగదారుకి అందుబాటులో లేకుండా పోతుంది.

ఇంత జరిగితే అది చాలా తక్కువ రాబడి కోసం ప్రభుత్వం అనుసరించే విధానాల ఫలితంగానే జరుగుతుంది.

## సమాచార ప్రసారానికి అవరోధాలు

1980 తరువాత దేశంలో పత్రికల అమ్మకాలు ఎలాగ ఉన్నాయో ఈ కింది అంకెలు తెలుపుతాయి. అవి తగ్గుముఖం పడుతున్నాయని మీకే తెలియగలదు.

| | | |
|---|---|---|
| 1977 | — | 37,427,000 |
| 1978 | — | 40,850,000 |
| 1979 | — | 46,449,000 |
| 1980 | — | 50,921,000 |
| 1981 | — | 51,102,000 |
| 1982 | — | 50,094,000 |

1981 కన్నా 1982 అంకె తక్కువ!

వర్ధమాన దేశాలలో 1000 మంది జనానికి కనీసం 100 కాపీల వార్తాపత్రికలు అమ్ముడు పోవాలని ఐ.రా.స. వారు నిర్ణయిస్తే భారతదేశంలో ఈ అంకె 13!

అక్షరజ్ఞానం అందరికీ వుండాలనీ, సమాచారం ధారాళంగా ప్రసారం కావాలనీ ప్రభుత్వం వారు అంగీకరించి ఆ విధానానికి కట్టుబడి ఉంటామంటూనే ఇలాగ చేస్తున్నారు.

## ఆలోచించండి

గిట్టుబాటు కావటానికి ఒక వార్తాపత్రిక ఎన్నిసార్లు ధర పెంచాలి? ఇలాగ పెంచుతూ ఉంటే అది ఇంకా ఎందరికి అందుబాటులో ఉంటుంది?

ప్రకటనలు "దండగా"? అవి "అవసరమయినవి కావా"?

లేక పోతే వార్తాపత్రికలు సరసమయిన ధరలకి జనానికి అందుబాటులో లేకుండా చేసే విధానాలకే ఆ వర్ణనలు వర్తిస్తాయేమో!

ఈ ప్రశ్నలని గురించి ఆలోచించండి! అవి చాలా ముఖ్యమయిన విషయాలకి సంబంధించినవి.

**మీకు తెలుసుకునే హక్కు వుంది!**
**మాకు తెలిపే హక్కు ఉంది!**
**వార్తాపత్రిక అక్కరకివచ్చే మిత్రుడు అనుకోండి!**

ఇండియన్ ఎండ్ ఈస్టర్న్ న్యూస్ పేపర్ సొసయిటీవారిచేత ప్రకటితము.

# పొగ మేడలు

కూడా మీరు ఉన్నతులని నమ్ముతున్నాను మీదీవూరేననీ, ఈ కాలేజిలో పన్జేస్తున్నారనీ నాకు మొన్నటిదాకా తెలియదు. లేకపోతే ఎప్పుడో మిమ్మల్ని దర్శించుకొని వుండేవాణ్ణి—''

అలా తెల్సిపోయింది రాములు కేవలం రిక్షా నడిపే రిక్షావాలా మాత్రమే కాదనీ – సాహితీ జిజ్ఞాస వున్న మంచి పాఠకుడనీ, స్కూల్ రోజుల్లోనే సాహిత్యంతో అతనికా సంబంధం ఏర్పడింది.

''నేను మొదట్నుంచీ చదువు పట్ల చాలా ఆసక్తిగా వుండేవాణ్ణి మాష్టారూ! నేనంటే అమితంగా ఇష్టపడే మా స్కూల్లో తెలుగు మాష్టారు నా చేతికి ఒకరోజు 'మాలపల్లి' నవల యిచ్చి చదవమన్నారు. అంత లావు పుస్తకం చదువుతానా అని ముందు జంకినా తర్వాత పదిహేనురోజులపాటు కష్టపడి చదివి అది పూర్తిచేశాను. ఆ తర్వాత ఆ మాష్టారు దగ్గిరే చాలా పుస్తకాలు తెచ్చుకొని చదివేవాణ్ణి. రాన్రాను సాహిత్యమంటే నాకు ప్రాణ సమానంగా తోచసాగింది. అసలైన విజ్ఞానం అందులోనే వుందనిపించేది. ఎక్కడ ఏ పుస్తకం అందుబాటులో వున్నా తెచ్చుకొని చదవకపోతే ప్రాణం కొట్టుకులాడిపోయేది'' చెప్పాడు ఓ రోజు రాములు.

రిక్షా తొక్కుతున్నంతసేపూ ఊరికే వుండేవాడు కాడతను. సాహిత్యానికీ, రచయితలకీ సంబంధించి చాలా ప్రశ్నలు వేసేవాడు. ఇప్పుడు తనకు దొరికే తీరిక సమయం చాలా తక్కువనీ, దాన్నే సద్వినియోగం చేసుకుని దొరికిన పుస్తకాలు చదువుతాననీ చెప్పాడు. ''కొన్ని పుస్తకాలు చదవాలని వున్నా అవి నా కందుబాటులో వుండవు మాష్టారూ! వాటిని కొనుక్కునే శక్తి నాకు లేదు'' అనేవాడు.

''ఈ రోజు నుంచీ మీరు నాకు రిక్షా బాడుగ ఇవ్వద్దు మాష్టారూ'' అన్నాడొకసారి.

నేను తెల్లబోయాను – ''ఎందుకోయ్ ?''

''మరేం లేదు! అవి మీ దగ్గిరే వుంచండి. కొంత మొత్తం ప్రోగయ్యాక మీరే ఏవైనా మంచి పుస్తకాలు కొనివ్వండి—ఏమంటారు...?''

ఏమనగలను ...? అభినందిస్తున్నట్లుగా అతన్ని చూసి, ప్రేమగా భుజం తట్టి – ''అలాగే'' అన్నాను.

రచయితగా రాములుకి నేనంటే ఎంత అభిమానమున్నా ఒక్కోసారి అతనిలోని నిశిత విమర్శకునికి ఈ అభిమానం అడ్డొచ్చేదికాదు. ఆ మధ్య ప్రముఖ వారపత్రిక సంపాదకుడైన నా మిత్రుడొకాయన కోరిక కాదనలేక ఇప్పుడున్న న్యూవేవ్‌కి అనుగుణంగా సస్పెన్స్ థ్రిల్లర్ సీరియల్ నొక్కదాన్ని రాసిచ్చాను. అది రాములు చదివాడు గావును, అన్నాడో రోజు –

''మీరట్లాంటి నవలలు రాయొద్దు మాష్టారూ !''

నిజమే ...! అవి రాయటం నా ప్రవృత్తికి విరుద్ధం. కానీ మిత్రుని మాట కాదనలేక రాయాల్సొచ్చింది. ఇవేవీ చెప్పకుండా ''ఎందుకని రాయకూడదోయ్?'' అన్నాను అతనేమంటాడో విందామని.

రచయితగా పాఠకుల దృష్టిలో మీరు వేరు మాష్టారూ! మీ నుండి మాలాంటివాళ్ళు ఆశించేది కూడా భిన్నంగా వుంటుంది. మధ్య తరగతి ప్రజల్ని ఊహా లోకంలో విహరింపజేసే ఇతి వృత్తాలతో ప్రేమకథలు రాసే చాలామంది రచయితల కంటేకూడా ఈ సస్పెన్స్ థ్రిల్లర్స్ రాసేవాళ్ళమీద నాకు చాలా చెడ్డ అభిప్రాయ ముంది. నాదృష్టిలో యివెందుకూ పనికిరానివి. దయచేసి ఇకముందు మీరిలాంటివి రాయకండి.''

అతను అప్పరాల్ రిక్షావాడు కావొచ్చును. కానీ నా పాఠకుడు. అతని విమర్శలో విజ్ఞత వుంది– ఆవేదనుంది.

ఈ విధంగా రాములు నా దృష్టిలో రోజు రోజుకీ ఎదిగిపోయాడు. అతన్ని ఓ రిక్షావాడిగా కాకుండా నా స్నేహితుడిగా చూడసాగాను.

* * *

ఓ ఆదివారం మూడుగంటలు దాటుతుండగా మా యింటి కొచ్చాడు రాములు. ఆ వేళకి తలుపులు తెరిచే వున్నాయి. రైటింగ్ టేబుల్ ముందు కూర్చొని రాసుకొంటున్నాను.

''లోపలికి రావొచ్చా మాష్టారూ ?'' అన్న ప్రశ్నకి తలెత్తి చూస్తే గుమ్మంలో రాములు కన్పించాడు.

''ఓ...రాములు...నువ్వా ...? రారా...'' టేబుల్ ముందు నుంచి లేస్తూ సంతోషంగా ఆహ్వానించాను.

లోనికి రెండడుగులు వేసినవాడల్లా తటపటాయిస్తూ నిలబడి పోయాడు రాములు. అంతదాకా నేను గమనించలేదు కాని బయట వర్షం పడుతోంది. రాములు బాగా తడిసిపోయాడు. చటుక్కున ఓ టవల్ తీసి అతనికి అందించాను.

–''బాగా తడిసిపోయావు తల తుడుచుకో. లేకపోతే జలుబు చేస్తుంది.''

''ఫర్వాలేదండీ...! ఇది నాకలవాటే''

''అలా మొహమాట పడకు. నా మాట విని తల తుడుచుకో. ఆ చొక్కా కూడా విప్పి పిండుకో—ఆరుతుంది.''

నేను బలవంతం చెయ్యటంతో రాములు మరేమనకుండా టవలందుకున్నాడు. చొక్కా విప్పి గట్టిగా పిండి మళ్లీ అదే తొడుక్కున్నాడు. నేను వారించబోతే వినలేదు. అతను వణుకుతున్నాడు. లోపలకెళ్ళి పదినిముషాల్లో వేడిగా ఛాయ్ తయారుచేసి తీసుకొచ్చాను.

మొహమాటంగా కప్పు అందుకొంటూ నాకేసి కృతజ్ఞతగా చూశాడు.

"ఇది వర్షాకాలం గదా — ఓ గొడుగు దగ్గరుంచుకోవాల్సిందోయ్" అన్నాను. అలా అన్నాక స్ఫురించింది అనాలోచితమైన మాటన్నానని సిగ్గుపడ్డాను.

రాములు చిన్నగా నవ్వాడు— "రిక్షా నడిపే వాళ్లు వర్షానికి బెదిరితే యెలా మాష్టారూ ? గొడుగు చేతిలో వుంటే రిక్షా నడపటం రాదు. ఐనా మాష్టారూ... ! గొడుగంటే మాటలా ? నా మూడు రోజుల సంపాదన పెట్టినా రాదు."

"నువ్ రిక్షా యెంతకాలంగా తొక్కుతున్నావు రాములూ ?"

"దాదాపు రెండేళ్ల నుంచీ"

"అంతకు ముందేం చేసేవాడివి ? "

"స్కూల్ కెళ్ళే వాణ్ణండీ."

"మరి... ? "

రాములు విషాదంగా నా మొహంలోకి చూసి ఓ నిట్టూర్పు విడిచాడు. చూరు నుంచి ధారగా పడుతున్న వర్షం నీళ్ళతోనే తను తాగిన టీకప్పు కడుగుతూ చెప్పసాగాడు —

"చిన్నతనం నుంచీ నాకు చదువంటే ఎంతిష్టమో చెప్పలేను మాష్టారూ ! ప్రతి క్లాసూ మంచి మార్కులతో ప్యాసయ్యే వాణ్ణి. చదువంటే నాకెంత ఇష్టమో నా తల్లికి నేను చదవాలని అంత ఆరాటం. నా చదువు గురించి మా అయ్యతో పోట్లాడి, తను కడుపు మాడ్చుకొని నాకు పెట్టి నన్ను స్కూల్‌కి పంపేది నా తల్లి.

మా అయ్య రిక్షా తొక్కేవాడు. అతని సంపాదనలో సగానికి పైగా తాగడానికీ సరిపోయేది. ఇంట్లోకి డబ్బులడిగితే నా తల్లి మీద చెయ్యి చేసుకునేవాడు మా అయ్య.

నా తల్లి కూలి పనికెళ్ళేది. ఉన్నోళ్ల ఇండ్లల్లో అంట్లు తోమేది. బట్టలుతికేది. క్షణం విశ్రాంతి లేకుండా ఆమె కష్టపడుతుంటే నా గుండె కోతకు గురవుతుండేది.

"నేను చదువుకోనమ్మా ...! ఏదైనా పని చేస్తాను" అనేవాణ్ణి ఆమె కష్టాలు చూడలేక.

వా ఆరాటాన్ని అర్థం చేసుకున్నట్లుగా నవ్వి, నన్ను ప్రేమగా దగ్గరకు తీసుకొని చెప్పేది నా తల్లి "లేదు బిడ్డా ...! నువ్ సదువుకోవలె. సదివి గొప్పోడివి కావాలె. మీ అయ్యలా రిక్షా తొక్కే బతుకు నీ కొద్దు. నీ సదువు కోసం నేనెన్ని కష్టాలైనా పడ్తాను. కానీ నువ్ మాత్రం సదూకోవాలె —"

నా తల్లి కష్టమ్మీద, ప్రోత్సాహం మీద నేను పదవ తరగతి వరకు వరకొచ్చాను. కాని నా చదువు మా అయ్యకంతగా ఇష్టముండేది కాదు.

"నీయమ్మ ...! రిచ్చావాడి కొడుకు రిచ్చావోడు కాకుండా కలకటేరవుతడా ? ఏందే వీడు సదూకునేది ?" అనేవాడు.

"ఇగో ...! నువ్ వాడి జోలికి మాత్రం యెళ్ళకు. నువ్ తిట్టినా, కొట్టినా ఆఖరికి ఇంట్లోకు నాలుగు పైసలియ్యకున్నా వాడి సదువు జోలికెళ్తే మాత్రం ఊరుకోను —" అని నా తల్లి గద్దించేది.

దాంతో యేమనేవాడు కాదు మా అయ్య. కానీ నేను పదోతరగతిలో వుండగా హఠాత్తుగా మా అమ్మ చచ్చిపోయింది. గుండె నెప్పితో పోయింది. ఇంకో నాల్గు నెలల్లో పరీక్షలు. నా తల్లి పోవటంతో మా అయ్యకి పూర్తి స్వేచ్ఛ దొరికింది. విచ్చలవిడిగా తయారయ్యాడు. గుడెసెకి రావటం చాలా వరకు తగ్గించేసాడు. సంపాయించిందంతా తాగటానికి పెట్టడం మొదలెట్టాడు. తమ్ముడూ, చెల్లాయిలూ ఆకలికి అలమటించిపోయే స్థితికొచ్చారు. మా అయ్యను డబ్బులడిగితే సాచి చెంపమీద ఒకటి కొట్టి— "పోరా ...! పోయి సంపాయించుకో ! నీకేం కాళ్ళు చేతులు లేవా ...? పోయి నువ్వో రిచ్చా తొక్కు—" అన్నాడు కటువుగా.

ఆ స్థితిలో యింక నేను చదువుకుంటానని ఎలా అనగలను ...? ముందు నేను కొంత సంపాదించాలి. నా చెల్లెళ్ళూ తమ్ముడూ ఆకలితో చావకుండా చూడాలి. ఫలితంగా నేనో రిక్షా అద్దెకు తీసుకొని నడపటం మొదలెట్టాను. మొదటకష్టమన్పించినా తర్వాత అలవాటు పడిపోయాను —" చెప్పటం ముగించి కళ్లు తుడుచుకున్నాడు రాములు.

నా మనసంతా అదోలా అయింది చాలా సేపు మౌనంగా వుండిపోయాను. నిశ్శబ్దాన్ని చీలుస్తూ రాములే అన్నాడు : "ఈ రిక్షా జీవితం చాలా కష్టంగా వుంది మాష్టారూ! మానసికంగా శారీరికంగా క్షణం తీరుబడి దొరకని ఈ బ్రతుకంటే అసహ్యంగా ఉంది. దీని మూలంగా నేను చదువుకోలేకపోతున్నాను."

"నువ్ చదువుకుంటావా రాములూ ... ! నీ కన్నీ ఏర్పాట్లూ చేస్తాను" అన్నాను సానుభూతిగా.

రాములు కళ్ళు కాంతితో నిండిపోయాయి ఈ మాట వినగానే. కానీ అంతలోనే ఏదో గుర్తు వచ్చినట్లుగా మొహం చిన్నబోయింది.

"లాభంలేదు మాష్టారూ ! ఇప్పుడున్న స్థితిలో అందుకు వీలుపడదు. పొద్దంతా రిక్షా తొక్కుతూ ఆ పని చెయ్యలేను. దీన్ని వొదుల్చుకొని కొంచెం తీరుబడిగల ఉద్యోగం వెతుక్కోవాలి. చదువుకోసం నేను రక్షా మానుతానంటే మా అయ్య అసలొప్పుకోడు. అసలు నా చేతిలో పుస్తకం చూస్తే చాలు మా అయ్య మండిపడతాడు. ఇష్టమొచ్చిన బూతులు తిడతాడు. ఒక్కోసారి పుస్తకం చింపి పోగులు పెడతాడుకూడా —"

"మరి నువ్ ఈ ఇతర సాహిత్యమంతా ఎప్పుడు చదువుతావు... ?"

'రాత్రివేళ మాష్టారూ ! రాత్రి బాగా పొద్దుబోయింతర్వాత అందరూ, ముఖ్యంగా మా అయ్య నిద్రపోయాక దీపం వెలిగించుకొని కూర్చుంటాను. కానీ మాష్టారూ... పొద్దంతా రిక్షా తొక్కుతానా...? వెళ్లి ఇంట్లోకి కావల్సినవన్నీ చూడాలి. నేనే వంటచెయ్యాలి. దీంతో బాగా అలుపు వొస్తుంది. నిద్రపోవాలన్పిస్తుంది.'

గదిలో నెమ్మదిగా చీకటి తెరలు వ్యాపించసాగాయి. నేను లేచి లైటు వెలిగించాను. ఉలిక్కిపడుతూ లేచాడు రాములు.

"వెళతాను మాష్టారూ...! పొద్దుపోయింది, రిక్షాను ఓనర్‌కి వాపస్ చెయ్యాలి. అదీగాక తమ్ముడూ చెల్లాయిలూ చూస్తుంటారు" అంటూ హడావిడిగా వెళ్లిపోయాడు.

* * *






## పొగ మేడలు

వారం రోజులు గడిచాయ్ —

హఠాత్తుగా నాకు కన్పించటం మానేసాడు రాములు. కాలేజి దగ్గరకు రాకపోయినా మా యింటివైపుకూడా రాలేదతను.

అతనికోసం పుస్తకాలు కొన్నాను. కనీసం వాటిని అతనికి అందజేద్దామనుకుంటే రాములు అయిపులేడు. ఏమైపోయాడా అన్న ఆందోళనతో కొద్ది రోజులు గడిపాను.

ఓ రోజు కాలేజినుంచి వొచ్చి గది తాళం తీస్తుంటే గొళ్ళానికి మడతపెట్టిన కాగితం కన్పించింది. విప్పిచూస్తే రాములు రాసింది. అక్షరాలు అస్తవ్యస్తంగా, వంకరటింకరగా ఉన్నాయి.

మాష్టరూ !

మీ కోసం వొచ్చాను — మీరు లేరు. ఈ మధ్య నాకో కొత్త ఉద్యోగం దొరికింది. అందుకే కొద్దిరోజులుగా మీక్కనిపించలేదు. ఈ ఉద్యోగం వల్ల నాకు చాలా తీరుబడి లభిస్తోంది. నాకెంతో ఆనందంగా వుంది. వొచ్చేవారం మిమ్మల్ని కల్సికొంటామ.

— రాములు.

ఆ ఉత్తరం నాక్కూడా చాలా సంతోషాన్నిచ్చింది. ఆదివారం కోసం ఎదుర్చూడసాగాను. కానీ అంతవరకూ ఆగాల్సిన అవసరం లేకుండానే నాకు రాములు తారసపడ్డాడు.

అతను అక్కడ అలా తారసపడ్తాడని నేనసలు ఊహించలేదు. ఓ ఫ్రెండ్‌ను కలవడానికి కోఠీ హస్పిటల్ వరకూ వొచ్చిన నాకు ఆ ఫ్రెండ్ ఎంతకూ రాకపోవటంతో కాఫీ త్రాగాలన్పించి హోటల్లో దూరాను.

హోటల్లో కూర్చున్నాక కాఫీ త్రాగాలన్న కోరిక కాస్త టిఫిన్‌లోకి మారింది. మేనూ కార్డులోకి చూస్తూ వుండిపోయిన నాకు — "నమస్కారం మాష్టరూ !" అన్న గొంతు దగ్గిరగా విన్పించటంతో తలెత్తాను. ఎదురుగా రాములు. ఒట్టి రాములు కాదు — హోటల్ బేరర్‌గా యునీఫారమ్ ధరించి, చేతిలో ట్రే పట్టుకొని —

ఆశ్చర్యంలోంచి తేరుకోవడానికి నాకు రెండు నిముషాల పైనే పట్టింది. "రాములూ ... నువ్వా ... ! నువ్విక్కడ ... ?" అంటూ ఆగిపోయాను.

"అవును మాష్టరూ ! ఉండండి ఇప్పుడే వొస్తాను. ఈలోగా మీరు కాఫీ త్రాగండి —" అంటూ వెళ్లి రాములు పదిహేను నిముషాల్లో మామూలు దుస్తుల్లో తిరిగొచ్చాడు. "పదండి మాష్టరూ బయటకెళ్దాం" అన్నాడు.

"పర్మిషన్ తీసుకున్నావా ?" అన్నాను నేను లేస్తూ.

తల ఊపాడు తీసుకున్నట్లుగా. బిల్లు చెల్లించి బయటపడ్డాం. ఇరువురం నడుస్తూ పార్కుదాకా వొచ్చాం. "ఇదేనా రాములూ నీ కొత్త ఉద్యోగం ... ?" అన్నాను నేనే ముందుగా సంభాషణ ప్రారంభిస్తూ.

"అవును మాష్టరూ ... ! మీకు నచ్చలేదా ?" అన్నాడతను నా ముఖంలో భావాలు అదోలా వుండటం కనిపెట్టి.

"ఉహూ ...! అదేం లేదు — ఇందులో నచ్చకపోవడానికేముంది ? కానీ ఈ ఉద్యోగం వల్ల నీకెలా తీరుబడి దొరుకుతుందా ని ఆలోచిస్తున్నా —"

దీనికి రాములు తేలిగ్గా నవ్వేసాడు —

"చాలా తీరుబడి మాష్టరూ! నా డ్యూటీ రోజూ ఉదయం సాయంత్రం మార్కెట్‌కి వెళ్లి లిస్టు ప్రకారంగా హోటల్‌కి కావాల్సిన సరుకులు తీసుకురావటమే. ఎప్పుడన్నా హోటల్లో రద్దీ ఎక్కువైనప్పుడు మాత్రం ఈ బేరర్ అవతారం దాల్చక తప్పదు. రెండు పూటలు భోజనం. చదువుకోడానికి కావాల్సినంత తీరుబడి —"

రాములు మొహం ప్రకాశవంతం కావటం గమనించాను. చదువు అనే అతని యజ్ఞం నిర్విఘ్నంగా కొనసాగుతున్నందువల్ల కల్గిన సంతోషమది.

"మరి ఉండటం ఎక్కడ... ?"

"ఇక్కడే మాష్టరూ ! ఈ హోటల్‌కి వెనక సందులోనే చిన్నగది. నాతోపాటు మరో సర్వర్ కూడా వుంటాడు. రూము చిన్నదే కాని అనుకూలంగా వుంది. ముఖ్యంగా లైటుంది..." రాములు చెప్పుకుపోయాడు.

"మరి జీతం... ?"

ఈ ప్రశ్నతో రాములు ఉత్సాహానికి కొద్దిగా బ్రేకు పడినట్లయింది. తల వంచుకొని చిన్నగా అన్నాడు. "అవును ! జీతం చాలా తక్కువ. నేను రిక్షా నడిపినప్పటికంటే కూడా చాలా తక్కువ మొత్తం వొస్తుంది. అయినా వొప్పుకున్నాను. నాక్కావాల్సింది చదువుకోవడానికి తీరుబడి మాష్టరూ ! తక్కువ జీతానికైనా ఒప్పుకున్నది అందుకే. తిండి సమస్య లేదు

### "కళ్లకు కట్టినట్లు !"

దివిలోని చంద్రుడిని
కప్పడానికి ప్రయత్నించే
నల్లని మచ్చల్లాంటి
మేఘాల గుంపులు చూస్తూవుంటే...
భువిలోని నీతిపరుణ్ణి
లొంగదియ్యాలని ప్రయత్నించే
అవినీతిపరుల యత్నాలు
కళ్లకు కట్టినట్లు కనిపిస్తున్నాయి !

ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వుండాలి...

ప్రొటీనులు
పెరుగుదలకి ముఖ్యం
పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు
శక్తికి
విటమిన్ ఎ
కళ్ళలో కాంతులకి
విటమిన్‌లు బి గ్రూప్
అన్ని ఇతర పోషక పదార్థాలని జీర్ణించుకోడానికి
విటమిన్ సి
రోగ నిరోధక శక్తి పెంపొందించడానికి
విటమిన్ డి
కాల్షియం మరియు ఫాస్ఫరస్‌లని గ్రహించేటట్లు చేయడానికి
ఐరన్
ఆరోగ్యవంతమైన రక్తానికి
కాల్షియమ్ మరియు ఫాస్ఫరస్
దృఢమైన ఎముకలు మరియు పండ్ల కోసం



# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని రుచికరమైన విధంగా అందజేస్తుంది

సిరిలాక్‌లో అయిదు రకాల పోషకాలు అన్నీ వున్నాయి—ప్రొటీన్లు, క్రొవ్వు పదార్థాలు, పిండి పదార్థాలు, ఖనిజాలు మరియు విటమిన్లు. మీ పాపకి ప్రతి పర్యాయమూ సిరిలాక్‌తో తయారు చేసిన ఆహారం మీరు యిచ్చినప్పుడు ఈ పోషకాలన్నీ సరియైన పాళ్ళలో చేరి వుంటాయి.




కలసికట్టుగా పని చేయడం వలన ఈ పోషకాలన్నీ హెచ్చు తగ్గులు లేకుండా ముఖ్యమైనవే. అందుకే అన్ని పోషకాలు 'సంపూర్ణం'గా వున్న సిరియల్ ఆహారం మీ పాప ఆరోగ్యానికి అత్యవసరం. ప్రతి సిరిలాక్ ఆహారం మీ పాపకి ఒక రోజుకి కావలసిన పోషక పదార్థాలలో నాల్గవ వంతుని అందచేస్తుంది. ఈ ఆహారం యిస్తున్నప్పుడు పోషక పదార్థాల కోసం మరొకటి మీరు యివ్వవలసిన అవసరం లేదు.

మీ పాపకి చనుపాలే తగినవి. అయితే పాపకి నాలుగు నెలలు వచ్చి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, మీ డాక్టర్‌ని సంప్రదించి సిరిలాక్ యివ్వడం ప్రారంభించండి.

# సిరిలాక్®

పాలు వుండనే వున్నాయి



సిరిలాక్ తయారు చేయడం ఎంతో సులభం. దీనిని ముందుగా మరగ బెట్టిన, గోరు వెచ్చటి నీటికి చేర్చండి. కలపండి. వడ్డించండి

**ఉచితం!** సిరిలాక్ పిల్లల పెరుగుదల చార్ట్

ఇందులో బరువు చార్టు, రోగనిరోధక మందుల రికార్డు, గట్టిగా ఉండే ఆహారం అలవాటు చేసేందుకు సూచనలు, యింకా ఎన్నో విషయాలు ఉంటాయి.
మీ కాపీ కోసం ఈ చిరునామాకు వ్రాయండి.
సిరిలాక్
పోస్ట్ బాక్స్ నం. 3 న్యూ ఢిల్లీ-110 008.

SAA/FSL/C/3151 TEL

NESTLÉ.

# పొ గ మే డ లు

కనుక జీతంలో కొంత డబ్బు పుస్తకాలకీ, ఇంటద్దెకీ ఉంచుకొని మిగతాది మా అయ్యకు పంపుతాను."

"మరి మీ తండ్రికి విషయం తెలుసా ?"

"అమ్మో...లేదు మాష్టారూ! తెలియదు. తెలిస్తే మా అయ్య ఊర్కోడు నేనిల్లు చేరేదాకా గొడవ చేస్తాడు. బలవంతంగా నన్ను లాక్కుపోతాడు. మళ్ళా ఆ రిక్షా తొక్కుతూ, డబ్బు కోసం యాతనపడుతూ, ఆరోగ్యం చెడగొట్టుకుంటూ... ఆ దుర్భర జీవితం నాకొద్దు మాష్టారూ! నేను చదువుకోవాలి. నా జీవితంలో వృధాపోయిన కాలాన్ని అధిగమించాలి —"

అతని కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరిగినయ్. బాధగా అరచేతుల్లో మొహం దాచుకున్నాడు. అతని భుజంమీద ప్రేమగా తట్టాను—

"మాష్టారూ! మీరు చెప్పండి. నేను చేసింది తప్పా? నన్ను నేను వృద్ధి చేసుకోవడానికి, నా ఆశయం నెరవేర్చుకోడానికి ఈ పని చేసాను. ఇది తప్పా...?" చటుక్కున న్నా చెయ్యి గట్టిగా పట్టుకుంటూ అడిగాడు రాములు.

"నో...! నాటెటాల్ రాములూ! నీది తప్పుపని అని ఎవ్వరూ అనరు. మంచి నిర్ణయం తీసుకున్నావు. చదువుకో — బాగా చదువుకొని పరీక్షలకి కూర్చో, నీకేది కావాల్సివచ్చినా నా దగ్గరకు రా. నీ కర్థంకాని పాఠాలు, పుస్తకాలు, ఆఖరికి డబ్బు కావాల్సి వొచ్చినా సరె — మొహమాటపడకు — వింటున్నావా ?"

తల ఊపాడు రాములు కృతజ్ఞతగా చూస్తూ.

"అన్నట్టు ఆదివారం మా యింటికి రా. నీకోసం కొన్న కొత్త పుస్తకాలున్నాయి తెచ్చుకుందువుగాని. విష్ యు బెస్టాఫ్ లక్" ఆప్యాయంగా రాములు చేయి నొక్కి పార్కు బయట కొచ్చేసాను.

* * *

ప్రతి ఆదివారం మా యింటికి రావటం అలవాటు చేసుకున్నాడు రాములు. అప్పుడప్పుడూ తోచని పాఠాలు చెప్పేవాన్ని, రాములు చాలా జీనియస్. వయసుకన్నా మనస్సు ఎక్కువగా ఎదిగినవాడు. ఎకడమిక్ చదువంతా అతనికి చాలా తేలిగ్గా వుంది.

పరీక్షలకి చదివినా రాములు ఇతర సాహిత్య పుస్తకాలు చదవటం మానలేదు. డిక్షనరీ సహాయంతో ఇంగ్లీష్ పుస్తకాలు సైతం ఆకళింపు చేసుకోవడానికి అతడుపడే తాపత్రయం నాకు అద్భుతంగా అన్పించేది.

రెండు నెలల తర్వాత ఓ రోజు నేను అనుకోకుండా స్వగ్రామం వెళ్లాల్సి వొచ్చింది. మా నాన్న ఏవో పొలం తగాదాల్లో ఇరుక్కుని రమ్మని రాయటం వల్ల నాలుగురోజులు సెలవు పెట్టి వెళ్ళిన నేను తప్పనిసరై మరో పదిరోజులు సెలవు పొడగించుకొన్నాను. అక్కడ వ్యవహారం సెటిల్ చేసుకుని తీరా బయల్దేరుదామనుకునే సరికి ఒంట్లో నలతగా అన్పించి అది జ్వరంలోకి దిగటంతో ఆగిపోక తప్పలేదు.

దాదాపు ఇరవై రోజుల తర్వాత కాలేజీలో అడుగు పెట్టాను. పీరియడ్స్ ముగించుకొని బయటపడేసరికి నాలుగున్నర దాటింది. బయట కొచ్చి రోడ్డు క్రాస్ చెయ్యాలని నిలబడ్డాను.

అంతలో "నమస్కారం మాష్టారూ! రిక్షా కావాలా ?" అనే మాటతోపాటు రివ్వున ఓ రిక్షా దూసుకు వొచ్చి నా పక్కనే ఆగింది.

ఉలిక్కిపడి చూస్తే రాములు. నేను నివ్వెరపోయి నిలబడ్డాను. "ఎక్కండి మాష్టారు!" రాములు రెట్టించడంతో తేరుకొని రిక్షా యెక్కాను.

రిక్షా పరిగెడుతుంది. రిక్షాలాగే నా మనసులోనూ ఆలోచనలు పరిగెడుతున్నాయి. ఎందుకిలా జరిగింది ? ఈ దుర్భర జీవితంలోకి రాములు మళ్లా ఎందుకొచ్చాడు ? చదువును సర్వస్వంగా భావించనవాడు దాన్నొదిలి తిరిగి రిక్షా ఎందుకు తొక్కుతున్నాడు... ?

"మాష్టారూ! మీకు కోపంగా వుంది కదూ ?"

రాములు ప్రశ్నకి 'కోపమెందుకోయ్ ?" అన్నాను. కానీ నా స్వరంలో ధ్వనించిన ఆవేదన గ్రహించాడు రాములు.

"నాకు తెలుసు మీరు బాధపడ్తారని" — రాములు చెప్పసాగాడు. "మీరు ఊరెళ్లాక చాలా మార్పులు జరిగాయి మాష్టారూ! మా అయ్య మళ్లీ పెండ్లి చేసుకున్నాడు. భార్యతోటిదే లోకం అన్నట్లుగా వుంటున్నాడు. నా చెల్లెళ్లూ తమ్ముడూ వీధుల్లో ముష్టెత్తుకుంటున్నారు. వాళ్ల కడుపులు మాడినా కన్నతండ్రికి కరుణ లేదు. ఆ పసివాళ్ల మొహాలు చూడలేకపోయాను మాష్టారూ ... అందుకే లొంగిపోయాను."

మా ఇంటిముందు రిక్షా దిగుతూ నేను రాములు మొహంలోకి చూశాను. ఏ భావాలు లేకుండా వుంది.

జేబులోంచి రెండురూపాయల నోటు తీసి అతని కందిస్తుంటే రాములు చెయ్యి మామూలుగా అందుకుంది. నా చెయ్యి మాత్రం కొద్దిగా వొణికింది.

"నన్ను క్షమిస్తారు కదూ మాష్టారూ ?" ఈ మాటలు రాములు దీనంగా అనలేదు — మామూలుగా అన్నాడు.

నాకాశ్చర్య వేసింది— ఇతనికి బాధగాలేదా ? లేక బాధలు మోసి మోసి ఏర్పడిన నిర్లిప్తతా అది ... ? ?

నేను మౌనంగా వెనుదిరిగాను మెట్లెక్కుతుంటే విన్పించింది రాములు చిన్నగా పాడుకుంటూ వెళ్లిపోవటం— —

"చూడు చూడు నీడలు ...! నీకలు పొగమేడలు ..."



కొత్త శీర్షిక ప్రారంభం!

## అద్భుత వ్యక్తులు

# అతీంద్రియ విజ్ఞానశాస్త్ర వ్యాప్తికి అంకితమైన మహామనీషి - డాక్టర్ రైన్

ప్రొ॥బి.వి. పట్టాభిరామ్




**ఒ**క మనిషి బాహ్యేంద్రియాలతో ఎన్ని పనులు నిర్వర్తించగలడో అంతకు ఎన్నోరెట్లు అధికం గల కార్యాలను అతీంద్రియశక్తితో చేయగలడని గాఢంగా విశ్వసించినవారిలో డాక్టర్ జె. బి. రైన్ ముఖ్యుడు. మనిషి మెదడులోని మహత్తు మనం ఊహించగలిగిన దానికన్నా వెయ్యిరెట్లు ఎక్కువగా ఉంటుందని ఆయన అభిప్రాయం. అతీంద్రియ విజ్ఞానంపై అధ్యయనంచేసి వేలకు వేలు పరీక్షలు, పరిశోధనలుచేసి డాక్టర్ రైన్ ఈ రంగంలో తనకొక ప్రతిష్టాకరమైన స్థానం సంపాదించుకున్నారు. ఇపుడు ప్రపంచం నలుమూలల్లోనూ ఆయన పేరుమీద లేబరేటరీలు ఉన్నాయి.

అతీంద్రియ విజ్ఞానశాస్త్ర పరిశోధనలు చేసినవారిలో మొదటివాడు కాకపోయినా డాక్టర్ రైన్‌కు ఈ రంగంలో అపారమైన గుర్తింపు వచ్చింది. తన జీవితకాలంలో ఈ శక్తులున్న వారిపై 85,724 పరిశోధనలుచేసి 24,364 సందర్భాలలో కృతకృత్యులయ్యారు. తన భార్య లూసియారైన్‌తో కలసి, అమెరికాలోని డ్యూక్ యూనివర్శిటీలోని పేరా సైకాలజీ లేబరేటరీలో ఆయన ఈ పరిశోధనలు జరిపేవారు.

తాను అనుకున్న ఒక విషయాన్ని ఎదురుగుండా లేదా దూరంగాఉన్న ఒక వ్యక్తికి, ఎటువంటి సంభాషణ, సౌజ్ఞలు లేకుండా తెలియజేయటం, అదే ప్రకారంగా ఎదుటివ్యక్తి మనసులో ఏముందో తెలుసుకోవటం ఎంతో సునాయాసంగా ప్రదర్శించగల విద్య అని ఆయన అభిప్రాయం. అయితే ఇది నేర్చుకోటానికి ఏకాగ్రత, దీక్ష, విశ్వాసం అవసరం అని అనేవారు. ఈ శక్తినే టెలీపతీ అంటారు. ఇలాంటివే "క్లయర్ వాయన్స్ (దివ్యదృష్టిలాంటిది) సైకోకైనసిస్ (కళ్ళతో చూస్తూ వస్తువులను కదిలించడం)" మొదలైన శక్తులు కూడా ప్రదర్శించడానికి కొంత విశ్వాసం, సంకల్పబలం ఉండాలంటారాయన.

"ఇవెలా సాధ్యం? మనకు ప్రామాణికంగా కొన్ని శాస్త్రాలు, ప్రకృతి ధర్మాలు ఉన్నాయి కదా! అటువంటపుడు ఇవి అసాధ్యం. ఇవి ప్రజల్ని తప్పుదోవ పట్టిస్తున్నాయి" అని విమర్శించిన వారితో ఆయన "ప్రకృతి ధర్మాలు అనేకం ఉంటాయి. అందులో మనకు తెలిసినవి కొన్ని మాత్రమే. ఇక శాస్త్రం విషయానికివస్తే మనకున్న శాస్త్ర పరిజ్ఞానం పదిశాతం మాత్రమే. ఇంకా తొంభై శాతం తెలుసుకోవలసింది ఉంది. తెలిసేంతవరకు ఇదంతా బూటకంగానే కనిపిస్తుంది. న్యూటను చెప్పేవరకు భూమికి ఆకర్షణ శక్తి ఉందని మనకి తెలియదు. టెలిఫోన్, రేడియోలాంటి యంత్రాల గురించి మన పూర్వీకులు కనీసం ఊహించి కూడా ఉండరు. ఒకవేళ ఎవరైనా వీటిని ప్రదర్శించినా, అదేదో దెయ్యాల సహాయంతో చేసిన ప్రక్రియ అని భయపడి ఉండేవారు. పూర్వం కేవలం పురాణాల్లోనే విచిత్రంగా చిత్రించబడిన పుష్పక విమానం ఈ తరం వారు చేసి చూపిస్తారని వారు అనుకుని ఉండరు. ఈనాటి ఒక మహాత్యం రేపు ఒక మామూలు విషయం కావచ్చు. సైన్సులో మన శాస్త్రజ్ఞులు రోజు రోజుకీ ఎన్నో వింతలు కనుగొంటున్నారు. కాలానుగుణంగా ఎన్నోమార్పులు వస్తూంటాయి. మనం "అసంభవం" అనుకున్నది, తన తరువాత తరం వారు చాలా సునాయాసంగా "సంభవం" అని చేసి చూపవచ్చు. కాబట్టి ఈ శక్తులను విమర్శించడంకన్నా, మంచిమనసుతో పరిశోధిస్తే తప్పక వీటి ఉనికిని గుర్తించగలుగుతారు" అని వివరించారు.

సైకాలజీ, థియాలజీ శాస్త్రాలలో డాక్టరు

(54 వ పేజీ చూడండి)

# కొత్త సీరియల్ ప్రారంభం!

# స్వప్నభంగం

## డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

**మామిడి చిగుళ్లు నములుతున్న పుంస్కోకిలాలాపం - కొలనుల్లో శతధా సహస్రధా వికసించిన కమలాల పరిమళాలతోబాటు విజృంభించిన బంభరాల ప్రణయ ప్రణవ సంగీత నిక్వణాలు.**

**చిరుగాలి సవ్వడితో సంస్పర్శతో పులకరించిన సంపెంగల సన్నజాజుల రేకుల తాకిడితో సుతారంగా అతి మెత్తగా మారి ప్రవహించే ప్రసరించే ఉషస్సుషమాకాంతిరేఖలు.**

**తెల్లదనంతో** వెల్లవేసినట్లున్న ఆకాశపు పెండ్లి పందిట్లో ముత్యాల చాందినీలో, వ్రేలాడుతున్న మబ్బుతునకలు కామరూపధారణతో దశ దిశాభిముఖంగా స్వయంవరానికై పయనిస్తున్న రాజకుమారులమాదిరి మంద మందంగా సుందరంగా నడక.

భూదేవి ఆరించిన చిలకపచ్చ చీరెమీద అల్లిన జరీ పోగుల్లాగా, ఆకుపచ్చని చెట్లతో గరికెతో నిండిన వనాలమధ్య పొలాలనడుమ విరబూచిన కలువలూ, మందారాలూ.

శ్రీనాథుడు రసజగత్తులో లీనమైపోయాడు. అతనికి చుట్టూ తోట కనిపించడం లేదు, తోటల నడుమ దొరువులూ, దొరువుల్లో పరుచుకున్న తామరాకులూ, తామరాకులమీద ముత్యాల్లా దొర్లే నీటిబొట్లూ, నీటిబొట్ల నుండి లేచిన సన్నని తుంపురుల జల్లులు, జల్లులతో తడిసిన గాలి, గాలితో నిండిన వెలుగు, వెలుగుల రేకులతో వికసించిన పూలు, ఉషస్సే శబ్దంగా రూపంగా రసంగా గంధంగా మారి స్పృశిస్తున్నది.

భూమ్యాకాశాల మధ్య అభేదత్వాన్ని సాధిస్తున్నది.

నల్లని రాత్రినీ ఎర్రటి పగలు కలిపి తన తెల్లటి వెండిపోగుతో కలిపి కుడుతున్నది.

శ్రీనాథుడు నిలువెత్తు మనిషీ కరిగిపోయాడు. తానే రసవాహినిగా మారిపోయాడు.

మరంద ప్రవాహంగాజారిపోయాడు. అతని శరీరంపై పులకలు కలువ మొగ్గల్లా లేచాయి. అతని కళ్లవెంట తన్మయబాష్పాలు రసస్రవంతుల్లా జాలువారాయి. అతని భావాలు అలలు అలలుగా, కెరటాలు కెరటాలుగా, తరంగాలు తరంగాలుగా అనుక్రమంతో పుంఖాను పుంఖంగా విజృంభిస్తున్నాయి.

గద్గదమైన అతని గొంతు సన్నగా శ్రుతి చేయబడింది. మెట్లుమెట్లుగా పలికించబడింది.

రాగ కదంబకం వెలువడింది :

''రంగవల్లుల నద్దుకొని ఉద
యాంగణము మాంజిష్ఠకాంతుల
తరుణ కిరణారుణములను తో
రణ సమూహముతోడ నిలిచెను
ఇది ఉషస్సుకు కాంతి మూర్తికి
ఉదయ సుముహూర్తమ్ములోపల
ఎదలు కలిసిన గాథనేనుని
వేదనము చేసెదను జగతికి—''

శ్రీనాథుడు పాడుతున్నాడు —

పాటలే కవిత్వ లతలుగా పాకుతున్నాయి — పాకిన ప్రతి లత చివరా గుత్తులు గుత్తులుగా శబ్దాల పూలు, కవిత్వపు గెలలు.

గెల గెల నుండి ఆ తొణికే కవితా రస ప్రసారం — బ్రహ్మానంద సబ్రహ్మచారియైన ఆనంద ప్రవాహం—అతనికింక లౌకిక జగత్తూ అందులోని మంగతాయారూ ఎక్కడ జ్ఞాపకముంటుంది ? ?

* * *

ఇంట్లో నెయ్యి నిండుకున్నది. రాత్రి శ్రీనాథుడితో ఒకటికి రెండుసార్లు చెప్పింది. 'మరచిపోకండి– పొద్దున్నే ఆ తోటలోకి పోయి కూర్చొని పగటికలలు కనడం మొదలెట్టకండి. ముందు ఓ కిలో నెయ్యి తెచ్చిచ్చి మరీ వెళ్లండి.'

తెల్లవారింది.

శ్రీనాథుడు తోటలోకే వెళ్లాడు.

ఉషస్సును చూస్తున్నాడు.

ఉషస్సును తాగుతున్నాడు.

ఉషస్సును తనలో నింపుకొని తాను ఉషస్సులో నిండిపోయాడు.

తెల్లని పాలవంటి ఉషస్సు కాగి ఎరుపు రంగుకు తిరగడానికి కొన్ని గంటలు పట్టింది. పొద్దు కరకర పైకి వచ్చింది.

వాకిట్లోకి ఎందుకనో కూరలు రాలేదు. చింతచిగురు మాత్రం వచ్చింది. దాన్ని పప్పులో వేసింది. వంకాయో బీరకాయో వస్తుందేమోనని చాలాసేపు ఎదురు చూసింది. రాలేదు. తాయారుకు చిరాకు ఎక్కువైంది.

ఆ రోజు శనివారం—

తాను వెంకటేశ్వర స్వామివారి పూజకూడా చేసుకోవాలి. కొబ్బరికాయ తెప్పించాలి. ఎలా ??

'ఈయన పిట్టలదొరలాగా ఏ తోటల్లో తిరుగుతున్నాడో' అనుకుంది మంగతాయారు.

పిట్టలదొరంటే లోకంలో వున్న అర్థమేమిటో ఆమెకు తెలియదు కాని తన భర్త మాత్రం నిజంగా పిట్టలదొరే !

తాను నడిస్తే 'ఓహో నా ఇంటి కొలనులో హంస తిరుగుతున్నదే' అంటాడు. కోపంవస్తే 'గువ్వలా ముడుచుకున్నావేం' అంటాడు. ఆకాశంలో చుక్కలు వస్తే 'పురి విప్పుకున్న ముత్యాల చుక్కల కన్నులతో నీలి ఆకాశం నెమలిలా పరుచుకొని నర్తిస్తున్నది' అంటాడు. తాను ఏదైనా మాట్లాడితే కోయిల కూస్తున్నదంటాడు.

పెళ్లైన కొత్తల్లో ఇవన్నీ తాయారుకు తమాషాగానే వుండేవి కాని క్రమంగా ఆమెకు విసుగు బయలుదేరింది.

జీవితాన్ని జీవితంగా చూడటమే ఆమెకు తెలుసు కాని కవిత్వాలూ అలంకారాలూ జీవితంతో రంగరించడం ఆమెకు గిట్టలేదు.

స్నానంచేసి వెంకటేశ్వరస్వామి పటంముందు కూర్చున్నది. అక్షతలను పసుపువేసి కలిపింది. కాని మనస్సు మాత్రం స్వామి పాదాలమీద నిలవడంలేదు.

పెందలాడే రమ్మనిచెప్తే ఇంతవరకూ ఈయన ఇంటి ముఖం చూడలేదు.

ఏం చేయాలి తాను ?

పూలూ తులసిదళాలూ వేసి స్వామివారిని

పూజించింది. కర్పూర నీరాజనాన్ని తీసుకున్నది. అవసర నైవేద్యంగా కాస్త కలకండ తీసుకున్నది.

ఇంతలో వచ్చాడు శ్రీనాథుడు.

వస్తూనే ఆమెకు కొబ్బరికాయ అందించాడు. కూరల సంచీని వంట ఇంట్లో పడేశాడు.

తాయారు కాయ కొట్టింది. హారతి నిచ్చింది. నైవేద్యం పెట్టి పూజ ముగించింది.

భర్తతో పోట్లాడాలని పూజ మరి కొంచెం త్వరగా ముగించింది.

''ఏమండి ఎక్కడికి వెళ్లారు ?''

''ఉషస్సు దగ్గరికి.''

తాయారుకు బాగా కోపం వచ్చింది.

''అయితే దాని దగ్గరే కూర్చోకపోయారా? మళ్లీ సంపారమెందుకు ??... నెయ్యి తెమ్మని రాత్రనంగా చెప్పాను– తెచ్చారా ?''

''ఆఁ —''

''ఇప్పుడా తెచ్చేది– ఇంత ఆలస్యంగా.''

''తాయారూ ! భోజనం చేసేది పన్నెండు గంటలకు, ఇప్పుడింకా పదికొట్టలేదు—ఎందుకంత హడావుడి.''

''ఇంట్లో ఒక్క కూరలేదు.''

''అదిగో నాలుగు కూరలు తెచ్చాను. బచ్చలి కూర పప్పులో వెయ్యి, వంకాయ కొబ్బరి పెట్టి వండు, కాకరకాయ వెల్లుల్లికారం పెట్టి ములక్కాయ సాంబారుకాయి.''

''ఇవ్వాళ శనివారం వెల్లుల్లి కూడదు.''

''అయితే ఏం పోయె – పులుసూ బెల్లం పెట్టి వండు.''

తాయారుకు దెబ్బలాడడానికి కారణమేమీ దొరకడం లేదు.

''పూజకు కొబ్బరికాయ లేనే లేదు.''

''సమయానికి వచ్చింది కదా !''

''వస్తుందని నాకేం తెలుసు – కంగారు పడ్డాను.''



''నీకు తెలియకున్నా నాకు తెలుసు కదా నీవు పది గంటలకు పూజ చేసుకుంటావని.'

'అవును మరి మీరు చేయకపోతే నేనైనా చేయవద్దా.'

'వెర్రిమొఖమా ! శబ్దబ్రహ్మను ఉపాసించే నాకీ సాకారమైన శిలామూర్తుల పూజతో ఇంకా పనేమిటే !'

భర్త అన్నది తాయారుకు అర్థమైందో కాలేదో చెప్పడం కష్టమే అయినా ఆయనేదో నాస్తికునిలా మాట్లాడుతున్నాడని మాత్రం ఎందుకో అనిపించింది.

'ఇదిగో చూడండి— మీరు ఏ వస్తువులు ఎప్పుడు తెచ్చారన్నది ముఖ్యంకాదు. దృష్టిని తోటలమీదా దొడ్లమీదా ఉంచకుండా ఇల్లుగూర్చీ ఇల్లాలుగూర్చీ ఆలోచించాలనే నా ఉద్దేశం.'

'అలాగే— నేనేమీ కవితపేర వాస్తవజగత్తు నుండి పలాయన వాదాన్ని చిత్తగించడం లేదు, కానీ తాయారూ ఒక్కటి చెప్పు— ఈ మానవు లెంత మూర్ఖులో ఆలోచించు. ఉదయం ఉషస్సు వారి కోసం వెండి వెలుగులతో సాక్షాత్కరిస్తుంది. సాయంత్రం సంధ్య మళ్లీ కుంకుమ పొడిని దోసిళ్లతో వెదజల్లుతూ వుంటుంది. అయితే వీరికీ ఉషస్సు అక్కర్లేదు. ఇది చూచి ఆనందించే శక్తీ ఆసక్తీ వీరికి లేదు. సూర్యుడు సప్తాశ్వాలతొ మనకోసం ఎంతో దూరం నుండి పరుగెత్తుకొని వస్తుంటే వాళ్ళు కాలువ గట్టున చెంబులు పట్టుకొని పడమటి దిక్కుగా ముఖాలు పెట్టుకు నడుస్తారు. తాయారూ— నేనూ అలా చేయడం నీ కిష్టమా ?? ఈ ప్రకృతిని నా మనస్సులో ముద్ర వేసుకొని, దాన్ని శబ్దాలలో అచ్చులచ్చులుగా కలకండ పోతపోసి సమాజాని కివ్వడం తప్పంటావా ? ఏం చెప్పు—''

తాయారు కూర తరుగుతూ మధ్య మధ్య భర్త ముఖం చూస్తూ వింటున్నది.

'పిచ్చిదానా — దేవుడు మనకోసం ప్రకృతినే వరంగా ప్రసాదించాడు. ఉదయం ఒక రంగుల

# స్వప్న భంగం

తెర — సాయంత్రం ఒక రంగుల వల — రాత్రి మొత్తం వెన్నెల పాలనదులు — ముంగిట్లో ఉన్న ఈ ఐశ్వర్యాన్ని అనుభవించడం చేతకానివాడికి అజంతాలెందుకు ? ఎల్లోరాలెందుకు ? హిమాలయాలూ మహిమాలయాలూ వాడి తాపాన్ని 'తీర్చలేవు—గుర్తుంచుకో' కొంతసేపైన తరువాత శ్రీనాథుడి ఆవేశం తగ్గుతుంది — ఆపైన తన పనిలోకి పోతాడు.

తాయారుకిది తెలుసు. అందుకే మాట్లాడకుండా ఊరుకున్నది.

శ్రీనాథుడు లోనికి వెళ్లాడు.

స్నాన సంధ్యాది విధుల్లో మునిగిపోయాడు.

తన భర్త ఇంటిపనులు నిర్లక్ష్యం చేయడం లేదని తనకు తెలుసు. నిజమే !

కాని తాను కోరుకుంటున్నది కేవలం ఆయన ఇంటిపనులు చేస్తూ వుండడమేనా ?

ఇంతకన్నా ఇంక ఎక్కువ ఏమీ వద్దా ?

తనకూ తోటి స్త్రీలలా ఎన్నో కోరికలూ వాటి సాఫల్యానికై పథకాలూ వుండవా ? ?

వాటినన్నిటినీ తీర్చేందుకు నెమళ్లనూ పాలపిట్టలనూ చూస్తూ మురిసిపోయే తన భర్త ఎలా నెరవేర్చగలడు ? ?...

రోజూ వంట చేస్తూ ఇలాగే తాయారు ఆలోచిస్తుంది — ఇవ్వాళకూడా అలాగే ఆలోచించింది. ఆలోచిస్తూనే వంట ముగించింది.

వంట ముగించి మళ్లీ ఆలోచించింది.

భర్తకు కవిత, ప్రకృతి ఎంత కళాత్మకంగా వుండాలో నిత్య జీవితం కూడా అలాగే వుండాలి.

వంటలో ఏ చిన్న లోపం కనపడ్డా వెంటనే ఆక్షేపిస్తాడు.

శ్రీనాథుడు భోజనానికి కూర్చున్నాడు.

తాయారు లేత అరిటాకు వేసింది —

పొడిపొడిగావున్న నెల్లూరు మొలకొలుకుల బియ్యపు అన్నం పెట్టింది.




## తారుణ్యం

తలపు తీరుతో
తెలుపు నలుపులతో
మైపూతలతో
తళుకు బెళుకులతో తళ్ళోడు నగలతో
రవంతైనా పని లేనిది;
సోయగాలకు పుట్టిల్లు
విలాసాలకు హరివిల్లు
తారుణ్యం.
తారుణ్యం సహజ లావణ్యం !

— చల్లా రాధాకృష్ణశర్మ

చింతచిగురుపప్పు, వంకాయ కొబ్బరివేసిన కూరా, ముద్దపప్పు వడ్డించింది. స్టీలు గిన్నెలో మోరుకొళంబూ, మరో గిన్నెలో మునక్కాయల సాంబారూ పెట్టింది.

పక్కనే వేరే రెండు పళ్లాలలో మామిడి పండ్ల ముక్కలూ, అప్పడాలూ, వడియాలూ.

శ్రీనాథుడు పరిషేచనచేసి భోజనాని కుపక్రమించాడు. కర్పూరంలా ఘుమ ఘుమలాడే ఆవునేతిని చేతిపైకి వేసింది. శ్రీనాథుడు రెండు ముద్దలు తిని అన్నాడు 'తాయారు — వంకాయ కూరలో లేత కరివేపాకు ఎందుకు వెయ్యలేదు ?'

'వేశానే...'

'ఏమిటి వేశావు నా ముఖం — చూడు ఆకు కొంచెం ముదిరింది — లేత ఆకయితేకూరతో బాటు కరిగిపోవాలి — దాని పరిమళం మొత్తం కూరకు పట్టాలి. తెలిసిందా.'

''తెలిసింది — కాని పతిదేవా ! లేత ఆకు మీరు చెప్పినంత సుగంధం వుండదు.''

శ్రీనాథుడు నవ్వి 'చూడు యోజనగంధీ ! నీ కరస్పర్శతో ఆకులేమిటి, రాళ్లూ రప్పలూ కూడా చందన తరువుల్లా మారిపోయి మైళ్ల పొడుగున సుగంధాన్ని విరజిమ్ముతాయి. నాకు తెలుసు' అన్నాడు.

తాయారు ఏమీ మాట్లాడలేదు.

ఆమెకీ పైత్యం కొత్తకాదు. పెళ్లైన నాటి నుండీ చూస్తున్న ముచ్చటే !

''చూడు— చింతచిగురు పప్పులో కాడలు ఎక్కువగా వున్నాయేమిటి ''

''తొందరలో ఏరలేదు.''

''ఎందుకంత తొందర— చూడు తాయారు మీ నాన్నగారు రామానుజస్వామిగారు ప్రవృత్తి యోగంలో పెద్ద పండితులు— అసలు జీవిత మంటే ఏమిటి ? కళ అంటే ఏమిటి ?? కళా, కాకరకాయా, అని తెలుగువాళ్ల సామెతగా




## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### ఎస్. డి. ఎస్. ఆర్. — అమలాపురం

మన నిత్య జీవితంలో సైకిల్ తప్పనిసరి ప్రయాణ సాధనం అయింది కదా ! నిత్యం సైకిల్ త్రొక్కే వారి కంటె త్రొక్కనివారే రతిలో ఎక్కువ పాల్గొనటం అనేది ఎంతవరకు నిజం ?

★ పూర్తి అబద్ధం. వేరే ఏదైనా లోపం వల్ల కొందరికి దాంపత్య సుఖం తగ్గితే దానిని సైకిల్ తొక్కడానికి అంటగట్టటం జరిగి ఉంటుంది.

### వి.కె.పి. — అవంతపురం

మా నాన్నగారికి 10 సంవత్సముల క్రితం రక్తపుపోటు ఎక్కువగా వచ్చి, ఎడమభాగమంతా ముఖ్యంగా చెయ్యి, జబ్బలో నెప్పి అలాగే వుండి పోయింది. ఎందరో డాక్టర్లకి చూపించాము. ఎన్ని మందులు వాడినా ప్రయోజనము కన్పించ లేదు. ఇప్పుడు వ్రేళ్లగూడా పట్టు ఇవ్వటము లేదు.

★ రక్తపుపోటుని అదుపులో ఉంచటానికి వైద్యుల సలహా ప్రకారం మందులు వాడటం చాలా ముఖ్యం. అప్పుడప్పుడు మూత్ర పరీక్ష చేయించుకోవటం, చేతులు, కాళ్ళు ఎక్సర్ సైజు చేయించటం, నరాల బలహీనతకి బికాంప్లెక్స్ మాత్రలు వాడటం మంచిది. వారు వైద్యుల పర్యవేక్షణలో ఉండటం ఎంతైనా అవసరం.

### ఎస్. ఆర్. — అల్లివగరం

చాలా రోజులనుండి విరోచనములో రక్తపు జీర పడుతున్నది. ఇప్పుడు అది ఎక్కువైనది. పురీషనాళం దగ్గర నెప్పిగా వుంటుంది. దీనికి కారణం ఏమిటి ? చికిత్స ఏమిటి ?

★ మీరు శస్త్ర వైద్యుల వద్ద చూపించు కోవలసి ఉంది. వారు పరీక్షచేసి పైల్స్ ఉన్నదీ లేనిదీ తెలియజేస్తారు.

పరీక్షానంతరం, రోగాన్నిబట్టి చికిత్సా విధానాన్ని నిర్ణయించవలసి ఉంటుంది.

### టి. ఆర్. — చోడవరం

నా వయస్సు 18 సంవత్సరములు. నోటి నుండి అప్పుడప్పుడూ ఉమ్మితోపాటు రక్తము వచ్చుచున్నది. దీనికి కారణమేమిటి? ఇది ఏమైనా జబ్బా ? ఏమైనా మందులు వాడాలా ? నాకు స్వజాతి సంపర్కం అలవాటుంది. దానివల్ల ఏమైనా దుష్ఫలితాలున్నాయా ?

★ మీరు రోజుకి 500 మి. గ్రా.ల విట మిన్ 'సి' వాడండి. స్వజాతి సంపర్కం వల్ల రాగల అపాయతరాలను గురించి, ప్రస్తుతం అమె రికాలో ఉన్న "ఎయిడ్స్" రోగాన్ని గురించి కొన్ని నెలల క్రితం ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నేను వ్రాయటం జరిగింది. పాత పత్రికలు తిరగ వేయండి.

### పి. హెచ్. ఆర్. ఎమ్. — ఖమ్మం

కంటికి దృష్టిలోపము వున్నప్పుడు కళ్ళజోడు తప్పనిసరిగా వాడాలా ? లేక మందుల వలన తగ్గుతుందా ?

★ దృష్టిలోపం (ఒక విటమిన్ 'ఎ'లోపం వల్ల ఏర్పడితే తప్ప) ఉన్నప్పుడు మందులతో తగ్గే అవకాశంలేదు. కళ్ళజోడుగాని, కాన్‌టాక్ట్ లెన్సుగాని వాడవలసి ఉంటుంది.

### ఎ.ఎ.ఆర్.ఆర్. — పెద్దాపురం

మా అమ్మ వయస్సు 40 సంవత్సరములు. నాలుగు సంవత్సరాలనుండి కుడికాలు ఎముక పైనుండి క్రింది గిలకదాకా బాగా నెప్పిపస్తోంది. ఒకొక్కసారి నడవటానికి చాలాబాధగా వుంటుంది.

★ ఆర్థోపీడిక్ డాక్టర్లు ఎక్స్‌రేలు తీసి రోగాన్ని నిర్ణయిస్తారు. డయాగ్నోసిస్ (రోగ నిర్ధారణ)ని అనుసరించి చికిత్స చేయవలసి ఉంటుంది. ★

---

వెక్కిరిస్తారు కాని నిజంగా కళ అనేది ఆకాశం నుంచి ఊడిపడదు— కాకరకాయ దగ్గిర నుండే ప్రారంభమవుతుంది— చేదు కాకరకాయను పొట్ట కోసి వెల్లుల్లికారం పెట్టి వేయించి ఘుమఘుమ లాడేటట్లు చేసి స్వాదుష్టంగా మార్చి తినడం కళ కాదా ? చక్రాలుగా తరిగి ఎత్తుకెత్తు ఉల్లిపాయలు సన్నగా తరిగి కలిపి ఎర్రడాలుగా, అంత చేదు లేకుండా అంత మాడిపోకుండా సన్నని సెగమీద సుతారంగా వేయించి తినడం కళ కాదా ? చతుష్షష్టి కళల్లో ఇదొక మహోన్నత కళ. కళంటే ఏమిటి తాయారూ, మతమంటే ఏమిటి ? చింతచిగురు కాడలు నువ్వు సరిగ్గా ఏరకపోవడం నివృత్తి— సరిగ్గా ఏరడం పేరే ప్రవృత్తి— "సక్రమంగా చిలుము గొట్టం పింపగలిగినవాడు బ్రహ్మవిద్యను కూడా సక్రముగానే అభ్యసించగలుగుతాడు" అన్నారు స్వామి వివేకానందులు. శ్రీనాథుని ప్రసంగంలో వివేకానందుడూ, అరవిందుడూ, రామకృష్ణుడూ, రామతీర్థులూ అలా నిరంతరం విహరిస్తూ వుంటారు— ప్రతి మాటకూ ఒక ఉదాహరణ, ఒక కొటేషన్ —

"మోర్ కొళంబు వేసుకోలేదు."

"మోర్ కొళంబు చిక్కగా పసుపుపచ్చగా వుండాలి. ఇది తెల్లగా బద్దలుబద్దలుగా విరిగింది. అందుకని వేసుకోలేదు."

"అయినా రుచి బాగానే వుంటుందండీ—"

"నీవేం శబరివా, బాగా వుంటుందని నీకు ముందే ఎలా తెలుసు — ఒకవేళ నోటికి బాగున్నా కంటికి బాగుండనక్కరలేదా ? కంటికీ నోటికీ చెవికీ కాదు హృదయానికి ఆత్మకూ కూడా నచ్చాలి ఏ విషయమైనాసరే —"

పెరుగు వేసుకొని అందులో మామిడి ముక్కలు నంజుకుంటూ భోంచేస్తున్నాడు శ్రీనాథుడు.

తాయారు ! భర్తను చూస్తూ అలా ఎదురుగా కూర్చున్నది నిశ్శబ్దంగా.

"తాయారూ తెల్లని ఈ పెరుగన్నంలో గుండ్రంగా ఎర్రగా వున్న మామిడిపండు బద్ద, పాలసముద్రం మధ్యనుండి లేచిన అరుణారుణ కమలంలా లేదూ..."

"ఆఁ — నల్లని ఈ ఇంట్లో తెల్లని నేను, నీలాకాశంలోని చందమామలాకూడా వున్నాను — నీలికొలకులో వెన్నముద్దలాంటి హంసలా కూడా వున్నాను."

శ్రీనాథుడు మహానందభరితుడైనాడు.

"తాయారూ ! ఇప్పుడు నువ్వు నా భార్య వనిపించుకున్నావు— ధన్యుణ్ణి నేను— ధన్యుణ్ణి."

( ఇంకా వుంది )



# స్నేహం

అంబుజా భూషణ్

సముద్రం లోపల కోట్ల మునులు తపస్సు చేసుకుంటున్నారేమో కాషాయం రంగులో హాయిగా ఉంది.

వల భుజాన వేసుకొని నడుస్తున్న రంగడు ఆశ్చర్యంగా ఆగిపోయాడు.

"ఆ శంకు నాకివ్వవూ ?"

"ఎవురూ నన్నేనా ?"

"అవును అదంటే నాకు చాలిష్టం."

"తీసుకో" వలలోంచి శంఖును అపురూపంగా అందించాడు.

ఉవ్వెత్తుగా లేచి పడిన అల గంగడి కాళ్ళ సందుగా దూరి గిలిగింత పెట్టింది.

"చూడూ ఆ కనిపించే మేడే మాది."

"నాకు తెలుసు అక్కడేగా మా గుడిశెలు"

"అక్కడకు రా నీకు డబ్బులిస్తాను."

"ఉహు నాకు డబ్బులొద్దు."

"మరేం కావాలి."

"అడిగింది ఇస్తావా"

"వో"

"వొట్టు."

"వొట్టు."

"మరే మరే నాకు సదూ సెప్తావా."

"అంతేకదా ఇప్పుడు నాకు సెలవలే రేపట్నుంచి మా యింటికి రా చెప్తాను."

"మరి నా దగ్గర పలక లేదుగా."

"నా దగ్గరుంది ఇస్తాలే."

రాతిమీద పడిన అల కొన్ని వేల చినుకులై చొక్కాలేని గంగడి వొంటిపై బడి జిల్లుమనిపించాయి.

"మీరు ఎన్ని సదూతూన్నారు చినబాబూ"

"ఏడోక్లాసు. నా పేరు రమేష్. నీ పేరేమిటి."

"గంగడండీ."

"నిన్ను గంగూ అని పిలుస్తా నువ్వు నన్ను రమేష్ అని సిలువు ఏం ?"

గంగడు బిడియంగా తలొంచుకున్నాడు.

"పర్లేదు మనిద్దరిదీ వొకే వయసుగా. ఇకనుంచీ మనిద్దరం దోస్తులం" గంగడి భుజంపై చేయి వేశాడు రమేష్.

కడుపు నిండిన కొంగ ఆకాశంలో రెక్కలార్చుకు ఎగిరినట్లుగా ఎగిరింది గంగడి మనసు.

"వెళ్దాం పద మా మమ్మీ ఎదురు చూస్తొంటుంది."

రమేష్ చేయి అందుకొని ఉత్సాహంగా అడుగులేశాడు గంగడు.

మర్నాడు శుభ్రంగా స్నానంచేసి రమేష్ ఇంటికేసి నడిచాడు గంగడు.

"రా గంగూ నీకోసమే ఎదురుచూస్తున్నా నా గది పైనుండిరా" రమేష్ గంగడి చేయందుకున్నాడు.

''ఊహూ లోనకొద్దు అమ్మగారూరుకోరు'' చేయి విడిపించుకుంటూ అన్నాడు.

''ఫర్వాలేదు మా మమ్మీ నా ఫ్రెండ్స్ నందరినీ రానిస్తుంది.''

గదిలోకడుగుపెడుతూనే బుల్లి రేడియోపైన ముడుచుకు పండుకొని ఉన్న శంఖు కనిపించింది.

''చినబాబు ఊహూ రమేష్ నీగది బలేగా ఉంది'' రమేష్ ఇచ్చిన పలక తీసుకొని క్రింద కూర్చుంటూ అన్నాడు.

''నువ్వు నా దోస్తువి నా పక్కన కూర్చో'' అంటూ రమేష్‌ను కుర్చీలోంచి కూర్చోపెట్టాడు. బలపం పట్టుకొని ''అ'' దిద్దుతుంటే గంగడి చేయి వణికింది.

''ఫర్లేదు మొదట్లో అలానే ఉంటుంది చదూకుంటూ దిద్దు''.

''అ ఆ''లు దిద్దుకుంటున్న గంగడు ''బాబూ పాలుత్రాగు నాయనా'' అంటూ వచ్చిన పార్వతిని చూస్తూనే గబుక్కున లేచి నిలబడ్డాడు.

''ఏయ్ ఎవరివి నువ్'' ముఖం చిట్లించి ఘర్జించింది పార్వతి.

''నేను, నేనాండి సేపలుపట్టే ముత్యాలు కొడుకునండీ''

''ఇక్కడ నీకేంపని పో బయటికి అందినవి పట్టుకెళతానికి ఇదో ఎత్తు. మరోసారి వచ్చావంటే కాళ్ళిరగ్గొడతాను.''

''మమ్మీ వాడు నా ఫ్రెండు నేనే రమ్మన్నాను. ఆగు గంగూ వెళ్ళొద్దు'' అరిచాడు రమేష్.

అంతే పార్వతి ఐదువ్రేళ్ళూ బలంగా రమేష్ చెంపపై బడ్డాయి. గంగడు గబగబ బయటి కెళ్లిపోయాడు.

''వాళ్లసంగతి నీకు తెలీదు మన తోటలో కొబ్బరికాయలు కొట్టుకెళ్ళేది వాళ్లే. ఒఠి దొంగ బుద్ధులు. అట్లాంటివాడు నీకు ఫ్రండంటే నవ్విపోతారు. జడ్జీగారబ్బాయితో స్నేహంచేస్తే వద్దన్నానా.''

''కానీ మమ్మీ వాడిది చాలా మంచిబుద్ధి.''

''పిచ్చివాడా వాడిలో పారేదీ వాడి నాన్న రక్తమేరా. ఇంకెప్పుడూ వాడితో మాట్లాడకు.''

* * *

జాలీకి బిస్కట్లు తినిపిస్తున్న రమేష్ తిన్నగావచ్చి తన వొళ్లో ఏదో పడేసరికి చేతిలోకి తీసుకున్నాడు. అదొక చిల్లపెంకు. దానిపై మసిబొగ్గుతో ''అ ఆ'' అని వ్రాసిఉంది.

క్రిందికి చూశాడు.

కొబ్బరిచెట్టు చాటున దాక్కొని నిక్కినిక్కి చూస్తున్న గంగడు కనిపించేసరికి ''వస్తున్నా పద'' అన్నట్లుగా సైగచేసి మెల్లగా మెట్లు దిగాడు.

''గంగూ కోపంవచ్చిందా మమ్మీ వెళ్ళగొట్టేసందుకు.''

''నువ్వు నా దోస్తువి కోపం ఎట్లా వత్తది.''

''నీ మనసు చాలా గొప్పది అందుకే నువ్వంటే నాకిష్టం.''

''అ ఆ వొచ్చింది.''

''చూశాను.''

''తర్వాత చెప్పవా.''

''ఇ ఈ'' తనతో తెచ్చిన నోటుబుక్కులో వ్రాసిచ్చాడు రమేష్.

''రోజూ సాయంకాలం ఇక్కడికే రా నేర్పుతానూ — '' ఆ చోటు వారి ఇళ్లకు చాలా దూరంగా ఉంది.

''ఇ'' — ''ఉ''

''నీకు మంచి బట్టలు లేవా ?''

''ఈ'' — ''ఊహూ''

''నావి బిగుతైనవి ఇస్తాను రాత్రయాక మా మేడదగ్గరకురా —''

''రమేష్ ఎందుకు నేనంటే నీకింత జాలి.''

''బోల్డు డబ్బులుకు అమ్ముకోవాల్సిన శంఖు నాకు ఊరికినే ఇచ్చావ్ మరి నేనంటే నీకెందుకంతిష్టం.''

''నువ్వు ఏసుకునే మంచి గుడ్డలంటే నాకిష్టం. బేగు తగిలించుకుని బడికెలుతుంటే సూడ్డం నాకిష్టం. నేనుకూడా సదూకుంటే మీకులాగుంటానని ఆశ.

అందరూ మమ్మల్ని అరే వొరే అని పిలుస్తారు. నువ్వు మరేదగా అడిగేసరికి బలే యిట్టం ఏసింది.''

గంగడి పచ్చిపాలవంటి మాటలు రమేష్ హృదయాన్ని ఆకట్టుకున్నాయి.

ఆ రోజునుంచీ వారు ప్రాణస్నేహితులైపోయారు. రమేష్ తను తినే ప్రతి వొక్కటీ దాచి గంగడికి పెట్టేవాడు. గంగడు శరీరంలోనే కాదు కండ, చదూలోనూ పట్టేంది.

పుస్తకం చదవటంకూడా నేర్చుకున్నాడు.

''గంగూ మీ నాన్న సముద్రం పైకి పడవలో వెళ్తాడుకదా ?''

''అవును అప్పుడప్పుడు నేనూ ఎల్తా.''

''నన్నుకూడా తీసుకెళ్ళవా నాకు భలే యిష్టం.''

''అమ్మో దొరూరుకుంటాడా.''

''డాడీకి తెలిసేట్టుగా వస్తానా ? మమ్మీ డాడీ పార్టీలకెళ్ళినప్పుడెళదాం ఏం.''

'' అయ్యనడిగి చెప్తాను.''

ఉరకలేసే మనసుతో ఇంట్లోకి అడుగు పెట్టబోతున్న రమేష్ ''ఆగు'' అన్న శేఖరం ఘర్జనతో అదిరిపోయాడు.

''ఎక్కడికి పోయావ్ ?''

''షి...షికారుకు డాడీ.''

''ఎవరితో ?''

''గంగూతో.''

''వాడితో తిరగొద్దని మమ్మీ నీకు చెప్పింది కదా !'' చెళ్ళున పడింది బెల్టుదెబ్బ రమేష్ వొంటిపై.

''వాడు పూటపూటకీ కడుపుకోసం తడుపుకొనే వెధవ'', ''తోటలూ, దొడ్లూ తిరిగి దొంగతనాలు చేసే దొంగరాస్కెల్'', ''మన కాళ్ళు కడిగి చెప్పులు తుడిచే ఆ దౌర్భాగ్యుడితో నీకు నేస్తమా'', ''చెప్పు ఇంకోసారి వాడితో తిరుగుతావా ?'' బెల్టు మళ్ళీ పైకి లేచింది.

కిక్కురు మనకుండా దెబ్బలన్నీ తిని తన గదిలో కెళ్ళిపోయాడు రమేష్.

ఆ రోజు నుంచి తను ఎక్కడికెళ్ళినా ప్రక్కన పనివాళ్ళుండాల్సిందే.గంగడు కనిపిస్తున్నా మాట్లాడే వీలులేదు.

గంగడి ఆశ్చర్యకరమైన చూపులు ''నువ్వా మీ నాన్నలాంటి వాడివేనా చదూచెప్తానని వొట్టు వేశావు కదూ !'' అని వెక్కిరించినట్లుగా ఉన్నాయి.

గంగడితో మాట్లాడకుండా ఉంటే పిచ్చెక్కినట్లుగా ఉంది. ఛీ... మమ్మీ, డాడీ సముద్రపు నీరుతో సమానం. చూడటానికి ఎంత అందంగా ఉంటాయి. బుద్ధులు చూస్తే ఉప్పగా, వెగటుగా.

మమ్మీ డాడీ పార్టీకెళ్ళారు. ఎలాగైనా గంగూతో మాట్లాడాలి. వాడు చింపిరిజుట్టుతో నల్లగా సముద్రం అడుగున పాచిపట్టిన రాయిలా



ఇతరులను లెక్కచెయ్యకపోవడం, వారిపట్ల అనాదరణ చూపడం నిర్లక్ష్యభావం అనిపించుకుంటుంది. తన సహపాఠి శ్రద్ధగా చదివి పరీక్షలో ఉత్తముడుగా నెగ్గి పేరు తెచ్చుకుని, తాను వెనకబడి ఉన్నవాడు "వాడి గొప్ప ఏముంది? చచ్చిచెడి చదివి మంచి మార్కులు తెచ్చుకున్నాడు. నేనూ వాడివలె చదివితే అంతకంటె వక్కువ మార్కులే తెచ్చుకోగలను" అని అనుకోవడం మనం చూస్తూ ఉన్నాము. అట్టివాడు ఇతరులను తక్కువగా చూస్తాడేకాని తన సోమరి తనాన్ని గుర్తించలేడు. ఎవరైనా ఉదార హృదయులు స్వార్థాన్ని విడిచి దేవసేవకై కాలాన్ని వినియోగిస్తూవుంటే, వాళ్ళ తమ సంగతి పట్టించుకోకుండా పిచ్చివాళ్లయి యితరులకు సేవ చేస్తున్నారని నిరసిస్తూ వారిని అలక్ష్యంగా చూచేవారు లేకపోలేదు. అలా భావించడం వారి స్వార్థపరత్వాన్నీ, సంకుచిత భావాన్నీ, అసహనాన్నీ సూచిస్తుంది. అది హర్షించదగినది కాదు. తాము ఏమీ చెయ్యలేకపోయినా దేశసేవ చేసేవారికి తోడ్పడడం మానవుని కనీస ధర్మం. అలా తోడ్పడలేనప్పుడు అలక్ష్యభావాన్ని వ్యక్తం చెయ్యకుండా ఊరికే ఉండడం మేలు.

మంచి గుణాలు ఒకదాని వెంబడి మరొకటి రావడం కష్టం. కాని చెడ్డ గుణాలు




మాత్రం ఒకదాని వెంబడి మరొకటి సులభంగా అలవడతాయి. అలసత్వం, అశ్రద్ధ కార్య నిర్వహణంలో పట్టుదల లేకుండుట అలక్ష్య భావాన్ని అనుసరించి ఉంటాయి. ఇతరులు దీనిని హర్షించరు. ఇతరులను లక్ష్యం చెయ్యని వారిని ఎవ్వరూ గౌరవించరు.

ప్రతివ్యక్తీ ఏదో ఒక చిన్న పనికయినా ఇతరులపయి ఆధారపడి ఉండవలసినదే! "నాకేమి?" అని నిస్సహాయంగా— ఒంటరిగా ఉండడం సాధ్యంకాదు. ఇతరులను నిర్లక్ష్యంగా చూస్తే — ఒకప్పుడు వారివల్ల జరగవలసిన పని జరగకుండా పోతుంది. అంతేకాదు ఈ చెడు స్వభావంవల్ల ఇతరులకు మనయెడల నిరసనభావం ఏర్పడుతుంది. మనం తల పెట్టిన పనులకు ఆటంకాలు కలుగుతాయి. మనం అనాదరించిన వ్యక్తి మనపయి దుష్ప్రచారం చెయ్యవచ్చు.

దుర్గుణమైన యీ నిర్లక్ష్య భావానికి దూరంగా వుండడం ఎంతో మేలు. దీనివల్ల ఇతరులకు నొప్పి కలుగుతుంది. దానివల్ల మనకూ చేటు సంభవించవచ్చును.

గౌరవం యిచ్చి పుచ్చుకోవాలంటారు. అంటే మనం యితరులను గౌరవిస్తే వారు మనలను గౌరవిస్తారు. ఆ విధంగానే మనం యితరులను అలక్ష్యం చెయ్యకపోతే మనలనూ వారు అలక్ష్యం చెయ్యరు

అలక్ష్య భావం మన మనస్సును అంటకుండా ఉండేటట్లు చూసుకోవలసి ఉన్నది. ★

ఉంటేనేం. వాడి స్నేహంలో ముత్యాలు దొరకవూ? ఆలోచిస్తున్న రమేష్ ఈల వింటూనే సంతోషంతో ఎగిరిపడ్డాడు.

ఆ ఈలకి సంకేతం తనకి తెలుసు. పడవపై వెళ్ళేందుకు గంగూ తెలిపే గుర్తది.

అంతే! పట్టరాని ఆనందంతో చకచక మెట్లు దిగుతూ జర్రున జారిపడ్డాడు.

రమేష్ పడటం చూడగానే గంగడు కెవ్వున కేక వేస్తూ అక్కడికి పరుగెట్టుకొచ్చాడు.

ఇది జరిగిన పది రోజులకు శేఖరం, పార్వతి వంటింట్లో అడుగుపెట్టూనే స్థాణువులై పోయారు.

తమ డైనింగ్ టేబిల్‌మీద రమేష్ ప్రక్కన కూర్చొని ఇడ్లీలు తింటూ గంగూ.

శేఖరం కోపంతో వణికిపోయాడు. "రేయ్ రాస్కెల్ పో బయటికి" అంటూ గంగడి జుట్టు పట్టుకొని పైకి లేపాడు.

"ఆగండి డాడీ వాడి సొమ్ము వాడు తింటున్నాడు. ఇంకా చెప్పాలంటే వాడి సొమ్ము మీరూ తింటున్నారు." అరిచాడు రమేష్.

"చూడూ వాడు నీకేమైనా సహాయం చేస్తే ప్రతిఫలం ముట్టచెప్పు అంతేకానీ నెత్తినెక్కించుకోకూడదు."

"డాడీ వీళ్ళు ప్రాణాలకు తెగించి సముద్రం పైకి వెళ్ళి తెచ్చుకునే చేపలు మీరు అదిరించి

## స్నేహం

బెదిరించికొని ఎక్కువ లాభాలకు అమ్ముకుంటున్నారట కదా ?"

శేఖరం నుదురు ముడుతలు పడింది.

"ఈ మేడ, ఈ వస్తువులు, ఈ తిండి వీరి కష్టార్జితంలోనివి కావా ?!"

"ఆ లెక్కన వీళ్ళు మనదగ్గర ఎన్ని డబ్బులు దాచుకున్నట్లు లెక్క. మీరు కాదూ అని గొంతు చించుకున్నా మీకు ధర్మం చేసినట్లవుతుంది. వాడి తిండి వాడు తింటుంటే నోటి దగ్గరిది లాగేస్తున్నారు. ఎంత దౌర్జన్యం డాడీ —"

శేఖరం ముఖంలో నెత్తురు ఎవరో తోడేసినట్లుగా తెల్లగా పాలిపోయింది.

"వీడు బీదవాడు, గలీజువాడు, అంటరాని వాడు అన్నారే. ఆ రోజు నేను మెట్లమీదనుంచి పడి రక్తం కోల్పోయిన రోజు వీడు కాదూ నాకు రక్తం దానం చేసింది. అప్పుడు మీకు అంటు, హోదా గుర్తుకు రాలేదా ?"

శేఖరం, పార్వతి వదనాలు నల్లగా మాడి పోయాయి.

"మమ్మీ! బుద్ధులు కొత్తగా రావు బాబూ ఆ రక్తంలోనే ఉంటాయి అన్నావుగా, ఇప్పుడు వాళ్ళ రక్తమే నాలోనూ ఉంది. వాడు దొంగవెధవ, అడుక్కుతినే వెధవైతే నేనేం ఔతానూ."

సింహాన్ని చీమ చెంపపై చరిచినట్లుగా విలవిలాడింది పార్వతి.

"డాడీ. నా కారులో ఎక్కాలని, నా పేపరు చూచి వ్రాసి ఎక్కువ మార్కులు తెచ్చుకోవాలని, నా పాకెట్ మనీ చూచి రవీ, వాసు, రాము నాతో స్నేహాలు చేశారు.

మీకు పుట్టాను కనుక చూడాల్సిన బాధ్యత మీది కనుక మీరు ప్రేమగా చూస్తున్నారు నన్ను.

కానీ డాడీ: వీడికి నామీద ఉన్న ప్రేమలో స్వార్థం లేదు. స్నేహంలో మలినత్వం లేదు. అందుకే డాడీ వీడి స్నేహం నాకు కావాలి. రక్త సంబంధం లేకపోయినా ఉండొచ్చు కానీ మనసు విప్పి చెప్పుకునే మిత్రుడు లేకపోతే క్షణం గడవదు.

ఇప్పుడు వీడిని ఏంఅన్నా, ఏంచేసినా నన్ను అన్నట్లే లెక్క. చెప్పండి డాడీ వీడితో నన్ను బయటికెళ్లమంటారా."

"వారే బాబూ కుళ్లిపోయిన సమాజంలోంచి, పొగరుబోతు అహంకారుల జాబితాలోంచి మేము విడిగా బుద్ధి తెచ్చుకొని వచ్చాంరా. మాకు ఇకనుంచి ఇద్దరు బిడ్డలు." అంటూ శేఖరం, పార్వతి పశ్చాత్తాపంతో రమేష్ గంగడి తలలు నిమిరి దగ్గరకు తీసుకున్నారు. ★



# పరి పరి ప్రాంతాలలో ప్రశంసలందుకున్న కెయో-కార్పిన్ ఇప్పుడు శ్రేష్ఠతనాదరించే

# ఆంధ్ర ప్రదేశ్ కీ వచ్చింది!

పలచనిది,
మరక పడనిది,
బలకరమైనది...

నునుపుగా,
అంటుకోకుండా,
సున్నితమైన
సువాసనతో
కూడిన...




# కెయో-కార్పిన్

హేయిర్ ఆయిల్

డేస్ వారి శ్రేష్ఠమైన సమర్పణ




PX/KK/TG-1/84A

## కొత్త సీరియల్ ప్రారంభం!



"వారాలు చేసుకుంటున్నవాడివి, ఒకరోజు ముందొచ్చి 'మీ ఇంట్లో రేపువారం ఉందమ్మా' అని చెప్పాలి. చెప్పకుండా ఆ వేళకి తిండికొస్తే అప్పటికప్పుడు ఎలా వండి పెట్టగలననుకున్నావ్?" కసిరినట్టుకాకపోయినా, అదే గొంతుతో, పనిమనిషితో, అంట్లు తోమడానికి ఇంత ఆలస్యంగా వస్తే ఎలా, అన్నట్టు అడిగింది దుర్గమ్మ.

ముంధా వెంకట రమణారావు

# ఉదయసంధ్య

**దుర్గమ్మ వలంగా ఉంది. నల్లగా రుబ్బుపొత్రంలా ఉంది. ఐదు పేటల బంగారం గొలుసు మెడలో, గేదెకి బంగారం గొలుసు మెడలో వేసినట్టు జిగజిగా మెరుస్తోంది**

ఆమెకు ఎదురుగా నిల్చున్నాడు పదిహేనేళ్ల రామం. కాకీనిక్కరు, దాని మీద నీలిసగం చేతుల చొక్కా తొడుక్కున్నాడు సన్నంగా, పీలగా ఉన్నాడు. కాని తెల్లగా ఉన్న ఆ కుర్రవాడి ఒంటిలో ప్రత్యేకంగా కనిపించేవి కళ్లల్లోకి పడే ఒత్తయిన జుత్తు, పెద్ద అందమైన విశాలమైన కళ్లు.

ఎడం కాలుకి, మణంకు కిందకి ఉంది ఒక బేండేజి. నెలరోజుల క్రితం చీకట్లో వెళ్తూ ఉంటే గోతిలో కాలుపడి బోర్లా పడగా మణుకు చెక్కుకుపోయింది. మణుకు కింద గట్టి దెబ్బ తగిలింది. అది అలా సెప్టిక్ అయింది. ఇపుడు రోజూ హాస్పిటల్‌కి వెళ్లి దానికి బేండేజి కట్టించాలి. ఎంతకీ మానడంలేదు.

''నిన్న రాత్రి నాకు జ్వరం వచ్చింది. అందువల్ల వచ్చి చెప్పలేకపోయేను'' నసుగుతూ అన్నాడు రామం. అసలు ఇప్పుడూ ఏమీ తినాలని లేదు. దుర్గమ్మగారి ఇంట్లో వారం అంటే మానేస్తే బాగుండుననిపిస్తుంది. కాని మానేసినా ఇబ్బందే. ఎందుకు రాలేదని సంజాయిషీ అడుగుతుంది. సంకలో పుస్తకాలు. కడుపులో ఆకలి. పదిగంటలకి స్కూలు. స్కూలుకి ముందుగా పోయి హోమ్‌వర్కు లెక్కలు చేసుకోవాలి. నిన్న రాత్రి చదువుకుందుకి దీపం లేకపోయింది. బుడ్డి దీపంలోని కిరసనాలయిపోయింది. పూర్ణమ్మగారిని వాళ్ల దీపం అడుగుదామనుకున్నాడు. కాని ఆవిడ పడుకుంది తొమ్మిది గంటలకే. నిన్నరాత్రి, వారం పాలకొడేటి మాష్టారింటిలో. అందరూ తిన్నాక తనకి పెడతారు, తినగా మిగిలింది. వాళ్లు తినడం, మాష్టారు ట్యూషన్లు అయ్యేక.

''ఏంటే అమ్మా ... ఏమయింది ?'' అంటూ దుర్గమ్మ కూతురు,పదమూడేళ్లమీనాక్షి వచ్చి, రామాన్ని చూసి ''ఓహో నువ్వా ...'' అంది. తల్లికీ కూతురుకీ పోలికలు తక్కువ. మీనాక్షి ఒంటి రంగు నలుపుకాదు. ఎర్రా మేష్టారి రంగు. ఎర్రా మాష్టారు ఎర్రగా ఉంటారు. స్కూలులో సైన్సు చెప్తారు పెద్ద క్లాసులకి. అతనికి ట్యూషన్లు లేవు. అతనికి



## పాఠకులతో చిన్నమాట

ఇందులోని రెండు మూడు పాత్రల పేర్లు ఇదివరకు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 1980 నవంబర్ నించి 1981 ఫిబ్రవరి వరకూ సీరియల్‌గా వచ్చిన ''స్పందన'' అన్న నా నవలలోని పాత్రల పేర్లూ ఒకటయినా పాత్రలు వేరు — ఈ నవల నిజానికి ''స్పందన'' కన్న ఐదేళ్ల ముందు రాసేను — చాలా పెద్ద నవలగా రాయాలనుకున్నాను కాని కొంతవరకు పాత్రలు నడిచి మరి ముందుకు నడవమన్నాయి — నవలని అందువల్ల అలా ఉంచేసేను. కాని ఈనాడు మరోసారి తిరగెయ్యగా ఎక్కడ ఆగిపోతే అక్కడికే ముగించవచ్చనిపించి ముగించేసేను — పద్నాలుగూ, పద్దెనిమిదీ మధ్య వయస్సు నడుస్తున్నపుడు ప్రతి వ్యక్తి మనస్తత్వమూ చిత్రంగా ఉంటుంది— దానిని ఆంగ్లంలో ''ఇంప్రెషనబుల్ ఏజ్'' అంటారు — ఈ నవలలోని పాత్రలన్నీ ఆ వయసులోని వ్యక్తులు — వారి మనస్తత్వ చిత్రణే ఈ చిన్ననవల ఉద్దేశం —

**— రచయిత**

# ఉదయ సంధ్య

ఊళ్లో ఎన్నో వ్యాపకాలున్నాయి. దుర్గమ్మ వడ్డీ చేస్తుంది. అతను ఊళ్లోని షావుకార్లకి ఎన్నో విషయాలలో సలహాదారు. బి. ఎస్సీ. ప్యాసయి, 'లా' ప్యాసయి ప్రాక్టీసు లేక స్కూలు మాష్టరుగా చేరి, మెల్లిమెల్లిగా పైకివచ్చి, ఇటికమీద ఇటిక పేరుస్తూ మేడకట్టేడు. మేడకి లైట్లు వేయించేడు. ఇప్పుడు మీనాక్షి పెళ్లికి కట్నం, మీనాక్షి తమ్ముడు, అంటే ఉన్న ఒక్కొఒక్క కొడుకు కోసం ఆస్తి సేకరించడంలో నిమగ్నుడయి ఉన్నాడు. అందుకతను ఇంట్లో ఎప్పుడూ ఉండడు. ఇంటి యజమాన్యం అంతా దుర్గమ్మదే, దుర్గమ్మ ఉండకపోతే మీనాక్షిదీని.

మీనాక్షి కళ్లు, చేపల్లా ఉండకపోయినా, పెద్దవి. నల్లటి కనుపాపలు. ఆ ముఖంలో ఆకర్షవంతమైనవి కళ్లే అయినా, వాటి చూపులు అర్థంకావు రామానికి. నవ్వుతూనే మాట్లాడుతుంది, కోపంగా ఉంటాయి చూపులు. మాటలు పదునుగా ఉన్నా చూపులు నవ్వుతూ ఉంటాయి మరొకసారి. మాటలూ, కబుర్లూ చెప్తూనే ఉంటుంది తల్లి వెనకే ఉంటూ.

రామం నీరసించిన గొంతుతో అన్నాడు ... ''పోనీలెండి ... ఫరవాలేదు ...'' అని వీధి గుమ్మంవేపు తిరిగేడు. పుస్తకాల బరువు ఎక్కువగా ఉంది...అలసటకి సాయం.

''రామం ... ఎక్కడికి వెళ్ళిపోతున్నావ్ ?'' మీనాక్షి అడిగింది ఆత్రంగా.

''స్కూలుకి ...''

''భోజనం చెయ్యకుండానా ? ఎక్కడన్నా డి. పీ. తగిలిందేమిటి ?'' మీనాక్షి నవ్వుతూ అడిగినా కళ్లు కోపంగా ఉన్నాయి. తద్దినం భోజనాలు నెలకొకటన్నా తగుల్తాయి. ఏమయినా కాకపోయినా ఒడుగు మాత్రం అయింది. ఒంటిమీద జందప్పోగు పడేసేడు తండ్రి పదేళ్లకే.

రామం ఆగి ఇబ్బందిగా మీనాక్షిని చూసేడు. ఏంచెప్పడానికీ పాలుపోలేదు. కోపగించుకోడానికి కాని, అవుననడానికి కాని, కాదనడానికి కాని అవకాశంలేదు తనకి. ఏమన్నా దుర్గమ్మకి కోపం వస్తుంది. దుర్గమ్మే సహాయపడింది. ''ఒక రోజు ముందు చెప్పకపోతే ఎలాగే మీనూ ... ముందురోజొచ్చి నాకు గురు చెయ్యాలా ఒద్దా ? అప్పటికప్పుడు ఎలా వండిపెడతాను ?''దుర్గమ్మ దండకం చదివింది.

మీనాక్షి కళ్లలోని కోపం పోయింది. కళ్లు నవ్వేయి. గొంతు మాత్రం తీవ్రంగా మారింది. ''నీది మరీ చాదస్తమమ్మా...ఈ ఇంట్లో మరో మనిషికి అన్నం పెట్టడానికి వండాలా వేరేగా ? మధూకరం వాడొస్తే గిన్నెడన్నం వాడికిస్తావే...'' మీనాక్షి రామం దగ్గరికివెళ్లి, చేతిలోని పుస్తకాలు లాక్కొని అంది... ''అమ్మ మాటలిలాగే ఉంటాయి ... ఆపాటిదానికే కోపం వచ్చి పారిపోవాలా...పద లోపలికి.''

రామం కళ్లలో నీళ్లు తిరిగేయి. ఆ కన్నీటిని తుడుచుకుందుకి రుమాలు లేదు. మీనాక్షికి ఆ కన్నీళ్లు కనిపించకూడదు. ముఖందించుకున్నాడు. దుర్గమ్మ కూతురు కేసి అర్థం కానట్టు చూసింది. ఏదో అనబోయి తమాయించుకుంది. ఎవరితోనన్నా వాదన పెట్టుకోగలదు కాని, తొమ్మిదోక్లాసు చదువుతున్న కూతురుతో వాదన పెట్టుకొని గెలవలేదు. కూతురు చెప్పే ప్రతి వాదానికి తన దగ్గర జవాబు ఉండదు. కూతురు తనకన్నా తెలివైనదనుకోడం ఆమెకి గొప్ప.

మీనాక్షి రామాన్ని లోపలికి తీసుకవెళ్లింది. ఇంట్లో మీనాక్షికి మేడమీద వేరే గది ఉంది. ఆ గదిలో ఒక మంచం, పరుపు, ఒక టేబిలు, రెండు కుర్చీలూ, నిలువుటద్దం, దాని ముందు స్నో, పౌడరూ ఇత్యాది సౌందర్య సాధనాలూ, బట్టల స్టేండూ, దానిమీద గౌన్లూ, పరికిణీలు, బాడీలు, గోడలకి సినిమాస్టార్ల బొమ్మలతో కేలండర్లు. ఇవాళ ఆ గదిలోకే తీసుకువెళ్లింది మీనాక్షి. పుస్తకాలు టేబిల్ మీద పడేసింది. ''అమ్మ వడ్డించేలోపున, నా లెక్కలు హోమ్‌వర్కు చేసిపెట్టు. నాకెక్కడా తీరుబాటు ఉండకుండా ఉంది. నిన్న శాంతమ్మగారింటికి వెళ్లేనా ... వాళ్ల లత, సావిత్రితోనూ కబుర్లయిపోయేయి. ఇంటికి తిరిగి వచ్చేసరికి ప్రొద్దున్న లేచేద్దాంలెద్దూ అనిపించింది. పొద్దున్న లేవలేక అమ్మకి సాయం చేసేసరికి అయిపోయింది. చదవడానికే నాకు టయిము దొరకడంలేదు. హోమ్‌వర్కు కూడా ఎక్కడ్నించి టయిము తెచ్చి చెయ్యడం...'' తన లెక్కల పుస్తకం రామం ముందు పడేసింది.

రామం టేబిలు ముందు కూర్చున్నాడు. తన ఆప్షినల్ మేథమెటిక్స్ లెక్కలు చేసుకుందుకింక టయిముండదు. తెలుగు పీరియడ్‌లో చేసుకోవాలి. మీనాక్షి తెలివైనదే. కాని చదవడానికి బద్ధకం. అన్నీ అర్థం చేసుకుంటుంది ... పరీక్ష ముందొకసారి పుస్తకాలు తిరగేస్తే చాలంటుంది.

"నీకివి అర్థం అయినట్టేనా ?" బెదురుగా ఆమెను చూస్తూ అడిగేడు. మీనాక్షి కోపం తెప్పిస్తే తనకీ ఇంట్లో అడుగు పెట్టే అర్హత ఉండదు.

ఆమె కళ్లు చక్రాల్లా తిప్పి అంది "లెక్కల మాష్టరు బోర్డుమీద లెక్కవేసి 'అండర్‌స్టేండ్' అంటే బుర్ర ఊపకపోతే మొట్టికాయలు పడతాయన్నభయం... సగం బోధపడింది... సగంలేదు. తరవాత నాన్నని అడుగుతాను..."

"కూర్చో చెప్తాను. ప్రిన్సిపిల్ అర్థమైపోతే లెఖ్ఖలు చెయ్యడానికి సరదాగా ఉంటాయి.. నీకీ ఆల్జీబ్రికల్ ఫార్ములాసు వాటి అప్లికేషనలు వచ్చు ౹దూ ? అంటే, అయినంతవరకూ ... ఈ ఫేక్టరైజేషను ఏం కష్టం కాదు ..." రామం పుస్తకం తీసి లెఖ్ఖలు బోధపరచడం ఆరంభించేడు. కాని మీనాక్షి వింటోంది కాని వినడం లేదు. వినోదంగా చూస్తోంది, సీరియస్‌గా బోధపరుస్తున్న రామం ముఖాన్ని. అంతా చెప్పి "బోధపడిందా ?" అన్నాడు రామం. "లేదు" అంది మీనాక్షి. రామానికి శిక్షవేసే శక్తి లేదు. రామం ముఖంలో బాధ. మళ్లా ఆరంభించి బోధపరిచేడు. ఈసారి శ్రద్ధగా వింది. బోధపడింది. ఇందులో ఉన్నది ఇంతేనా అనిపించింది... "బోధపడిందా ?" "ఊఁ..." అన్నది. "అయితే చెయ్యి" అని పుస్తకం ముందుకు తోసేడు. "అదా నీ ఎత్తు... నువ్వు చెయ్యకుండా తప్పించుకుందామనా? నాకు ఓపికలేదు బాబూ... ఉండు నీ భోజనం సం౧.తి చూసి ఒస్తాను ..." అని వంటింటికి పరుగుతీసింది. పుస్తకం ముందు వేసుకొని లెఖ్ఖలన్నీ చేసేడు రామం. పదినిముషాలలో ఆ పని పూర్తయింది. మీనాక్షి తిరిగి వచ్చి అంది... "వేరీ గుడ్ ! మాష్టరదే రాస్తారివాళ...థేంక్స్ రామం... ఇంక పద వంటింటికి, నేనీలోపున బట్టలు మార్చుకోవాలి..."

రామం గదిలోంచి బయటకు వెళ్లి వంటింటి ముందు నిలబడ్డాడు. పుస్తకాలు ముందు పడేసుకుని వాటిలో నిమగ్నుడయినప్పుడూ, పాఠాలు అవి తెలియని తోటి విద్యార్థులకి బోధపరిచేటప్పుడూ ఉండే కాన్ఫిడెన్సు అన్నం కోసం ఒకరి గుమ్మం ముందు నిల్చోగానే పోయింది. దుర్గమ్మ పిలవాలి, అప్పుడు తను లోపలికి వెళ్లాలి. ఇంతలో బట్టలు వేసుకొని మీనాక్షి వచ్చింది. "నాకూ వడ్డించీ అమ్మా !" అంటూ. "నువ్వు తరవాత తిందువు. ముందీ పిల్లడు తిని వెళ్లనీ."

"లేదు... నాకు టయిము లేదు... మా ఇద్దరికీ ఒకేసారి పెట్టే... పద రామం ..."

రామం కాళ్లు కడుక్కొని, అరే వరకు నిల్చొని తరవాత లోపలికి వెళ్లేడు. మీనాక్షి రెండు పీటలు పక్కపక్కన వేసింది, కంచాలు పెట్టింది ... నీళ్లు పెట్టింది ... దుర్గమ్మ కోపంగా అంది ... "ఆ అబ్బాయికి విస్తర వెయ్యి ..." కంచం తీసేసి విస్తర వేసింది ... రామాన్ని ఎ గా ది గా చూసి అన్నది ... "కాలిదాములగుడ్డ విప్పు.. హాస్పిటల్‌లో ఏ..వాడు కట్టేడో అది." రామం ముఖం చిన్నబోయింది. బేండేజి విప్పడం కట్టడం చేతకాదు. ఆ ముడి హాస్పిటల్ వాళ్లే విప్పాలి. "ముడి విడదండీ.." అన్నాడు సిగ్గుపడుతూ. మళ్లా మీనాక్షే సాయపడింది. "దానిమీద రెండు పసుపు నీళ్లు జల్లి అమ్మా, మైల, మడి అయిపోతుంది ..." అ మాటలంటూ పసుపునీళ్లు కలిపి తెచ్చి జల్లింది.

పీటనీ విస్తరనీ దూరంగా లాగింది దుర్గమ్మ. మీనాక్షికీ, రామానికీ వొడ్డించింది. మీనాక్షి కంచంలో రెండు కూరలు [ఒక వేపుడు], గిన్నెతో పులుసు, పప్పు, అందులోకి చిన్న గిన్నెతో నెయ్యి, ఆవకాయ, అప్పడం అంతా పెళ్లి భోజనంలా ఉంది. రామం విస్తరలో చాలీచాలకుండా పప్పు, ఒక కూర, ఆవకాయముక్క వేసింది. "రామానికి బంగాళదుంప కూరా, పులుసు ఏవమ్మా ?" మీనాక్షి అడిగింది. "అందుకే కదే ముందుగా నాకు చెప్పమని నేనేడిసింది ... మరో మనిషికి సరిపడా కావాలంటే ముందుగా చెప్పాలి" దుర్గమ్మ అంది.

"ఇవి చాలండీ... నాకు మరేమీ ఒద్దు ... ఆకలి లేదు." రామం తలదించుకొని కూర్చున్నాడు. ఇక్కడి నించి ఎంత వేగంగా బయట పడదామా అని ఉంది. ముష్టివాడు బిచ్చమెత్తుకున్నదేదో స్వతంత్రంగా హాయిగా తింటాడు. కాని తన స్థితి వాడికన్న అధ్వాన్నంగా ఉంది.

పెట్టినంతసేపూ మాటలు కూడా పెడతారు. వాటినీ తినాలి అన్నంతో కూడా.

మీనాక్షి తన కంచంలోని కూరలో సగం రామం విస్తరలో వేసింది. పులుసు వడ్డించింది. తన గిన్నెలోని నెయ్యి అతని అన్నంమ్మీద వేసింది. "ఇంక కానీ వేగం ... వేళయింది ... ఇంకా నేను లతా వాళ్ళ ఇంటికి వెళ్ళి వాళ్లతో కూడా వెళ్ళాలి." "అంతా వాడికి పడేస్తే నువ్వేం తింటావ్ ?" దుర్గమ్మ అడ్డొచ్చింది. "నేనేం మనిషినా రాక్షసినా . అంత కుంభం నేను తినలేను"...మీనాక్షి పప్పు కలుపుకుంటూ అంది. గబగబా తిన్నారిద్దరూ. మీనాక్షికి పెరుగు వేసింది. రామానికి మజ్జిగ వడ్డించబోయింది దుర్గమ్మ. మీనాక్షి వెంటనే కేకపెట్టింది... "అమ్మా...పంక్తిలో పరపక్షం పనికిరాదు... ఒకరికేం వేస్తే రెండోవాళ్ళకీ అదే వెయ్యాలి... ఒక గేదే, ఆవూ పాలిస్తున్నాయి...ఈ ఇంట్లో మజ్జిగ చెయ్యాల్సిన అవసరం ఏమిటి ?"

దుర్గమ్మకి సహనం పోయింది. కూతురు మీద విరుచుకుపడింది. "వేలెడులేవు...నువ్వు నాకు చెప్పొచ్చేవే మీనూ ? అందుకే నీకు వేరేగా పెడతానన్నాను. ఆవూ, గేదే ఉన్నాయంటే వాటి పాలమీద వచ్చే డబ్బేకదా నీ కోసం కూడ పెడుతున్నాను ... పెరుగుంటే తింటాం...అమ్ముకుంటాం...పారపోసుకుంటామా ?... పదమూడేళ్ళొచ్చాయి ... పెద్దదానివవుతున్నావు...రేపు నీ పెళ్లి చెయ్యాలంటే పదివేలన్నా కుమ్మరించందే ఏ అయ్యా ఒల్లడు...ఇక్కడ ధర్మ సత్రవు తెరిచి కూర్చుంటే సంసారం ఎలా గడుస్తుందే... నీ పెళ్ళి ఎలాగవుతుంది ?...నీ తమ్ముడికి డాక్టరీ చెప్పిద్దామని మీ నాన్న కలలు కంటున్నారు..."

మీనాక్షి ఊరుకోలేదు..."వాడింకా ఏడో క్లాసు చదువుతున్నాడు ... చదువు ఎగవేసి తోటలంటా దొడ్లంటా తిరుగుతున్నాడు. వాడి కోసం ఇప్పట్నించీ కలలెందుకే ?...ఇంక నా పెళ్ళికోసం మీకెవరికీ బెంగఒద్దు. పదివేలు



కట్నం కావాలన్న వాడిని నేనెప్పుడూ పెళ్లాడను... పెళ్ళికాకపోతే పీడాపోయే రామానికి పెరుగు వెయ్యి!'' అన్నం కలుపుకోకుండా కూర్చుంది మీనాక్షి.

రామం తలదించుకున్నాడు. కన్నీరు ఒక్కొక్క చుక్కే విస్తరలో పడుతోంది... గిన్నెడు పెరుగు విస్తరలో కుమ్మరించబడింది... కాళీ గిన్నె మూలకి విసిరింది దుర్గమ్మ. విస్తరంతా పెరుగే ... ఏం చెయ్యడానికీ తోచలేదు రామానికి...తల ఎత్తవల్సి వచ్చింది...కన్నీళ్ళు మీనాక్షికి కనిపిస్తాయి...కనిపించనీ ... ఇంతకన్నా హీనత్వం ఏముంది...తనిప్పుడు లేచిపోలేడు ... తినలేడు...

అప్పుడు తల్లికేసి నవ్వుతూ చూసింది మీనాక్షి. అంటే ఆమె మనసులో ఉన్నవి మంటలు...ముఖంలో ఉంది నిశ్చయం. తన కంచం పట్టుకొని రామం ప్రక్కకి వెళ్ళి కూర్చుంది. విస్తరిలో పడ్డ పెరుగుని సగం మట్టుకి చేత్తో తీసి తన కంచంలో వేసుకుంది.. అన్నం కలుపుకొని తినసాగింది ..''కానీ రామం... నా ఎంగిలి చెయ్యి నీ విస్తర్లో పడింది...డోన్ట్ మైండ్ ప్లీజ్ !''

భోజనం ముగిసింది ... ''నీ విస్తర నువ్వెత్తుకో !'' దుర్గమ్మ అన్నది ... ఆమెకి మాటలు రాలేదు నోటంట. మీనాక్షి చేసిన పనికి కలిగిన మానసిక ఒత్తిడివల్ల, వచ్చిన కోపంవల్ల నోరు పెగల్లేదు...వాడి ఎంగిలి విస్తర్లోంచి పెరుగు తీసుకుంటుందా...ఎంత దారుణం...

రామం విస్తర ఎత్తబోయేడు...మీనాక్షి అడ్డుపడింది...''నువ్వు చెయ్యి కడుక్కొని వెళ్లు రామం...'' అని గట్టిగా చెప్పి, రామం విస్తర ఎత్తింది...

రామం లేచేడు...చెయ్యి కడుక్కొని ఆ ఇంట్లోంచి ఎలా బయటపడ్డాడో పడ్డాడు... మరి ఈ ఇంట్లో అడుగుపెట్టను...ఆకలితో చచ్చినా అడుగుపెట్టను...అనుకున్నాడు...కాని మీనాక్షి బాధపడుతుంది ... స్కూల్లో అడుగుతుంది ... మాష్టారడుగుతారు ... నాన్నంటే మాష్టారుకి గౌరవం .. ఇద్దరూ కలిసి చదువుకున్నారు చిన్ననాడు...ఇప్పుడు నాన్నకి తనని చదివించే స్తోమతులేదు...అతను పనిచేసే ఊళ్లో హైస్కూల్ లేదు.. అతను ఈ ఊరు రాగలిగే ఆస్కారము లేదు...

అమ్మ, నాన్న, తమ్ముళ్లిద్దరూ, ఒక చెల్లెలూ, ఆ పల్లెటూరులో ఉండవల్సిందే... విలేజి కరణం కొచ్చే చాలీచాలని రాబడితో రోజులు గడపవల్సిందే. అందరి ఆశలూ తనమీద.. ఈ ఏడాదిస్కూల్ ఫైనల్ ప్యాసవగానే తననొక గుమాస్తాగా చేద్దామని కలలు కంటున్నాడు నాన్న. తనకి పెళ్లి చేసి కోడలుని తెచ్చుకుందాం అని ఊహాగానం చేస్తోంది అమ్మ. తనకీ పట్నంలో ఉద్యోగం దొరికుతే తమ చదువులకి



# ఉదయ సంధ్య

బాధలేదని ఆశలు పెట్టుకున్నారు తమ్ముళ్లు. అన్నకి ఉద్యోగం అవుతే తనకి సాదర ఖర్చుకీ, మిఠాయి కొనుక్కుందుకీ డబ్బులు దొరుకుతాయని సంతోషిస్తోంది చెల్లి...

తన కలలు... తన కలలేమిటి ?... ఎన్నో ఉన్నాయి... కాని తక్కివారి కలలు తన కలలని నిజం కానివ్వవు... తనకి చదవాలని ఉంది... ప్రపంచాన్ని చూడాలని ఉంది... ఈ మనిషినీ... మనసునీ... ఈ జీవితం యొక్క లక్ష్యాన్నీ... అర్థాన్నీ తెలుసుకోవాలని ఉంది...

## 2

''వారాలబ్బాయి ఒచ్చేడు !'' నరసమ్మ కేక పెట్టింది ...ఆ కేక విని ఒక్కొక్కరూఒక్కోలా రియాక్ట్ అయ్యేరు. ప్లీడరు సీతారామయ్య గారి పెద్దపిల్ల లత ముఖం ముడిచింది, రేడియో వింటున్న ఆమె వాల్యూము ఎక్కువ చేసింది, రెండోపిల్ల సావిత్రి కేక పెట్టింది... ''ఇలా రమ్మను నరసమ్మా ఆ అబ్బాయిని. నాకీ ఇంగ్లీషు గ్రామర్‌లో క్లాజులు ఒచ్చి చావడం లేదు...'' శాంతమ్మ అంది దేవుడు గదిలోంచి... ''వేగం స్నానంచేసి ఆ ఆరవేసిన మడి పంచ కట్టుకోమను... నా పూజ అయిపోయింది.'' నాయర్‌గారి పెద్దకొడుకు సుబ్బారావు ఇంటర్ చదువుతున్నవాడు తన స్టడీ రూమ్‌లోంచి

### నిరీక్షణ

ఏమని వర్ణించను
ఏమిటో తెలియని ఈ బంధాన్ని
స్నేహమో ? ప్రేమో ?
అనురాగమో ? అభిమానమో ?
ఏదో తెలియని తీయని అనుబంధం
ఏజన్మ బంధమో ఈ అనుబంధం
అది రాగబంధమై
అనురాగరంజితమై
నాలో ఆశాజ్యోతి వెలిగించాలని
ఆ జ్యోతి నా జీవిత పథంలో
తిమిరాలని తొలగించాలని
తెలి వెలుగులు నింపాలని
ఆకాంక్షిస్తున్నాను
ఆశతో నిరీక్షిస్తున్నాను !

— సిహెచ్. శ్రీవల్లిజ్యోతి

అరిచేడు, సినిమా పత్రిక తిరగవేస్తూ... ''రామంగాడినిలా రమ్మను. పదిగంటల మేట్నీకి టికెట్లు కావాలి నాకూ చంద్రానికీ. 'నయగరా' మెర్లిన్ మన్రో పిక్చరు...''

సీతారామయ్యకి వేలువిడిచిన చెల్లెలు నరసమ్మ... పెద్దమ్మ కూతురు. మొగుడు ఎక్కడో ఏజన్సీలో స్కూలు మాష్టరు. ఒక కొడుకూ, కూతురూ కలిగేక పెళ్లాన్ని వదిలి పెట్టేడు. అక్కడొక కొండదాన్ని పెట్టుకుని కాపురం ఉంటున్నాడు. వేరే గతిలేక ఇక్కడికొచ్చి ఉంటోంది. చంద్రం ఆమె కొడుకు. సుబ్బారావుతో కలిసి చదువుతున్నాడు. కూతురు నిర్మల ఏడోక్లాసు చదువుతోంది.

ఆదివారం. పొద్దున్న తొమ్మిదయింది. ఇవాళ, రేపు వారం సీతారామయ్య ఇంట్లో. కార్తీక పూర్ణిమ ఉపవాసం ఉంది శాంతమ్మ నిన్న. తొమ్మిది లోపు రమ్మంది రామాన్ని బ్రాహ్మడిగా. వంటలన్నీ అయిపోయేయి...రామం ఇవాళ ఐదుకి లేచేడు. దీపం వెలిగించి లెఖ్కలు చేసేడు. ఇంగ్లీషు చదివేడు. ఆరుగంటలకి పూర్ణమ్మా లేచింది. ఆవుకి గడ్డి వెయ్యమంది. కుడితి కలపమంది. ఆ పని తప్పడం లేదు. వాళ్ల వీధి కొట్టులో ఉంటున్నాడు... వాళ్ల ఇంట్లో రెండు రోజులుంది వారం. అంతేకాదు. తనకి (రామానికి) అలవాటు లేకపోయినా కాఫీ ఇస్తుంది పొద్దున్నే పూర్ణమ్మ. ఏమున్నా లేకపోయినా ఆమెకి; ఆమె భర్త పెద్ద తెలుగు మాష్టారూ అయిన బులుసు శాస్త్రిగారికీ, పళ్లు తోముకోగానే కాఫీ ఉండాలి. శాస్త్రీగారిదీ, నాన్నగారిదీ ఒకే అగ్రహారం. తాతలు, ముత్తాతలూ ఇరుగుపొరుగూ. ''పిల్లలుతో చేసుకొనే ఓపికలేదు... లేకపోతే అన్ని రోజులూ నువ్వు మా ఇంటోనే భోంచెయ్యడానికి నాకు అభ్యంతరం లేదు'' అనేది పూర్ణమ్మ. ఆమెకి ముగ్గురు కొడుకులు, ఒక కూతురు. పెద్దవాడు వెంకటేశ్వరులు రామం క్లాసు. వాడు తెలుగులో తప్ప తక్కిన అన్ని సబ్జక్టుల్లోనూ క్లాసుకి ఆఖరివాళ్లలో మొదటివాడు. రెండోవాడు మీనాక్షి క్లాసుమేట్... వాడిపేరు కృష్ణుడు. వాడి తరవాతది ఆడపిల్ల విశాల... అది ఏడో క్లాసు చదువుతోంది... అలా అంతా ఉన్నారు. వీళ్లెవరూ ఆరు దాటితే నేకాని లేవరు. మొదట లేచేది విశాల... ఆ తల్లికి గారాబపు పట్టి. ఏ పనీ ముట్టుకోదు. అందుకు పనులు ఎక్కువగా ఉంటాయి. చదువుదామని పుస్తకం తెరిచేసరికి ఎవరో ఒకరు ఏదో పని పురమాయిస్తారు. కోమటికొట్టుకి వెళ్లి బెల్లం, ఆవాలూ అరువు తేవడం దగ్గర్నించి, పోపు వెయ్యడానికి గిన్నె కుంపటి కెక్కించి అల్లం లేదని తెలుసుకొన్న పూర్ణమ్మకి ఉన్నపళాన మార్కెట్‌నించి అల్లం తేవడంవరకూ చిల్లర పనులు తగుల్తాయి. వెంకటేశ్వరులు రామానికి

చదువుకి జోడీ. వీడికొక జతగాడుంటేనన్నా సరిగా చదువుతాడని, వీధి కొట్టిచ్చి రామాన్ని అందులో ఉండమంది పూర్ణమ్మ. కాని వాడికి పుస్తకం పట్టుకొనేసరికి నిద్ర ఒస్తుంది. ''నువ్వు చదువు... నేను వింటాను'' అంటాడు. ''నీ నోట్సున్నాయి, నేను మరి రాయడం ఎందుకు ?'' అంటూ నోట్సు రాయడం ఎగవేస్తాడు. అచ్చు పుస్తకాలు చాలని, క్లాసులో నోట్సు రాయక్కర్లేదని, అంతగా కష్టం వస్తే, తక్కిన మాష్టర్లకి చెప్పి శాస్త్రిగారు మార్కులు వేయిస్తారనీ వెంకటేశ్వరులు ధైర్యం. కాని ఇపుడు పబ్లిక్ పరీక్షలు దగ్గర పడుతున్నాయి స్కూల్ఫైనలువి. ఎవరూ ఇంక తనకి సాయం చెయ్యలేరన్న నిజం స్ఫురించగా కాస్త శ్రద్ధగా చదవడం ఆరంభించేడు వెంకటేశ్వరులు.

సీతారామయ్యగారి ఇంట్లో అడుగుపెట్టే సరికీ పనులే ఎదురయ్యేయి. ఇల్లు చాలా పెద్దది. రెండంతస్థులు. ఇంట్లోకి వెళ్లడానికి మూడు మార్గాలున్నాయి. ఒకటి సీతారామయ్యగారి ఆఫీసు గదిలోంచి. కోర్టుకి వెళ్లేవరకూ, కోర్టు నుంచి వచ్చేక అతను ఎక్కువకాలం ఆ గదిలోనే గడుపుతారు. ప్రక్కనుంచి డ్రాయింగ్ రూము. అక్కడ స్నేహితులతో కబుర్లు చెప్పుకోడానికి, ఫంక్షన్లకి ఉపయోగపడేలా ఫర్నిచరుంది. దాని ప్రక్కని మరొక గది ఉంది — అది ఇంట్లోకి రెండో ద్వారం కింద ఉపయోగపడుతుంది. బంధువులు, స్త్రీజనం, పాలవాళ్లు, చాకలివాడు, కూరగాయలు అమ్మేవారు ఆ గదిలోంచి లోపలి హవేలీలోకి వెళ్తారు. ఇంక పెరటిలోంచి ఉన్న ద్వారం ఉపయోగపడుతుంది పనివాళ్లకీ, ఇతరజనానికీ. పై అంతస్థుమీద ఉన్నాయి ఎన్నో గదులు. ఒకటి లాయరుగారి పడకగది కమ్ స్టడీ రూము, రెండోది పూర్ణమ్మగారి పడకగది కమ్ గాడ్రెజ్ బీరువాల 'సేఫ్'ల గది. ఆ బీరువాలలో ఉంటాయి విలువైన బట్టలు, నగలు, డబ్బు. మరో గది అమ్మాయిలు చదువుకొనే పడుకొనే గది, మరొకటి అబ్బాయిల గది.

క్రిందని వంటకొక గది, భోజనాలకి హాలు, స్టోరు రూము, పిల్లల స్టడీ కమ్ డ్రాయింగ్ రూము. నరసమ్మ కాపరం వంటింట్లోనే, ఆవిడ పని వండడం, వడ్డించడం. వెనక సాయానికి ఒక బ్రాహ్మణ వితంతువు రోజూ పొద్దున్నే వచ్చి, రాత్రి పదికి వెళ్లిపోతుంది.

రామం, రెండో ద్వారంగుండా ప్రవేశించి వంటింటి దగ్గరికొచ్చేడు. ''నాదేం ఆలస్యం లేదు. స్నానంచేసి మడిపంచ కట్టుకో. కాలికున్న బేండేజి విప్పు.'' శాంతమ్మ చెప్పింది. ''తువ్వాలూ, వేడినీళ్లూ, సబ్బూ బాత్‌రూమ్‌లో ఉన్నాయి.'' నరసమ్మ చెప్పింది.

రామం బాత్‌రూమ్‌వేపు నడుస్తూ ఉండగా పన్నెండేళ్ల నిర్మల (నరసమ్మ కూతురు) వచ్చింది పరుగెత్తుకుంటూ... ''రామం... రామం... నిన్ను సుబ్బడు పిలుస్తున్నాడు... సరస్వతీ హాల్‌కి వెళ్లి నువ్వు టిక్కట్లు తీసుకరావాలిట... పది గంటలకి ఇంగ్లీష్ సినీమా ఉందిట... వాడూ చంద్రం అన్నయ్యా కలిసి వెళ్తారుట...'' గుక్క తిప్పుకోకుండా చెప్పింది... ''ఆఁ... అన్నట్టు... సావిత్రికి గ్రామరు అర్థమయిచావడం లేదుట... బోధపరచడానికి రమ్మంది...'' ఆ హుకుంలు జారీచేసి, రామం ఇప్పుడు ఏ పని చేస్తాడో చూద్దాం అని నిల్చుంది.

''సుబ్బడేమిటే... బావ అనలేవు ? ఈ రోజుల్లో పిల్లలకి వావీవరసలుకూడా తెలీడం లేదు ... ముందు మా పని కానీ ... తరవాత సినీమాలూ అవీనీ ... చంద్రం ఎక్కడ ఏడుస్తున్నాడు... వాడిని వెళ్లి టిక్కట్లు తెమ్మను ...'' అంది నరసమ్మ.

''అన్నయ్య బొమ్మ గీస్తున్నాడు...డ్రాయరు కట్టుకున్న ఆడదాని బొమ్మ ... ఈత డ్రస్‌లో ఉందిట...ఒళ్లంతా కనిపిస్తూ...అదేదో ఇంగ్లీషు పత్రికలోది కట్‌చేసేడు .. అమెరికాలోని అందాల రాణిట...'' కళ్లు చేతులూ చోద్యంగా తిప్పుకుంటూ అన్నయ్య చేస్తున్న ఘనకార్యం వర్ణించింది నిర్మల.

నరసమ్మ నోరు నొక్కుకుంది...''ఇవెక్కడి పాడుబుద్ధులే...వీడికీ ? ఈ బొమ్మలు గియ్యడం ఎక్కడ్నించి వీడికొచ్చిపడిందో ... రాత్రీలేదు ... పగలూలేదు ... ఒకటే బొమ్మలు గియ్యడం. రంగుల పెట్టెలకోసం డబ్బులకోసం నా ప్రాణాలు కొరుక్కుతింటాడు. మనల్ని మసానం తెచ్చి బొమ్మలూ నా పిండాకూడూ చేస్తాడు. మీ నాన్న ఇలా ఉద్ధరించేరు ... ఇంక వీడేదో సంసారాన్ని ఒక ఒడ్డున చేరుస్తాడనుకుంటే చదువు సంధ్యా మానేసి ఇదీ వీడు చేసేది... సినీమాలేదు గినీమాలేదు ... వీడు ఇల్లు దాటితే ఇవాళ ఒప్పుకోను...పుస్తకం తీసి చదవమను.''

నిర్మల, అమ్మ కేసి వినోదంగా చూసింది. అమ్మ ఈ మాటలన్నీ అనడమేకాని ఒక్కటీ చెయ్యలేదు. చంద్రం వాడు చేసిన పనివాడు చేస్తూనే ఉంటాడు. ''నా బొమ్మ, సావిత్రి బొమ్మ, లత బొమ్మ పెన్సిల్తో గీసేడు అన్న. సుబ్బడు... బుర్రి బుర్రి... బావ అన్నాడు కదా ఒరే చంద్రం— ఆ బొమ్మల కింద పేర్లు కూడా రాయరా...అప్పటిక్కాని వాటి అర్థం తెలీదు ... ఎవరిబొమ్మో...ఏంచేస్తున్నారో...'' నిర్మల ఈ కబుర్లన్నీ రామం వినాలని చెప్తోంది. రామం ఎప్పుడు వచ్చినా నిర్మల వంటింటి దగ్గరికొచ్చి, రామం వెళ్లిపోయేవరకూ ఉంటుంది. ఏదో ఒక సాకు పెట్టుకొని అలా మాట్లాడుతూనే ఉంటుంది.

**(ఇంకా వుంది)**

---

ఇటీవల చిత్రకళా పరిషత్తు (విశాఖపట్నం) వారు తమ సంస్థ 18వ వార్షికోత్సవాన్ని పురస్కరించుకుని చిత్రకళాప్రదర్శన నిర్వహించారు. ఆ సందర్భంగా డా. శ్రీమతి శ్యామలాచిష్టి బహుమతులందజేస్తున్న దృశ్యం, సభాధ్యక్షులు శ్రీ డి. సుందరరావు, కళాపరిషత్తు కార్యదర్శి శ్రీ అంట్యాకుల పైడిరాజుగార్లను చిత్రంలో చూడవచ్చు.






### కె. వి. ఆర్. — వడ్లమానిపాలెం

నా అభిమాన డైరెక్టర్ దాసరి గారితో 'దిద్దుతిరుగుడు పూలు' సినిమా తీస్తున్నారన్నారు. ఇప్పుడా పేరెక్కడా వినబడడంలేదు. తియ్యడంలేదా ? దాసరిగారిపై మీ అభిప్రాయం ?

★ కొత్తవారితోనా—పాతవారితోనా ? అన్న డైలమా—లో పడ్డంతో ఆలస్యం అయిందంతే. మ్యాసులో రానివి పనులు ఆగిపోయాయను కొంటారేమిటి మీరంతా ?! దాసరి మంచి మనిషి.

### ఆర్. ఆర్. కె. — కాల్వెర్

తప్పుచేసి ఒప్పుకున్న వాడిని కనికరించి క్షమించాలా ? కఠినంగా శిక్షించాలా ?

★ ఒప్పుకుని పశ్చాత్తాప పడ్డాక— శిక్షించడం—మానవత్వం వున్న మనిషి చేసే పని కాదు.

### ఎస్. ఎస్. — భువనేశ్వర్

నేటి స్నేహితులలో త్యాగంకన్నా స్వార్థం పాలే ఎక్కువ. ఎందుచేత ?

★ స్వార్థం కోసం స్నేహం చేస్తే— అంతే జరుగుంది.

నిజమైన స్నేహానికి అర్థం ఏమిటి ?

★ భిన్న దృక్పథాలని; భిన్నాభిప్రాయాలనీ గౌరవించుకొంటూ— కలిసి మెలిసి వుండ కల్గడమే— స్నేహానికి అర్థం. ఒకళ్లలాగా— ఇంకొకళ్లు అయిపోవడం కాదు ! అయిపోవాలనుకోవడం కాదు.

### వై. వి. ఎస్. — తిప్పగుంటపాలెం

జీవితంలో కోరుకున్నవి ఫలిస్తాయంటారా?

★ఆదర్శాల్లాగే కోరికలూ రెండంతస్తులుగా వుండాలి. తారకలకి వలవిసిరితే— చెట్టుపై కొమ్మకేనా తగిలదానల ? కోరికలూ అంతే— తృప్తి ప్రధానం.

### టి. ఎమ్. — మారంపల్లి

గుళ్ళ గోపురాలు ఎత్తయిన ప్రదేశాలలో నిర్మిస్తారెందుకు ?

★ భక్తుల దమ్ము పరీక్షించడానికి.

### ఎ. ఎస్. ఆర్. — యలమంచిలి

త్రాగడంగురించి మీ అభిప్రాయం ఏమిటి?

★ త్రాగడం సాంఘిక మర్యాదగా ప్రారంభమై— సంసారాలలో రాక్షసిగా మారే ప్రమాదం వుంది. ఎందుకంటే— ఛస్తే మన వాళ్లకి— సోషల్ డ్రికింగ్‌తో ఆగడం రాదు... త్రాగినా సభ్యతగా వుండడం రాదు. వీధిలో సరదాకి, యింట్లో కోరికకీ తాగి భార్యముందు పిల్లలముందు గౌరవ మర్యాదలు పోగొట్టుకొంటూన్న మధ్య తరగతి మనిషే— యీనాడు సగం కుటుంబ విచ్ఛిన్నాలకి కారణం అంటే— అబద్ధం అనగలరా ?

### ఎ. వై. ఆర్. — తమ్మినపట్నం

నన్ను కొందరు మంచివాడని కొందరు చెడ్డవాడని అంటారు. అందరిచేత ఎల్లప్పుడూ మంచివాడనిపించుకోవాలంటే ఏం చేయాలి ?

★ ఏం చేసీ ప్రయోజనం వుండదు. అప్పుడూ — కొందరలాగా కొందరిలాగా — అనుకుంటూనే వుంటారు. అంచేత- మనం మంచిది అనుకున్నట్టుంటే— ఉండకల్గితే — అదే పదివేలు.




### కె. వి. ఎమ్. — దులియజాన్

మీరు ప్రేమ ప్రశ్నంకి చక్కగా సమాధానాలిస్తారు. మీరు కూడా ఈ ప్రేమలోపడి విడిపోయారా ?

★ చిన్నప్పుడు నేను చాలామందినే ప్రేమించాను— తెలుగు మాష్టార్ని, లెక్కలు రాని నాకు లెక్కలు చెప్పాలనుకునే లెక్కల మేష్టార్ని, సైన్సు చెప్పాలని తల బద్దలు కొట్టుకున్న 'జగన్నాధం' మాష్టార్ని, కృష్ణమూర్తిగారు బాగున్నారని పిజిక్సుని యిలా చాలామంది లిస్టు. కాని ప్రేమలో పడి వుండిపోయినది—ఒక వ్యక్తినే.

### సి హెచ్. ఎస్. ఆర్. — పత్తేనవల్లి

మీ జీవితాశయం ఏమిటి ?

★ ఇంకా ఏం లేదు !

2 కోట్ల 2 లక్షల లాటరీ మీకు వస్తే ఏం చేస్తారు ?

★ రాదు. నేనెప్పుడూ లాటరీ టిక్కెట్టు కొనలేదు. కొనను. 'యీజీ కమ్ — యీజీ గో' అని వినలేదా ? డబ్బు సంపాదించుకోవాలి — లాటరీలో కాదు.

### కె. ఎస్. ఎల్. — హైదరాబాదు

స్త్రీ యీ లోకం నుండి శాశ్వతంగా సెలవు తీసుకొనే వరకూ ఒకరి స్వాధీనంలో ఆజ్ఞలలో, ఒకరికి లోబడి ఎందుకుండాలి ?

★ అవును — ఎందుకుండాలి ? ఎవరు వుండమంటున్నారు ? ఎందుకుండవలసి వస్తోందని ప్రశ్నించుకోండి సోదరీ—ఆర్థికంగా ఆధారంలేక; సాంఘికంగా — ప్రత్యేకతలేక, రాజకీయంగా అధికారంలో భాగస్వామ్యంలేక.

### పి. యు. — ఖమ్మం

ఆడవారు అబద్ధం చెప్పినా నమ్ముతారు. మగవారు నిజం చెప్పినా నమ్మరెందుకు ?

★ అబద్ధాన్ని, నిజాన్నికూడా అందంగా చెప్పకల్గాలి — నమ్మించాలంటే !

### టి.సి హెచ్.వి.ఆర్.—రావులపాలెం

పోలీసులే హంతకులైతే ?

★ హంతకులు రక్షకులుగా మారవచ్చు !

### కె. యు. ఎస్. ఆర్. — జిన్నూరు

మీరు ఇచ్చిన జవాబులు తలనొప్పి కల్గిస్తున్నాయి. కారణం ?

★ ఆంధ్రపత్రికతోపాటు అమృతాంజనం కొనరా ? ... రెండూ అలవాటుండాలి !

అసలు మీరేం చదివారు ?

★ చెప్పుకోతగ్గ చదువులేదు కనుకనే — మొండిగా రాయకల్గుతున్నానని గ్రహించి వుంటారని అనుకుంటున్నానే !! ★



మహిమ సౌందర్యములతో త్రికుట పర్వత గుహలో వెలసి ఉన్న మాతా వైష్ణవీదేవి !

# మహాశక్తి స్వరూపిణి మాతా వైష్ణవీదేవి

రాక్షస సంహారార్థం 'కాళి'గా అవతరించిన శక్తిస్వరూపిణి తన తేజస్సు నుండి మరో దివ్యశక్తిని సృష్టించినది. ఆ దివ్యశక్తిని దక్షిణ భారతదేశంలో రత్నాకర్‌సాగర్ అనువాని యింట విష్ణు అంశ కలిగిన పుత్రికగా జన్మించి ధర్మాన్ని రక్షించమని ఆదేశించినది. ఆ దివ్యకన్య రత్నసాగర్‌కి జన్మించి 'త్రికుట' నామధేయంతో పెరుగసాగినది. విష్ణు అంశతో జన్మించిన కారణమున 'వైష్ణవదేవి'గను, ఆమె ఉపదేశించిన ధర్మమునకు వైష్ణవ ధర్మంగాను ప్రసిద్ధి గాంచెను.

త్రికుట తన దివ్యశక్తిచే సమస్త మానవులచే ఆకర్షింపబడినది. ఆమెను దర్శించుటకు, ఋషులు, సామాన్య మానవులు ఎక్కడెక్కడి నుండో వచ్చుచుండిరి. పిదప తండ్రి అనుజ్ఞ తీసుకొని సముద్రతీరములో ఆమె తపస్సు చేయ నారంభించెను. రావణ సంహారమునకై సాధు శ్రీరామచంద్రుడు సముద్రం ఒడ్డున తపమాచరించుచున్న త్రికుటను గమనించి తపమాచరించుటకు కారణమడిగెను. అప్పుడామె తాను శ్రీరామచంద్రుని వరించినట్లు చెప్పెను. అంత శ్రీరామచంద్రుడు "నేను ఏక పత్నీవ్రతుడను. అయినను నీ తపః మహిమచే నేను ఏదో ఒకనాడు మారువేషమున నీ చెంతకు చేరెదను. అప్పుడు నీవు నన్ను గుర్తించితివేని నిన్ను నా సహ ధర్మచారిణిగా స్వీకరించెదను" అని చెప్పి రావణ సంహారణార్థం లంకకు వెడలెను. తిరిగి సాధువు వేషములో నున్న శ్రీరామచంద్రుని త్రికుట గుర్తించగా ఆమెతో ఈ విధముగా అనెను. "నేను ఈ అవతారంలో ఏకపత్నీవ్రతుడను కలియుగమున కల్కి అవతారమున నిన్ను నా సహధర్మచారిణిగా స్వీకరిస్తాను అంతవరకు 'త్రికుట' పర్వతములో తపస్సు చేయుచూ నాకోసం నిరీక్షించమని" చెప్పెను. వీరలంగురు (లంగురు అంటే 'కొండముచ్చు' అయిన వానర జాతి)ను ఆమెకు అంగరక్షకుడుగా నియమించెను. ఈమే కాలక్రమమున మహాకాళీ, మహాలక్ష్మి, మహా సరస్వతిలుగా రూపములుదాల్చి పిండ రూపమున వెలసినది.

వైష్ణవీదేవి భక్తులలో శ్రీధర్ బాబా ముఖ్యుడు. ఈయనకు సంతానములేదు. ఈయన 'కన్యలకు' భోజనముపెట్టు వ్రతమాచరించు చుండెను. అయినను సంతానము కలుగలేదు. వైష్ణవదేవి స్వయంగా వచ్చి తన యింట భుజిస్తేగాని తాను భోజనము చేయనని కఠోర ప్రతిజ్ఞ పూనెను. ఒకరోజు అందరు కన్యలు భోజనముచేసి వెడలిపోయినను ఒక కన్య మాత్రము



త్రికుట పర్వత గుహ ప్రవేశ ద్వారము



కాలిబాటన వెళ్ళుతున్న యాత్రికులు

దివ్య తేజస్సుతో అక్కడే కూర్చుండెను. విస్మయముతో శ్రీధర్ ఆమె కూర్చుండుటకు గల కారణమడిగెను. అందుకామె నీవు భుజించుము, నేను వెళ్ళిపోయెదననగా శ్రీధర్ తన వ్రత దీక్షను ఆమెకు తెలిపెను. దేవి అందుకు పరమానందభరితయై "ఓయి! నేనే వైష్ణవిని. ఇంక దీక్ష మాని భుజించుము. నీకు నలుగురు పుత్రులు జన్మించగలరు. నేను వీర లంగురు రక్షణలో 'త్రికుట' పర్వతముపై తపమాచరించుకొనుచుందును. నేను నివసించు గుహావరకు భక్తులు కొరకు మార్గమేర్పరిచి, నా గురించి ప్రచారము చేయుము. నీ వంశమువారి వలన నాకు సదా పూజలు— ఆరాధనలు జరుగగలవు" అని చెప్పి అంతర్ధానమయ్యెను.

బాబా శ్రీధర్ గురించి మరొక కథ కూడ కలదు. శ్రీధర్ బాబా అభోజనవ్రత సమయంలో అందరు కన్యలు భోజనం చేసి వెళ్ళినను ఒక కన్య మాత్రము వెళ్ళకుండా నిలిచిపోయిన దంటిమి కదా! అప్పుడు శ్రీధర్ బాబా ఆమె నిలిచిపోవుటకు కారణమడుగగా తనే వైష్ణవిని అని చెప్పి, "బాబా! చుట్టుప్రక్కల బ్రాహ్మణులను కూడ ఆహ్వానించి భోజనము పెట్టుము అనెను." గోరఖ్‌నాథ్ శ్రీధర్ బాబా ఆహ్వానంపై తన శిష్యపరివారంతో కుటీరములోనికి ప్రవేశించెను. భోజనం చేయుచున్న భైరవినాథ్ తన గురువు యొక్క ఆజ్ఞచే వడ్డిస్తున్న కన్యను తనకు మాంసాహారము వడ్డించమని కోరెను. శాంత గంభీర స్వరముతో ఆ కన్య "యోగినయ్యా! ఇది వైష్ణవ భండారము. నీకిక్కడ మాంసాహారము లభించదు" అని చెప్పినంతనే భైరవినాథ్ ఆమె చెయ్యి పట్టుకో జూచెను. ఆ కన్య అక్కడి నుండి పారిపోసాగెను. అజ్ఞాత రూపంలో రక్షకుడిగా వస్తున్న వీరలంగురుకి దప్పిక వేయగా దివ్య కన్య రాళ్ళలో బాణము వేసి జలాన్ని రప్పించినది. బాణముతో సృష్టించిన

# మహాశక్తి స్వరూపిణి మాతా వైష్ణవీదేవి!

గంగ గనుక 'బాణగంగ' అనే పేరు వచ్చినది. దారిలో ఒకచోట ఆగి భైరవినాథ్ వెన్నంటి వస్తున్నాడా! లేడా! అని చూచిన స్థలానికి 'చరణ్ పాదుక' అని పేరు వచ్చినది. ఆమెను వెదుకుచు వచ్చిన భైరవినాథ్ ఒక మునిని కన్య గురించి అడిగెను. అంత ఆ తపస్వి 'నీవు వెదుకుచు తిరుగుచున్న కన్య మానవమాత్రురాలు కాదు. ఆమె కౌమార్య స్థితిలో తిరుగుచున్న 'ఆదికుమారి' అని హెచ్చరించెను. తపస్వి 'ఆదికుమారి' అని ఉచ్చరించిన కారణమున ఆ ప్రాంతమునకు 'ఆదికుమారి' అని పేరు వచ్చెను. 'గర్భజూన్' అనే గుహలో ఆ కన్య తపస్సు చేసుకొనుచుండెను. భైరవినాథ్ ఆ గుహలో ప్రవేశించెను. అతనిని గమనించిన భగవతి తన త్రిశూలంతో గుహ వెనుక భాగమున మార్గమేర్పరిచి తిరిగి నడక సాగించెను. భైరవినాథ్ వెంబడించుచునే ఉండెను. త్రికుట పర్వతము నందలి సుందర గుహలో త్రికుట తపమాచరించుచుండెను. అక్కడికి కూడ భైరవినాథ్ ప్రవేశించెను. రక్షకుడుగా నున్న వీరలంగురు భైరవినాథ్‌తో తలపడి ఓడిపోయే సమయంలో కన్య మహాకాళీ అవతారమెత్తి భైరవినాథ్ తల నరికివేసెను. ఆ తల ఎత్తయిన శిఖరముపై పడెను. మొండెము గుహ ద్వారము కడనే పడెను. భైరవినాథ్ శిరస్సు నుండి దీనాతి దీనంగా "జగన్మాతా! నేను నిన్ను వెంటాడినది కేవలం గురువాజ్ఞ పాలనకొరకే. నా మృత్యువు నీ చేతిలో జరిగినందులకు నాకు చాలా సంతోషంగా ఉన్నదని" పలికెను. "కానీ ప్రజం దృష్టిలో నేనొక పాపాత్ముడిగా నిలిచిపోవడం బాధాకరంగా ఉన్నది. మోక్షం ప్రసాదించు తల్లీ" అని వేడుకొనెను. 'మాతా' అన్న అతని సంబోధనకు హృదయం ద్రవించి "భైరవా! నాతోకూడ నీకు పూజలు అందుతాయి. నన్ను దర్శించి నిన్ను దర్శించకుండా వెళ్ళిన భక్తుల కోరికలు సిద్ధించవు" అని చెప్పి మూడు రూపముల పిండాకృతిలో రూపొందుమా దేవి దేహత్యాగము చేసెను.

శ్రీధర్ బాబా కన్య పారిపోయిన తరువాత దుఃఖితుడై భోజనము విసర్జించెను. త్రికుట పర్వతములో తపమాచరించు దేవి ఆయనకు స్వప్నములో ప్రత్యక్షమయ్యెను. బాబా సంతుష్టుడై తిరిగి భోజనము చేయ నారంభించెను. త్రికుటపర్వతముచేరి దేవిని గుహలో గాంచి పులకితుడయ్యెను. అక్కడివరకు మార్గమేర్పరిచి దేవినివాసము భక్తులకెల్లరకు ప్రచారము చేసి నలుగురు పుత్రులకు తండ్రియై దేవిపూజ, ఆరాధనలు గావించుతూ ధన్యుడయ్యెను. ఇప్పటికి శ్రీధర్‌బాబా వంశీయులే వైష్ణవీదేవికి పూజా పునస్కారములు జరుపుచున్నారని చెప్పెదరు.

శ్రీ వైష్ణవీదేవిని దర్శించుట చాల శ్రమతో కూడిన పని. మార్గమంత సున్నటి రాళ్ళు పరుపబడి ఉండును. ఏకబిగిని నడిచిన పర్వత శిఖరాన్ని ఎక్కుటకు దిగుటకు 12 గంటలు పట్టును. నడవలేని వారు గుర్రాలపై వెళ్ళవచ్చు. పోను రాను గుర్రానికి మనిషికి 50 రూ. ఖర్చు అవుతుంది. దారిపొడవునా అన్ని వసతులు ఉంటాయి. ధర్మశాలలు ఉన్నాయి. ఇక్కడ ప్రకృతి సౌందర్యం వర్ణనాతీతం. చలి కాలం తప్ప మిగతా కాలాలలో అంతా భక్తులతో వైష్ణవీదేవి ఆలయం కళకళలాడుతూ ఉంటుంది. ఏమైనా జీవితంలో ఒకసారి దర్శించాల్సిన స్థలం ఈ వైష్ణవదేవి ఆలయం.

వ్యాసం, ఫోటోలు :
శ్రీమతి అయ్యగారి వెంకటసత్యవతి*

రస్న
నిముషాల్లో
ఇంట్లోనే తయారయ్యే,
అతి మధుర పానీయం.

అతిధులు వచ్చినప్పుడుగాని, పార్టీలకోస
రస్న పేకెట్‌ను తెరవండి. పంచదార,
నీళ్ళలో కలపండి. నిముషాల్లో 32 గ్లాస
మధుర రసం తయారవుతుంది.
ప్రతి రస్న పేకెట్ నుండి.

రస్న ధరను మిగతా పానీయాలతో
పోల్చి చూడండి. సగం కన్నా తక్కువ
రస్న మీకు నోరూరించే
8 రకాల రుచులలో లభిస్తుంది.

**రస్న**

సాఫ్ట్ డ్రింక్ కాన్సెన్ట్రేట్
**ఎంతో రుచి !**
**ఎంతో ఆదా !**




తయారుచేయువారు : పయోమ ఇండస్ట్రీస్, అసర్వా, అహమదాబాద్-380 016.

Mudra:PI:1620

# సినిమా విశేషాలు



-జి. వి. జి.



శోభన్‌బాబు, జయసుధ 'దండయాత్ర'

## ఉగాది ఉత్సవ కార్యక్రమం

''రాష్ట్రేతర ప్రాంతంలో తెలుగు భాష సాంస్కృతిక వికాసమే ధ్యేయంగా ప్రతి ఏటా వివిధ రంగాలలోని ప్రముఖులను సత్కరించే మద్రాసు తెలుగు సంగీత నాటక నృత్య సాహిత్య ఐక్య అకాడమీని ఎంతైనా అభినందిస్తున్నాను,'' అన్నారు అధ్యక్షత వహించిన లెఫ్టినెంట్ గవర్నర్ శ్రీ కోన ప్రభాకరరావు. విద్వాన్ పళనిస్వామి నాదస్వర సంగీతంతో ప్రారంభమైన ఉగాది ఉత్సవ కార్యక్రమంలో పంచాంగ శ్రవణం అనంతరం సి. నారాయణరెడ్డి అధ్యక్షతన జరిగిన కవి సమ్మేళనంలో మల్లెమాల, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, ఎ. బాల సుబ్రహ్మణ్యం, ఆరుద్ర, సాయికృష్ణయాచేంద్ర, ఉపద్రష్ట సాయి, చెరువు ఆంజనేయశాస్త్రి, పి. వి. శ్రీనివాస్, పి. ఎస్. గోపాలకృష్ణ, టి. ఎస్. ఎస్. రంగనాథ్ కవితాగానం చేశారు. బండారు చిట్టిబాబు సంగీత నిర్దేశకత్వంలో మధురంగా గానం చేసిన శారద, పద్మజ,

నరసింహారావు, శ్రీ సి. హెచ్. రామోజీరావు, ప్రొఫెసర్ ఎస్. ఆర్. పాకాల అనివార్య కారణాల వల్ల రాలేకపోయారు.

## శ్రీకాంత్ నవల ఆధారంగా "పోతుగడ్డ"

''అభ్యుదయ రచయిత శ్రీకాంత్ రాసిన 'దేవుళ్ళారా మీపేరేమిటి ?' విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ నిర్వహించిన నవలల పోటీలో ప్రథమ బహుమతి పొందినది. సమకాలీన సమాజాన్ని, గ్రామీణ ఇతివృత్తాన్ని ప్రతిబింబించే ఈ నవల కన్నడంలో కూడా అనువదించబడింది. పల్లె ప్రాంతాల్లో ఇప్పటికీ నలుగుతున్న అనేకానేక సమస్యలతోపాటు వాటి పరిష్కారం కూడా కథలో ఇమిడి ఉన్నందున 'పోతుగడ్డ' అన్న పేరు నిర్ణయించడం జరిగింది,'' అన్నారు జి. శిరీష్‌బాబు. ఈయన కట్టా సుబ్బారావు దర్శకత్వంలో నిర్మించే జనచైతన్య ఆర్ట్ పిక్చర్స్ వారి



కాపురం'



'శ్రీమతి కావాలి'లో అనూరాధ

పై చిత్రంలో మాదాల రంగారావు ప్రధాన పాత్రధారి. టి. చలపతిరావు సంగీత దర్శకుడు. మార్చి 27, 28 తేదీలలో రెండు పాటలు రికార్డు చేయబడ్డాయి. మే నెలలో ఒకే షెడ్యూల్లో మన రాష్ట్రంలో చిత్రీకరణ జరుగుతుంది.

## విజయబాపినీడు దర్శకత్వంలో శోభన్ సరసన జయసుధ, సుహాసిని

''వినోదాత్మకమైన కథ,'' అన్నారు విజయ బాపినీడు. ఈయన దర్శకత్వం వహించే శ్రీనివాసా ప్రొడక్షన్స్ ద్వితీయ చిత్రానికి ఏప్రిల్ 23న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరుగుతుంది. శోభన్‌బాబు, జయసుధ, సుహాసిని, రావు గోపాలరావు, నూతన్‌ప్రసాద్, వేలు, నిర్మల పాల్గొంటారు. మే, జూలై నెలల్లో షూటింగ్ జరుగుతుంది. సత్యం సంగీత దర్శకుడు. సత్యమూర్తి సంభాషణలకర్త. ఆగస్ట్ 15న విడుదల చేయదలచినట్లు నిర్మాతలు గుట్టూరి రాధాకృష్ణమూర్తి, కొమ్మన నారాయణ తెలియజేశారు.

కళ్యాణీలకు నగదు బహుమతులను; నారాయణ, సాయి(శీలకు (ప్రత్యేక బహుమతులను (శీ రాజలక్ష్మి ఫౌండేషన్ తరఫున పి. వి. రమణయ్యరాజా అందజేశారు. "వివిధ రంగాలలో విశేషమైన కృషి సల్పిన (ప్రసిద్ధాంధ్ర వ్యక్తులను ఈ పెద్ద పండుగనాడు ఒకే వేదికమీదికి తీసుకువచ్చి బృహత్తర కృషి చేసినందుకు ఈ ఐక్య అకాడమీ చెయిర్‌మన్ ఓబులరెడ్డిగారిని మనసారా అభినందిస్తున్నాను," అన్నారు అక్కినేని నాగేశ్వరరావు. వీరితో పాటు

మెమెంటోలు స్వీకరించినవారు : సర్వ(శీ బెజవాడ గోపాలరెడ్డి, డాక్టర్ సి. సత్యనారాయణ, డాక్టర్ (ప్రతాప్ సి. రెడ్డి, ఆరుద్ర, సి. నారాయణరెడ్డి, బి. నాగిరెడ్డి, మాలతీ చందూర్, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, వీణ చిట్టిబాబు, ఎస్. రాజేశ్వరరావు, పి. సుశీల, ఎస్. జానకి, ఎస్. పి. బాలసు(బహ్మణ్యం, వెంపటి చిన సత్యనారాయణ, శోభానాయుడు, పి. పుల్లయ్య, కమలాకర కామేశ్వరరావు, శారద, పీసపాటి, వి. చం(ద్రశేఖరం, మునిరెడ్డి, బాపు. మెమొంటోలను స్వీకరించడానికి (ప్రొఫెసర్ ఎన్. జి. రంగా, (శీ పి. వి.



'కాయ్‌రాజా కాయ్'లో చం(ద్రమోహన్, తులసి

## గుంటూరులో "దేశంలో దొంగలు పడ్డారు"

"మార్చి 22 నుంచి నెలాఖరు వరకు మ(ద్రాసు (ప్రాంతాల్లో తొలి షెడ్యూల్ జరిపాం. గుంటూరులో ఒకే షెడ్యూల్‌గా ఏ(ప్రిల్ నెలాఖరుకి షూటింగ్‌ను ముగిస్తాం," అన్నారు కృష్ణ. ఈయన కథ, (స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పోకూరి వెంకటేశ్వరరావు నిర్మించే ఈతరం పిక్చర్స్ "దేశంలో దొంగలు పడ్డారు" చి(త్రంలో సుమన్, విజయశాంతి, రాజ్యలక్ష్మి, కె. విజయ, విజయ, రాగిణి, రాజేశ్వరి, లక్ష్మి(ప్రియ, జయవిజయ, డబ్బింగ్ జానకి, పి.ఎల్. నారాయణ, సాక్షి రంగారావు, వీరభ(ద్రరావు, వేలు, పి. జె. శర్మ, న(ర్రా వెంకటేశ్వరరావు, రమణారెడ్డి, శివరామిరెడ్డి (ప్రభృత నటవర్గం. హరనాథరావు మాటలు రాశారు. అదృష్టదీపక్, లక్ష్మీనారాయణ గీతాలకు చ(క్రవర్తి బాణీలు కూర్చారు. ఆర్. రామారావు ఛాయ, చౌదుల సుబ్బారావు కూర్పు, ముత్యాల సుబ్బయ్య సహదర్శకత్వంతో బెజవాడ కోటేశ్వరరావు, సుబ్బారావు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు.

మదరాసు తెలుగు సంగీత, నాటక, నృత్య, సాహిత్య ఐక్య అకాడమీ వారి ఉగాది ఉత్సవాల సందర్భంగా డా. బెజవాడ గోపాలరెడ్డిగారి నుంచి 'ఉగాది వెలుగు' మెమెంటోలని అందుకుంటున్న (శీ అక్కినేని నాగేశ్వరరావు, (శీ బాల మురళీకృష్ణ, (శీ యస్. పి. బాలసు(బహ్మణ్యం, (శీమతి పి. సుశీల, (శీమతి యస్. జానకి, (శీమతి శారదగార్లని చూడవచ్చు.





# ఖేతాన్ ఫ్యాన్ భారతదేశంలో అన్నిటికన్నా శ్రేష్ఠమైనదా కాదా అన్నది కాదు ప్రశ్న, ప్రపంచంలో కెల్లా శ్రేష్ఠమైనదా అని.

ప్రపంచం మొత్తంలో కీర్తిగాంచిన ఫ్యాన్ నిపుణులు తీర్చి దిద్దే ఖేతాన్ ఫ్యానులు, భారత దేశంలో మన్న ఆధునిక కర్మాగారములలో తయారు చేయబడతాయి. జనప్రీతి గాంచిన ఎన్నో దేశీ ఫ్యానులను మేము పరీక్షించి చూచేము గానీ, శ్రేష్ఠత లేక కార్యములో ఖేతాన్‌తో ఏది సమతూగ లేక పోయినది. ఖేతాన్ భారత దేశంలోనే కాదు, బహుసా ప్రపంచం మొత్తంలోకెల్లా శ్రేష్ఠమైన ఫ్యాన్ అని మా నమ్మకము.

మేమనేది తప్పని మీరు నిరూపించగలుగుతే, మాకు చెప్పండి.

## ఖేతాన్

బహుసా ప్రపంచంలోకెల్లా శ్రేష్ఠమైన ఫ్యాన్.

SDL-5473








# తారలు - తీరులు

★ "ఒక ప్రఖ్యాత తారకు జపాన్ లేక—ఆంగ్లో ఇండియన్ శిరోజాలంకరణ తెలిసిన యువతి కావలయును. వివరములకు ఈ కింది ఫోన్ నెంబర్‌కు డయల్ చేయండి," అంటూ 'హిందూ' పత్రికలో ఈ మధ్య ఓ ఆంగ్ల ప్రకటన వెలువడింది. ఆ ఫోన్ నెంబర్ సుమలతది. ఈ విషయమై ఆమెను అడిగితే, "ఇటీవల సినీఫీల్డ్‌లో హెర్ స్టయిల్సన్నీ దాదాపు ఒకే టైప్‌లో ఉంటున్నాయి. వెరైటీ అవసరంకదా ? అంచేత, అలా ప్రకటన చేయక తప్పింది కాదు," అందామె.

★ అంబిక ఇటీవల సులోచనాలు ధరిస్తోంది. "మైనస్సా, ప్లస్సా ?" అని ఎవరో అమ్మాయి అడిగితే, "జీనియస్," అని జవాబిచ్చిందామె. ఈమెకు చెల్లెలు, రాధకు అక్క అయిన మాధవి., బి. ఎస్. సి.కి మే నెలలో వివాహం. "సినిమా మనిషి మాత్రం కాదు," అంది రాధ నవ్వుతూ. వరుడు శ్రీకుమార్ కేరళలో వాణిజ్యవేత్త. "నేనిప్పుడు నటిస్తూన్న హిందీ చిత్రం విడుదలయ్యాక హిట్ అయితేనే తదుపరి హిందీ చిత్రాలకు అంగీకరిస్తాను," అంది రాధ. "తుఫాన్ సూచన మేరకు ఉన్నట్టుండి స్కూళ్ళకుగాని, కాలేజీలకుగాని లీవ్ ఇస్తే స్టూడెంట్స్ ఎంత సంబరపడిపోతారో అంత ఆనందం కల్గుతుందండీ హఠాత్తుగా షూటింగ్ కేన్సిల్ అయితే. చక్కా ఇంటికెళ్లి హాయిగా వీడియోలో సినిమాలు చూస్తూండొచ్చు. నాకు ఇంకో ఆశకూడా ఉంది -- వయొలిన్ నేర్చుకోవాలని," అంది రాధ. ఈమె తెరమీదగాని, నిజ జీవితంలోగాని కుడి చెవిని కురులతో కాస్త కప్పి ఉంచుతుంది సాధారణంగా. ఈ విషయం గురించి అడిగితే, "అవునండీ. చిన్నప్పట్నుంచీ అంతే," అంది. ఏదైనా ప్రశ్న అడిగితే, రెండు మూడు క్షణాలు కళ్ళు మూసుకుని ఆలోచించి జవాబు చెప్పడం ఈమె మేనరిజం. "భలే గమనించారే," అంది మందహాసంతో. ఈమె అసలు పేరు ఉదయ చంద్రిక.

★ సిల్క్‌స్మితకు హేండ్‌బాగ్స్ సేకరించడం ఓ హాబీ. ఈమెవద్ద యాభై కి పైగా హేండ్‌బాగ్స్ ఉన్నాయట. "వాటిని ఖాళీగా ఉంచను సుమండీ. ప్రతి బేగ్‌లోనూ వందరూపాయల నోటు ఒకటో రెండో ఉంచి మరీ బీరువాలో భద్రపరుస్తాను," అందామె.

★ జయలలిత పొలిటికల్ సైన్స్ పాఠ్యభాగంగా మైసూరు విశ్వవిద్యాలయం నిర్వహించే డిగ్రీ పరీక్షలకు హాజరవబోతోంది. 'మానసవీణ' హీరోయిన్ రేవతికూడా మేలో జరిగే మద్రాసు యూనివర్శిటీ పరీక్షలకోసం తయారవుతోంది.

★ "నాకు నీలంరంగు చీర చాలా లక్కీ," అంటుంది సరిత. "కొన్నిసార్లు ప్లేన్ టిక్కెట్లు కన్‌ఫర్మ్‌కాని పరిస్థితుల్లో నేను బ్లూ శారీ కట్టుకుని విమానాశ్రయానికి వెళ్ళేసరికి ఇట్టే సీట్లు దొరికిపోయాయి విచిత్రంగా. అలాగే '7' నా లక్కీ నెంబర్. కమల్‌హాసన్ తన ప్రతి కారు నెంబరూ మొత్తం కూడితే '7' వచ్చేలా చూసుకుంటారు. నేనుకూడా ఈసారి కారు కొనేటప్పుడు అదేవిధంగా చూసుకోవాలి," అందామె. ఈమెను బాలచందర్ యూనిట్‌లోని వారంతా "శిశు" అని పిలుస్తారు.

★ "చివరిదాకా శాకాహారమే భుజించాలనీ, ప్రతి రోజూ ఒక సినిమా చూడాలని నా కోర్కెలు. ఇందులో మొదటిది నెరవేరుతుందిగాని, రెండోవది నెరవేరడమే కాస్త కష్టం," అంటుంది నళిని.

## సినిమా

### వి. జగదీష్ దర్శకత్వంలో మరో రెండు చిత్రాలు

''సూపర్ స్టార్'' అనంతరం సిని కళా కేంద్ర బానర్‌లో కాకినాడకు చెందిన వేదుల సుబ్రహ్మణ్యం, విశ్వేశ్వరరావు నిర్మించే ''రావణ ప్రతిజ్ఞ'' పౌరాణిక చిత్రానికి, ''సరంగు సాంబయ్య'' సాంఘిక చిత్రానికి వి. జగదీష్ దర్శకత్వం వహిస్తారు.

'లింగడు—రామలింగడు'లో జయమాలిని



# సుత్తి కౌముసుమ్మో!

రేలంగి... అనేమాట వినగానే ఇవాల్టికీ నవ్వు వస్తుంది! హాస్యంలో అంతటి ప్రతిభ చూపించాడు ఆయన! ఆ తర్వాత... రాజబాబు హాస్యనటునిగా మంచి పేరు తెచ్చుకొన్నాడు.

అలా హాస్యనటుడుగా మంచి పేరు తెచ్చుకుని... జనంలో నాలుగు కాలాలు వుండి పోయిన ఏకైక నటుడు శ్రీ అల్లు రామ లింగయ్య —

వయసు పెరుగుతున్నా... ప్రతిభ తగ్గి పోకుండా... ఒక చిత్రంలో కాకపోతే మరో చిత్రంలో జాగ్రత్తపడుతూ ఇవాల్టికీ 'అరేయ్... అల్లురోయ్ ...' అనిపించుకుంటున్నాడు ఆయన వొక్కడే!... అయితే— ఇవాళ అల్లుకి వారసుడు ఎవరు అని అడిగితే... నిజానికి ఎవరూ లేరు! కానీ— అల్లులాగా పాత్రని అర్థం చేసుకొని ... ఇటు కుర్రాడిగా... అటు ముసలాడిగా నటించగల ప్రతిభ కనిపించే వ్యక్తి... 'వేలు' అంటే తప్పు లేదనుకుంటాను —

వేలు అనేకంటే 'సుత్తివేలు' అంటేనే బాగా అర్థం అవుతుంది జనాలకి —

మన చిత్రాలలో సున్నితమయిన హాస్యానికి కరువు ఏర్పడిన దశలో... శ్రీ జంధ్యాల పరిచయం చేసిన ఈ 'సుత్తి' జనాలకి మంచి హాస్యం అందించాడు —

ఆ తర్వాత వచ్చిన చాలా చిత్రాలలో చాలా పాత్రలు ధరించిన వేలు... ఈ మధ్య వస్తున్న ఎక్కువ చిత్రాలలో బాగా కనిపిస్తున్నాడు—



తనకి లభించిన పాత్ర ఎలాటిదయినా ... మాటలలో... విరుపులో మంచి కృషి చేసి ... జనాల మెప్పు అందుకుంటున్నాడు —

ఫర్వాలేదు... తెలుగు చిత్రాలలో మరో మంచి హాస్యనటుణ్ని చూస్తున్నాం... అనిపించేలా నటిస్తున్నాడు— అయితే... తొలిచిత్రం 'నాలుగు స్తంబాలాట' తర్వాత 'ఈ చదువులుమాకొద్దు' చిత్రంలో మాత్రమే అతనికి గుర్తింపుగల వేషం లభించింది! ఇలాంటి వేషాలు... పదిలో రెండు లభించినా వేలు కొన్నాళ్లు జనాలకి దగ్గరగా వుండి 'మంచి హాస్యనటుడిగా' వాళ్ళ ఆదరణ అందుకుంటాడు— ఎందుకంటే... వేలుకి వేలు యిస్తే వేలే కొరుకుతాడు! మండ మింగడు! అంటే... అతి లేదు!... ఆ 'అతి' లేనంత వరకూ—' నేను బడిపంతులు కుటుంబీకుణ్ని! మా కుటుంబాన్ని పోషించే శక్తి ఇస్తే అంతే చాలు!— అనే 'వినయం' వున్నంతవరకూ—వేషాలకి కొరత... ప్రజాదరణకు కరువు వుండవు!

ఏమయినా — తెలుగువాళ్ళకి ఒక మంచి హాస్యనటుణ్ని అందించిన శ్రీ జంధ్యాలకి ఓ థాంక్స్ చెప్పడం... కనీస ధర్మం!

— సుధ

### నరేష్ హీరోగా కృష్ణ సమర్పించే "ముక్కోపి"

''మా నరేష్ సరసన రాధ తొలిసారిగా హీరోయిన్‌గా నటిస్తోంది,'' అన్నారు విజయ నిర్మల. ఈమె స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎస్. రమానంద్ నిర్మించే శ్రీ విజయకృష్ణ మూవీస్ ''ముక్కోపి'' చిత్రానికి మార్చి 23న బి. నాగిరెడ్డి స్విచ్ ఆన్, బి. సురేష్‌రెడ్డి క్లాప్‌తో ప్రారంభం జరిగింది. సుధాకర్, సత్యనారాయణ, రావు గోపాలరావు, సాక్షి రంగారావు, వేలు, టెలిఫోన్ సత్యనారాయణ, రమాప్రభ, అన్నపూర్ణ, సుమంగళి ఇతర భూమికలు నిర్వహిస్తున్నారు. సత్యానంద్ సంభాషణలు, రమేష్ నాయుడు సంగీతం, పుష్పాల గోపాలకృష్ణ ఛాయ, ఆదుర్తి హరినాథ్ కూర్పుతో ఆర్. పద్మనాభన్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్, ఎస్. రఘునాథ్ సహ నిర్మాత. ''అల్లు రామలింగయ్య గెస్ట్‌గా కనిపిస్తారు ... ఏప్రిల్ 9 నుంచి 15, మే 17 నుంచి 22, జూన్ 11 నుంచి 19... జూలైలో పాచ్‌వర్క్ పూర్తిచేసి, ఆగస్ట్‌లో రిలీజ్ చేయాలనుకుంటున్నాం,'' అన్నారు నిర్వహణ బాధ్యతలు వహించే ఎస్. రవికుమార్.

సీరియల్

# కర్మయోగి

డా॥ కె.వి. కృష్ణకుమారి

(గత సంచిక తరువాయి)

**జరిగిన కథ — 9 :** కృష్ణారావుని పెళ్లి చేసుకొమ్మని తల్లి వేడుకొంటుంది. అత్తగారి కోరిక తీర్చమని కృష్ణకు చెపుతుంది లక్ష్మి. తల్లి ఆశను తీర్చాలా ! గృహస్థ ఆశ్రమం స్వీకరించాలా వద్దా ! అనే సందిగ్ధంలో పడతాడు కృష్ణారావు. శ్రీహరి బాబాయికూడా తులశమ్మగారి కోరిక న్యాయమైనదని, పెళ్లి చేసుకోమని బోధిస్తాడు. కృష్ణారావు తను తన అన్నగారి, వివేకానందుని, తండ్రిగారి అడుగుజాడల్లో నడుచుకోవాలనుకుంటునట్లు బాబాయి శ్రీహరిగారితో చెపుతాడు. సంసారం సాగిస్తూనే ఈ దీక్ష కొనసాగించవచ్చని నచ్చచెప్ప చూస్తారు శ్రీహరి బాబాయి. కృష్ణ గొప్పతనం ఆయన గుర్తించినా తులశమ్మగారి కోరిక తీర్చటం తన బాధ్యతగా తలచి కృష్ణను పెళ్లి చేసుకోమని కోరుతాడు. కృష్ణ తన లక్ష్యానికి సన్యాసమే మేలైనదని శ్రీహరి బాబాయితో చెపుతాడు. అందుకాయన సంసారం చేస్తూనే నిష్కామ బుద్ధితో మనసు నిశ్చలంగా ఉంచుకొంటే భగవంతునికి ఆత్మీయుడవ వచ్చని కృష్ణతో చెపుతారు. తులశమ్మగారు గత జీవితాన్ని శ్రీహరిగారితో చెప్పి హృదయ భారాన్ని తగ్గించు కొంటారు. కృష్ణారావు తల్లి ఆవేదనని చూసి చలిస్తాడు. తల్లి కోరిక ప్రకారం పెళ్లి చేసుకొనుటకు అంగీకరిస్తాడు కృష్ణ. కృష్ణ పెళ్లి పద్మినితో నిశ్చయమవుతుంది. కృష్ణారావు, పద్మినిల వివాహం జరిగిన కొద్దిగంటలకే పద్మిని తల్లి యశోదమ్మ మరణిస్తుంది. యశోదమ్మ కర్మకాండ అనంతరం పద్మినితో కూడ కృష్ణప్రియను తమ దగ్గరకే పంపమని రామచంద్ర రావుకి చెప్పి తులశమ్మ కృష్ణారావుతో కలిసి తమ ఊరు వెళ్లిపోతారు.

తల్లిపోయిన మూడోనెలన పద్మినినీ, కృష్ణప్రియనూ — వెంటబెట్టుకు వచ్చాడు రామచంద్రరావు.

"మీ అమ్మాయిల్ని తీసుకువచ్చాను. ఇంక మీ కప్పజెప్పేస్తే నిశ్చింతగా, వెళ్ళిపోతాను."

లక్ష్మి ఆపేక్షగా ఇద్దర్నీ లోపలకు తీసుకు వెళ్ళింది.

"అమ్మా — ఈ మూడునెల్లూ పిల్లల్ని కనిపెట్టుకున్నాను. పరిస్థితులు మీకు తెల్సు కదా... అందుకే మరీ విషమించకముందే— వాళ్ళ గూటికి వాళ్ళను జేర్చటం మంచిదనుకున్నాను—"

ఇంత ఉపోద్ఘాతం అనవసరమన్నట్టు చూశాడు కృష్ణారావు.

"మంచి పని చేశారు. మీరింక నిశ్చింతగా వుండచ్చు —"

కృష్ణారావు వైపున వకాల్తా పుచ్చుకున్నట్టు సంతృప్తిగా అంది తులశమ్మ.

"చూడమ్మా. పిల్లలద్దరికీ— వాళ్ళ నాన్న మిగిల్చిన ఆస్తి ఆ ఒక్క ఇల్లే— ఆ ఇంట్లో సగం వాటాని యశోదమ్మ అమ్మేసి అప్పులు తీర్చింది. మిగతా సగం వాటా పద్మిని పెళ్ళికి అమ్మబో తుంటే నేనే డబ్బు సర్ది ఇల్లు కొనుక్కున్నాను. అభిమానంగల యశోదకి అంతకుమించి సహాయం చెయ్యలేకపోయాను. ఐతే ఈ పరిస్థితుల్లో నేను మనస్ఫూర్తిగా ఆ ఇంటిని కృష్ణప్రియకు వ్రాసిస్తున్నాను. యశోద నా చెల్లెలైనా—ఇంతకు మించి నేనేమీ చెయ్యలేకపోతున్నాను ... చెయ్య గలిగుండీ కూడా —"

ఆయన కళ్ళనీళ్ళు పెట్టుకుంటుంటే — అభిమానంగా చూసింది తులశమ్మ.

"ఇప్పటి దాకా ఇన్ని విధాలుగా ఆదుకున్న— మీరెందుకలా బాధపడతారు ? మీ పరిస్థితుల్లో ఇంతకుమించి ఎవరుమటుకు ఏం చెయ్యగలుగుతారు ? పిల్లల విషయం మాకొదిలేయ్యండి —"

హాల్లో మాటలు స్పష్టంగా విన్పిస్తున్నాయి.

కృష్ణప్రియ పద్మిని వంక చూసింది.

పద్మిని కళ్ళల్లో బెరుకూ, మొహమాటం కన్పిస్తూనేవున్నా— ఎందుకో ఈ ఇంట్లో పద్మిని ఇమిడి పోగలదనిపిస్తోంది. అవును— ఇక నుంచీ అక్కయ్య ఇల్లు ఇదేగా మరి.

మరి తను ?

భవిష్యత్ తోచని తన గురించి ఆలోచించే వోపిక లేనట్టు అలసటగా కళ్ళు మూసుకుంది కృష్ణప్రియ.

*  *  *

ఇదివరకు ఇంట్లో పీఠం వేసుక్కూర్చున్న నిరాశా, నిర్లిప్తతా — ఇప్పుడు క్రమక్రమంగా దూరమవటం మొదలుపెట్టాయి.

దీపాల్లాంటి మరో ఇద్దరు రావటంతో వాళ్ళేపనీ చెయ్యకపోయినా ఇంటికి కళా, నిండుతనం వచ్చాయి. ఇంట్లో క్రొత్త కోడలు అడుగు పెట్టాక— పరిస్థితులవల్ల జరగవల్సిన ముచ్చట్లు యధావిధిగా జరిపించటం ఇష్టం లేకపోయినా — మనస్సులో వున్న కోరికను దాచటం కష్టమై పోతోంది తులశమ్మకి. ఇదివరకు దైవచింతనతో గడిచిపోయే కాలమంతా ఇప్పుడు పసివాడ్ని గురించిన ఆలోచన్లతో— కరిగిపోవటం మొదలు పెట్టింది. లక్ష్మి ద్వారా వంశం నిలిచే అదృష్టాన్ని భగవంతుడే దూరం చేశాడు. వాడి దయవల్లే జరగదనుకున్న కృష్ణారావు పెళ్ళి జరిగిపోయింది. లక్షణమైన కోడలు ఇంటికి వచ్చింది. వీళ్ళ కడుపు పండితే... ఆ ఆలోచనే— మనవడ్ని ఎత్తుకున్నంత మధురంగా వుంది తులశమ్మకి. తల్లిపోయిన దిగులులో వున్న పద్మినిని జరగబోయే అక్కరకి త్వరపడి వొప్పించటం అనుచిత మన్పించినా రోజులు గడిచిన కొద్దీ కృష్ణారావు మనసు మారచ్చేమోనన్న భయం తులశమ్మని మనశ్శాంతికి దూరం చేస్తోంది. ఐతే — కృష్ణారావు దినచర్యలో మార్పు అతని వైఖరిలో స్పష్టంగా కన్పిస్తున్న తేడా — ఆవిడకి కాస్త ఊరట కలిగిస్తోంది. ఇదివరకులా కృష్ణారావు రోజంతా కృష్ణ మందిరంలోనే పూజా జపాలతోనే కాలం గడపటంలేదు. అతను దినచర్యలో చాలా మార్పులు చేసుకున్నాడు. సూర్యోదయానికి ముందే లేచి కాలకృత్యాల తరువాత ఏకాంత ధ్యానంతో కొంతసేపు గడిపాక, మరికొద్దిసేపు మాత్రం కృష్ణ మందిరంలో గడుపుతున్నాడు. ఎంతోకాలం నుంచి బరువు బాధ్యతలు స్వీకరిస్తున్నవాడిలా — ఇంట్లో మంచీ చెడూ కనుక్కుంటుంటే— అందరితో బాటు తులశమ్మ కూడా ఆశ్చర్యాన్ని ఆనందంతో స్వీకరించేది. 'పద్మిని దేవతే— లేకపోతే తన కొడుకులో ఇంత మార్పు సాధ్యమౌతుందా ?''

అత్తగారి సందేహం అర్ధరహితంగా కన్పించేది లక్ష్మికి. తానెరుగున్న కృష్ణ వేరూ— ఈ కృష్ణ వేరుగా కన్పిస్తున్నాడు.

"లక్ష్మి..." అడగలేక తడబడే అత్తగార్ని చూసి అర్ధమైనట్టు నవ్వేది లక్ష్మి.

"లక్ష్మి—నువ్వేమంటావు ?"

"తప్పకుండా అక్కర చేద్దామత్తయ్యా.



ఐతే ఇంత త్వరలో జరిపితే పద్మిని ఏమనుకుంటుందో ఏమో — అదీగాక కృష్ణ ఇప్పుడిప్పుడే మనలో మనిషౌతున్నాడు. వెంటనే అతనికిష్టం లేని పని జరిగితే మొదటికే మోసం వస్తుందేమోనన్న భయం కూడా వుంది. అందుకనే ఇన్నాళ్లూ మీరు బాధపడటం చూస్తున్నా ఎటూ చెప్పలేకపోయాను.''

''అవుననుకో — కానీ నాకేమనిపిస్తోందో తెల్సా— పద్మినికి మనం ఎంత దగ్గరగా వున్నా ఎంత ఆపేక్షగా చూస్తున్నా— వాడు దగ్గర తీసినప్పుడే — వాళ్లిద్దరూ దగ్గరైనప్పుడే — దీనికి నిజమైన వోదార్పు లభిస్తుంది. ఇప్పుడున్న దిగులూ విచారం మెల్లిమెల్లిగా దూరమౌతుంది. అదీగాకుండా నాకు మంచి ఆశ కూడా వుంది. దాని కడుపున ఒక కాయ కాస్తే— కృష్ణ కూడా పూర్తిగా మారి తీరతాడు. దారిలోకి వస్తున్నప్పుడే—పిల్లా—పీచూ అన్న భావం ఏర్పడిందంటే —ఇంక వాడి దోవలోనే వుండిపోతాడు. నా భయమేమిటో తెల్సా ... దేముడు వరమిచ్చినట్టు వీడేదో ఈ మాత్రం మారాడా...— ఖర్మ చాలకపోతే ఏమో— వాడి మనసు ఎప్పుడెట్లా మారిపోతుందో...''

ఆవిడ భయానికీ ఆస్కారం వుంది. ఆవిడ సందేహాలూ తీసిపారేసేవి కావు. అనుభవంతో చెప్పే ఆవిడమనసును కష్టపెట్టటం ఎందుకు?

లక్ష్మి భరోసాతో కొండంత ధైర్యం వచ్చింది తులశమ్మకు.

''పెద్ద ఆర్భాటమేదీ చెయ్యటం మంచిది కాదనిపిస్తోందత్తయ్యా ఆఖరికి, ఆ ఇద్దరికీ కూడా ముందుగా చెప్పటం కూడా అంతమంచిది కాదేమో— ఎందుకంటే— పద్మిని అసలే విరక్తిగా వుంది. ముందుగా విషయం చెప్తామంటే— మొండిపట్టు పట్టుకుని కూర్చోవచ్చు. తిండే సరిగ్గా తినటంలేదు. ప్రియతో కూడా సరిగ్గా మాట్లాట్టం మానేసింది. ఆరోగ్యం కూడా అంతంత మాత్రంగానే వుంది. అందుకనే— వొప్పించటం కష్టమౌతుంది. కృష్ణకూడా చెప్పకుండా మన ప్రయత్నాలు మనం చేద్దాం. ఆ భగవంతుడే ఇద్దర్నీ కలుపుతాడు—''

ఆరిందాలా చెపుతున్న లక్ష్మిని చూసి కళ్ళనీళ్ళు పెట్టుకుంది తులశమ్మ.

''పిల్లా పాపల్తో కళకళలాడుతూ వుండాల్సింది. నమ్మినందుక్కు భగవంతుడెంత అన్యాయం చేశాడే తల్లీ— నువ్వు నోచని నోముందా— చెయ్యని పూజిందా ? ఏ ఒక్కటీ— నీ ఐదోతనాన్ని కాపాడలేకపోయాయే తల్లీ—''

అలవాటుగా మనసులోనే గొణుక్కుని చాటుగా కన్నీళ్ళు తుడుచుకుంది తులశమ్మ.

అత్తా కోడళ్ళిద్దరూ గుడికి వెళ్ళి— శాస్త్రిగారికి దక్షిణా తాంబూలం ఇచ్చి కార్యానికి ముహూర్తం పెట్టించుకు వచ్చారు.

ఆ రోజు ఇద్దరి మనసూ మనసులో లేదు. మనస్సాక్షికి వ్యతిరేకంగా— సాంప్రదాయానికి విరుద్ధంగా ఎటువంటి వేడుకా లేకుండా— పద్మినినీ— కృష్ణారావునూ— ఒకటి చెయ్యాలన్న భావం ములుకులా గుచ్చుకుంటున్నా— అన్నిటినీ మించిన కర్తవ్యం అర్థరహితం కాని ఆవేదనా— అడుగడుగునా ప్రోత్సాహమిస్తూ వుంటే— ఉత్సాహాన్ని— కొని తెచ్చుకున్నారిద్దరూ.

''కృష్ణా ! ఎక్కడికిరా వెడుతున్నావూ ?'' వెళ్ళబోతున్నవాడల్లా ఆగి విచిత్రంగా చూశాడు కృష్ణారావు.

''కాస్త త్వరగా వస్తావా కృష్ణా ...!''

''ఏమ్మా పనేమైనా వుందా ?''

తడబడుతూ లక్ష్మి వంక చూసింది తులశమ్మ.

''ఏం వదినా ?''

ఏదో చెప్పబోతో ఆగిపోయింది లక్ష్మి.

సరిక్రొత్త వ్యక్తిలా కన్పిస్తున్న కృష్ణారావు వంక క్షణం చూస్తూ వుండిపోయింది. తనెరిగిన మరిది ఇతన్లో కన్పించటంలేదు. ఆ కళ్ళల్లో అమాయకత్వం, ఆ మనసులో అపరిపక్వత తెచ్చిన సంధిగ్ధత — మొహంలో ప్రస్ఫుటించే తడబాటు, సంఘర్షణతో అస్థిమితంగా వున్న వదనం, ఆ లేతదనం, మచ్చుకక్కూడా కన్పించటం లేదు. పైగా ఎప్పుడూ చూడని కళలెన్నో కలగాపులగంగా ప్రస్ఫుటంగా కన్పిస్తున్నాయి. ఆ కళ్ళలో ప్రశాంతత — ఆ పెదాలమీద సరిక్రొత్త చిరునవ్వు — ఆ వదనంలో ఎప్పుడూ లేని

# కర్మ యోగి

నిశ్చలత్వం. ఆ కృతిలో నిండైన గంభీరతా — విచిత్రంగా చూసిన లక్ష్మి కళ్ళు దించుకుంది.

"వదినా మాటడవేం ... రాక తప్పదా ?"

"అత్తయ్యగారు అదేగా అంటున్నారు ... త్వరగా రాక బైట నువ్వు చేసే పన్లు అంత అవసరమైనవికావుగా —"

ఎంతో చనువుగ — చెప్పి మందలించగల చనువున్న వదిన కొత్తదాన్లా తడబడుతూ — సందేహంగా చెపుతుంటే — కృష్ణారావూ సందేహంగా చూశాడు.

కృష్ణారావు ఏర్పరచుకున్న దైనందిక చర్యలలో — సాయంత్రాలు అతి ముఖ్య సాధనకు కేటాయింపబడి వున్నాయి.

వీరరాఘవయ్యగారు కట్టించిన అతి విశాలమైన లైబ్రరీలో ఒక విశాలమైన గదిలో తన కార్యసాధన మొదలుపెట్టాడు. ఆశయం గొప్పదిగా వుండి — అకుంఠిత దీక్షా, అచంచల ఆత్మవిశ్వాసం తోడుగా వీడని నీడలా తనలో ఐక్యత చెందినప్పుడు ఆ వ్యక్తి సాధించలేని అంశమే వుండదు. అది కేవలం లోకోపకారం కోసమే వినియోగింపబడినప్పుడు, అంతకుమించిన సాఫల్యం కూడా వుండదు. సాయంత్రాలు గీతా చర్చకే వినియోగించ దల్చుకున్నాడు. అన్నగారి కోరిక తీర్చటం కోసం — అంతర్గతమైన తన తపనకూ సార్థకత చేకూర్చటం కోసం ఆ మాత్రం కాలాన్ని వినియోగించటం అత్యవసర మనుకున్నాడు.

ముందుగా చర్చలతో, తర్కాలతో గోష్ఠులతో, మొదలైన అంశం పోను పోను తీవ్రతరమై అందర్నీ క్షణాలమీద ఆకర్షించటం మొదలుపెట్టింది. కృష్ణారావులో స్వతసిద్ధమైన తేజస్సు, దైవాంశ, సత్సంకల్పదీక్షా, మృదు మధుర వాక్చాతుర్య పటిమా, దైవ ప్రేరణా — ఎందరినో తనవైపుకు ఆకర్షితుల్ని చేసుకుంది.

ఎన్ని పన్లున్నా మానుకుని కృష్ణారావుతో గోష్ఠిలో పాల్గోటానికి కదలని సమయాన్ని తిట్టుకునేవారూ — కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూసేవారూ — సంఖ్యలో పెరిగిపోవటం మొదలుపెట్టారు. బాధలులేని జీవి వుండదు. ఆవేదనతో కృంగని అంతరంగం వుండదు. ఆత్మ విశ్వాసాన్ని కోల్పోయే తరుణం వుండకుండా వుండదు. ఐతే — ఆ సమయాల్లో ఓదార్పును అందించి సక్రమమైన పంథాలో — మనిషిని నడిపించి — పోయిన ఆత్మ విశ్వాసాన్ని అందించి— జీవితానికి సరైన గమ్యాన్ని బోధించి—ఆధ్యాత్మికత ద్వారా, చరితార్థకతను ఆపాదించి — పతనమయే స్థాయినుంచి — అలౌకికమైన ఆనంద ప్రగతి వైపుకు ఇతరులను మళ్ళించి పుణ్యం కట్టుకోగల వాళ్ళు అరుదుగా వుంటారు. అందరి కష్టాల్లో పాలు పంచుకుంటూ, చేతనైనంతగా కన్నీరు తుడిచి, వాళ్ళకోసం తనున్నాననే భావన కలిగించి ఆ విధంగా ఆత్మ వికాసాన్ని పెంచి, ఆలోచించు కునే స్థోమతను కలిగించి, ఆత్మ పరిశీలన చేసు కునే స్థితిని కల్పించి - దృష్టిని దైవంవైపుకు మళ్ళించి — క్రమశిక్షణతో జీవితాలను మలచి— సుఖదుఃఖాలను అశాస్వతమైనవిగా — ఇహం బుద్బుదప్రాయమనే భావనలో — కాలం విలువను గుర్తింపజేసి — మానవత్వపు విలువలను చాటి చెప్పగల వ్యక్తులు అరుదుగా వుంటారు. అతీతమైన భావనలుగల కృష్ణారావు త్వరలోనే ఎంతో మందికి ఆత్మీయుడయాడు. బాధల్లో ఆప్త బంధువయాడు, నిత్య జీవితంలో ఆదర్శప్రాయుడయాడు. భావనల్లో దైవాంశ సంభూతుడయాడు. అందుకే — వయసును మరచి అన్ని తరగతులవారూ దగ్గరయారు. సాయంత్రం మొదలయే గోష్ఠులు — ఏరోజు కారోజే అర్ధరాత్రిని సమీపించటంకూడా జరగటం అసాధారణంకాదు.

అందుకే త్వరగా రమ్మని అమ్మా, వదినా పట్టుపడుతున్నారేమో ... అది ఇవాళకే పరిమితమా ???

ఏమో !!!

ఆత్రంగా తనవంక చూస్తున్న వాళ్ళని నిరుత్సాహపర్చలేకపోయాడు.

"వస్తానమ్మా —"

ఆ మాత్రానికే సంబరపడిపోతూ - కనుమరుగౌతున్న కొడుకునే చూస్తూ నిలబడి పోయింది తులశమ్మ.

"అంటే ! వస్తానా ?— అతని మాటకు అర్థం !!!"

## స్వయంకృతం

ఓ మనిషీ,
నీ స్వార్థం ముందు
సాగరమెంతో చిన్నది
అంతులేని నీ ఆశలు
ఆకాశం కన్న పెద్దవి -
స్థిరంగా నేలలో పాతుకున్న చెట్టుకు,
ఠీవిగా నింగిని తాకుతూ నుంచొన్న
కొండకు
లేదు నీ అహంభావం —
నీవు —
పువ్వుని చిదిమి
ముల్లుని ముద్దాడుతావు
అమృతాన్నికాదని
హాలాహలాన్ని అందుకుంటావు —
అందుకే —
నీవు వసించే ఈ లోకం
నిజంగా నరకం !

— వలి

అర్థాలు వెతుకుతూ వుండిపోయింది లక్ష్మి.

* * *

కృష్ణారావు లైబ్రరీకి వచ్చేసరికే— జనం హాలునిండుగా వున్నారు. అంతవరకూ పుస్తక పఠనంలో నిమగ్నమైవున్న వాళ్ళుకూడా — కృష్ణారావు రావటంతోనే పుస్తకాలు మూసి హాలు వైపుకు నడిచారు. ఐదు గంటలు కొడుతున్న గడియారం వంక అలవాటు పడినట్టు చూశారందరూ. అలవాటు చేసుకుంటున్నవాళ్ళు ఆలశ్యానికి సిగ్గుపడుతూ లోపలికి వస్తున్నారు. ఈ రకమైన క్రమశిక్షణలో విజయాన్ని సాధించ గలిగిన కృష్ణారావు ఎప్పటిలా మధురంగా నవ్వుకున్నాడు.

"కృష్ణా ! ఏమిటి నీలో నువ్వే నవ్వుకుంటున్నావు ? మాతోనూ చెప్పచ్చుగా —"

తన బాల్యస్నేహితుడు కేశవవైపు వాత్సల్యంతో చూశాడు కృష్ణారావు.

"ఏమీలేదు— వృధాగా గడిపే సమయాలను సద్వినియోగం చేస్తున్న భగవంతుని లీలలు తల్చుకుంటే ఆనందంగా వుంది."

"ఇదీ భగవంతుడి లీలేనంటావా ? నీ సంకల్పసిద్ధి అనుకోకూడదా ? నువ్వు ప్రయత్నించావు. ఇందర్ని ఒక్కచోట కూడకట్టు కోగలుగుతున్నావు. అది కేవలం నీ వ్యక్తిత్వానికీ స్వయంకృషికే నిదర్శనమని నేనంటాను."

కేశవనుంచి దృష్టి మరల్చుకున్నాడు కృష్ణారావు.

"పొరపడుతున్నావు కేశవా ! నేనేమిటి ఇంతమందిని ఒక్కచోటుకి చేర్చగలగటమేమిటి ? నన్ను నేనే అనుసరించుకోలేనివాడిని — నా వ్యక్తిత్వాన్ని నేనే మలచుకోటానికి అసమర్థుడిని— నా గమ్యం నాకే తెలియక — మనశ్శాంతికి దూరమైనవాడిని — అల్పుడ్ని — నాకా ఇంత శక్తివుంది. ఎంత పొరపాటుగా అన్నావు. నాక సంకల్పం ఎలా కలిగిందో — ఎవరివల్ల కలిగిందో మీకు తెలియదా! నా వ్యక్తిత్వంలో అజ్ఞాతమైన శక్తి ఎవరు ? నా స్వయం కృషిలో వెనుకనున్న మూర్తి ఎవరు ? నా ఈ సత్కార్యానికి ప్రేరేపించినది ఎవరు ? ప్రేరణ ఎవరిది ? చివరికి మిమ్మల్ని ఇక్కడకు రాబట్టుకుంటున్న మహాశక్తి ఎవరిదనుకుంటున్నావు ?

కేవలం నా సంకల్పం వల్ల ప్రయోజనాన్ని సాధించగలనా ? కేవలం వాక్కోసమే మీరు ఏళ్ల తరబడి అలవాటు పడిపోయిన పన్లు కూడా వదిలేసి రాగలుగుతున్నారా ? అసలు రాగలరా మీరు ? "

"నిజమే కావచ్చు—కానీ ఎంత అసాధ్యమైన కార్యాన్నైనా పట్టుదలతో, దీక్షతో సాధించ వచ్చును. అది కేవలం మానవ ప్రయత్నం కాదా. అటువంటి మానవాతీతులు ఎంతమంది లేరు ?"

"రంగడి ప్రశ్నలోనే సమాధానం వుంది. కానీ తగిన సమాధానం అందుకోటానికి తగిన కృషేలేదు. మానవులు సంకల్పించిన ప్రతీ పనిని




దర్శకత్వం: ఎ.కోదండరామిరెడ్డి నిర్మాత: వి.కనకరాజు లక్ష్మీఫిలింస్



ఉగాదినాడు నెల్లూరు 'కళాప్రియ' ఆధ్వర్యంలో జరిగిన 'అష్టావధానం' కార్యక్రమంలో అవధాని డా. సి.వి. సుబ్బన్నగారిని నెల్లూరు సబ్ జడ్జి శ్రీ నారాయణరెడ్డిగారు సన్మానిస్తున్న దృశ్యం.

# కర్మయోగి

సాధించలేకపోవచ్చు. కానీ సత్కర్మలు చెయ్యాలనే తపన సామాన్య మానవుని ఔన్నత్యానికి గీటురాయిలా భగవంతుని సహాయం కోరుతుంది. దయామయుడైన భగవంతుని అండా, సహాయం, అనుగ్రహం అపారంగా అందుకోగల మానవుడు అతీతుడుగా మానవాతీతుడుగా కన్పిస్తాడు. ఆ దైవ కృప వున్నంతవరకే — లేని క్షణం అతి సామాన్యుడైపోతాడు. విషయ వాంఛల వలయంలో చిత్రహింసలకు లోనౌతాడు. ఎంత ప్రయత్నించినా పూర్వపరిస్థితిని అందుకోలేకపోతాడు. మన కృషికీ మన సంకల్పానికీ తోడు దైవ కృప కూడా అండ వుండాలి. అప్పుడే అనుకున్నది సాధించి తీరగలం.''

దృఢవిశ్వాసంతో అంటూ చుట్టూ పరికించాడు కృష్ణారావు. ఎదురుగా వయోవృద్ధులు వున్నారు. వాళ్ళ నవ్వులో సంతృప్తి వెలుగుతోంది. మధ్యవయస్కులూ వున్నారు, వాళ్లలో జిజ్ఞాస కన్పిస్తోంది. యవ్వనపు పొంగులో కొందరిలో తొందరపాటుతనం—చాలామంది పసివాళ్లలో అమాయకత్వం అర్థం చేసుకోలేని లేతదనం కన్పిస్తున్నాయి.

"విషయం వచ్చింది కనుక చెపుతున్నాను. మహాభారతంలో అర్జునుడి పాత్ర మీకు తెల్సు కదూ''

ఈ ప్రశ్న ఎవరికోసం ఉద్దేశించబడిందో తెల్సుకున్న వయసు నుంచి ఉత్సాహం సమాధానం చెప్పింది.

తెల్సుకదూ. అర్జునుడు మహావీరుడు. నరనారాయణులలో వీరుడుగా ప్రసిద్ధికెక్కినవాడు దైవాంశసంభూతుడు. అంతేకాదు. నారాయణుడి ప్రతిరూపు. బహిఃప్రాణం. అస్త్ర విద్యలో తిరుగులేని మహా విలుకాడు. పాండవుల్లో ఎన్నదగ్గ మహనీయుడు. అందరినీ మించిన అదృష్టాన్ని స్వంతం చేసుకున్న పుణ్యమూర్తి. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీకృష్ణ భగవానుని బావగా, చెలికాడుగా, ఆత్మబంధువుగా ఆప్తమిత్రుడుగా— తన సర్వంగా భావించి క్షణం కూడా విడిచి వుండలేని మహోన్నతుడూ. శ్రీకృష్ణుని అండన ఎన్నో అతీత శక్తుల్ని దివ్యాస్త్రాలనీ అవలీలగా సంపాదించగలిగిన ప్రజ్ఞాశాలి. కురుక్షేత్ర రంగంలో సాక్షాత్తూ అపర బ్రహ్మనే సారథిగా చేసుకుని సమరోత్సాహంతో కదంత్రొక్కిన మహా మేధావి. మహా ఋషులకూ జ్ఞానులకూ— అవతారమూర్తులకూ కూడా అసంభవమైన శ్రీకృష్ణ పరబ్రహ్మ విశ్వరూప సందర్శనం దివ్య చక్షువులతో చూసి ధన్యత చెందిన మనవాతీతుడు. ఆ భగవానుని ద్వారా స్వయంగా గీతామృతాన్ని గ్రోలిన శిరో ధార్యుడు. కురుక్షేత్ర రణరంగంలో— వీర సింహమై శత్రుసేనల్ని చీల్చి చెండాడి— మహా వీరుడుగా— వినుతికెక్కిన యోధానుయోధుడు. అక్షయ తుణీరాలతో— శక్తివంతమైన గాండీవంతో— శ్రీకృష్ణుని అపార అనురాగంతో మహా భారతంలో మహోన్నత స్థానాన్ని స్వంతం చేసుకున్న అంత మహావీరుడూ— శ్రీకృష్ణ నిర్యాణానంతరం ఏమైపోయాడు ? మనసారథి— మన సచివుడు— మన నేస్తమూ— మనకు లేడనుకుని కృంగిపోయాడే గానీ, ఆత్మబంధువును కోల్పోయి కన్నీరు మున్నీరుగా విలపించాడేగానీ, కేవలం దుఃఖభారం చేతే— తను శక్తివిహీనుడ నయానని నమ్మాడేగానీ—తాను జీవచ్ఛవాన్నని— ఎంత ఆలస్యంగా తెలుసుకోగలిగాడు? శ్రీకృష్ణునీ స్త్రీజనాన్నీ— యాదవుల్నీ సురక్షిత స్థలానికి జేర్చే ప్రయత్నంలో— శ్రీకృష్ణుని నిర్యాణానికి కృంగిపోయిన కిరీటి, ఆ భగవానుని ఆదేశాన్ని ఎందుకు అమలుజరపలేక పోయాడు ? అంతటి మహావీరుడుగా బీభత్సుడుగా వినుతికెక్కిన యోధానుయోధుడు అతి సామాన్యులైన దుర్మార్గులు శ్రీకృష్ణుని స్త్రీజనాన్ని ఆక్రమించి నానా హింసలు పెడుతుంటే— మిగిలిన యాదవుల్ని చెండాడుతుంటే—ఎందుకునిర్వీర్యుడై నిలబడిపోయాడు?—ఎన్నో అక్షౌహిణీ సైన్యాలను త్రుటిలో కూల్చగల శక్తివున్న అక్షయ తుణీరం కూడా ఆ క్షణంలో శక్తిహీనమైపోయిందెందుకు ? అంత యోధుడూ సామాన్యుడిలా— కిరాతకుల్ని ఎదుర్కోటానికి కేవలం బాహుబలాన్నే ప్రదర్శించాల్సివచ్చిందే -- గాండీవాన్ని శక్తివిహీనమైన కర్రగా మాత్రం ఉపయోగించాల్సిన గతి పట్టిందే — అప్పటికీ — అందర్నీ ఆదుకోలేని నిస్సహాయుడిగా— కన్నీరు మున్నీరుగా విలపించాడే — ఈ హృదయవిదారక సంఘటనకి కారణం స్ఫురించిందా ? — అంతదాకా తనకి దైవం అండగా వున్నాడు. దైవబలం చేయూత నిచ్చి నడిపించింది. మహావీరుడ్ని చేసింది. చరిత్రలోనే ప్రసిద్ధిని ఆపాదింపజేసింది. నారాయణుడు లేక నరుడు లేడనీ— భగవత్కృప లేనిదే మానవ ప్రయత్నం విఫలమనీ—జీవాన్నింపే దైవం దూరమైన క్షణంనుంచే తను జీవచ్ఛవం అయిపోయాననీ తెల్సుకున్న అర్జునుడు నిస్సారంగా నిర్వికారంగా మిగిలిపోయాడు. అంతవరకూ అజేయుడ్నని నమ్మిన పార్థుడు నిస్తేజుడైన నిదర్శనాన్ని మించి మరే నిదర్శనం వుంటుంది?''

మరో ఎదురుప్రశ్న లేకపోటంతో మౌనంగా వుండిపోయాడు కృష్ణారావు.

"అలా అనుకుని నిర్వికారంగా వుండకుండా ఇంకా ప్రయత్నిస్తే — విజయం సాధించేవాడేమో !''

ఎవరో చిన్నగా అన్నారు.

''ప్రయత్నించే విఫలుడై నిర్వికారంగా మిగిలిపోయాడు. విజయుడైన అర్జునుడూ సామాన్యుడా ! తన ప్రయత్నాలు తను చేసే, దైవబలం దూరమైన కారణంగా నిస్సహాయుడైపోయాడు. మహాయోధుడైన పార్థుడు సామాన్యుడిలా మిగిలిపోయాడంటే దానికి ప్రబల కారణం వుండకపోతుందా !''

(ఇంకా ఉంది)

కె.సి.ఎస్.చంద్రశేఖర్
సమర్పించు

వినయ్ మూవీస్

# ముఖ్యమంత్రి

PADMALAYA PUBS

Bhaskar

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
**విజయనిర్మల**

నిర్మాత
**టి.శ్రీనివాసరెడ్డి**

సహనిర్మాత
**శాఖమూరి సాంబశివరావు**

నిర్వహణ: కె.బి.ప్రసాదరెడ్డి, కె.వెంకటేశ్వర్






ఆరోజు మధ్యాహ్నం పోస్టులో తెనాలి వాళ్ళ దగ్గర్నించి ఆ ఉత్తరం వచ్చిన దగ్గరినించీ జానకి మనసంతా అదోలా అయిపోయింది. భోజనం చెయ్యాలనిపించలేదు. అందుకే తలనొప్పిగా వుందని తల్లి పిలిచినా వెళ్లలేదు. తండ్రికూడా వచ్చి బాదంచెట్టు కింద మంచం వాల్చుకుని పడుకున్న జానకిని భోజనానికి రమ్మని ఎంతగానో పిల్చాడు. అయినా జానకి వెళ్ళలేదు. తలనొప్పి తగ్గిన తర్వాత భోజనం చేస్తానని అన్నది. ఆ తర్వాత జానకి బామ్మకూడా వచ్చి, "ఈ వయసులో తలనొప్పి ఏమిటే తల్లీ... భోజనంచేస్తే అది తగ్గిపోతుందిలే" అన్నది.

అయినా జానకి వెళ్ళలేదు. భోజనం చెయ్యలేదు.

జానక్కి నిజంగా తలనొప్పిలేదనీ, ఆఉత్తరం చదివిన తర్వాత ఆమె మనసు వికలమయి పోయిందనీ ఒకవిధమైన నిరాశకు, నిస్పృహకు ఆమె లోనయిపోయిందనీ ఆమె తల్లికీ తండ్రికీ తెలుసు. అయినా వాళ్లుమాత్రం ఏం చెయ్యగలరు ?

పదిరోజుల క్రితం తెనాలినుంచి ఎవరో వచ్చి పెళ్ళీడువచ్చి నాలుగేళ్ళు దాటిపోయిన జానకిని పెళ్ళిచూపులు చూసివెళ్ళారు. వెళుతూ ఇంటికి వెళ్ళిన తర్వాత ఏ విషయమూ ఉత్తరం ద్వారా తెలియజేస్తామని అన్నారు. వాళ్ళు వెళ్ళిన దగ్గర్నించీ వాళ్ళనించి వచ్చే ఉత్తరం కోసం రోజూ ఎదురుచూస్తూనే ఉన్నారు.

చివరికి ఆరోజు మధ్యాహ్నం పోస్టులో వాళ్ళదగ్గర్నించి ఉత్తరం వచ్చింది. అమ్మాయి కొంచెం నల్లగా వున్నదనీ అందువల్ల తమకు నచ్చలేదనీ మరో సంబంధం చూసుకొమ్మని రాశారు.

ఇలాగే ఇంతకుముందు కొంతమంది పెళ్ళి చూపులు చూసి ఇళ్ళకువెళ్ళి అమ్మాయి నల్లగా వుందని తమకు నచ్చలేదని రాశారు.

నల్లగా వుండటం తనుచేసిన నేరమా ?

నిజానికి జానకి అంత నల్లగా వుండదు. చామనఛాయలో వుంటుంది. ఆడపిల్ల కావడం వల్ల చూపరులకు నల్లగా వున్నట్టు అనిపిస్తుంది. రంగు తక్కువయినా జానకి మొహం అందంగా వుంటుంది...మంచి కళవున్న మనిషి...అవయవ సౌష్టవం కూడా బావుంటుంది. ఐనా చాలా మందికి జానకి నచ్చటంలేదు.

ఆశ్చర్యకరమయిన విషయ మేమిటంటే జానకి నల్లగా వున్నదనీ నచ్చలేదని అనిన పెళ్ళి కొడుకులందరూ జానక్కంటే ఎంతో నల్లగా ఉన్నవాళ్ళే.

ఇదెక్కడి న్యాయం ? అనుకున్నది జానకి.

అవును...అదే న్యాయమన్నది తల్లి.. నిజమే నట. కోడలు నలుపైతే కులమంతా నలుపేనని అంతా అనుకుంటారుట. అందుకే జానకి తల్లిని చేసుకోటానికి మొదట్లో జానకి బామ్మ ఒప్పుకోలేదుట. చివరికి తల్లిని ఎదిరించి పెళ్ళి చేసుకున్నాడుట ఆమె తండ్రి.

జానక్కి తల్లిపోలికే వచ్చిందని అంతా అంటారు. ఎవరేమన్నా ఆ పోలికే ఇప్పుడు జానకి పెళ్ళికి పెద్ద అవరోధమయ్యింది.

"భగవంతుడా...నాకు ఇంకొంచెం మెరుగు

ఎక్కువగా పెడితే ఏంపోయేది'' అనుకున్నది జానకి.

ఆ రోజు మధ్యాహ్నం పోస్టులోనే జానకి దగ్గరి బంధువుల దగ్గర్నించి ఓ పెళ్లి శుభలేఖ వచ్చింది. వాళ్ల రెండో అమ్మాయి వసుంధర పెళ్లి... ఆ అమ్మాయి జానకి కంటే మూడేళ్లు చిన్నది. అయినా ఆ అమ్మాయి బంగారు రంగులో వుంటుంది. కాని జానకి కంటే అందమైనది కాదు. అయినా శరీరం రంగు చూసి ఏ పెళ్లికొడుకో వసుంధర అంటే మోజుపడి వుంటాడు. తనకంటే మూడేళ్లు చిన్నదయిన వసుంధరకు మరో వారం రోజుల్లో పెళ్లి జరుగుతోంది.

కాని ఆ శుభలేఖతో పాటుగానే తను నచ్చలేదని తెనాలివాళ్ల దగ్గర్నించి ఉత్తరం.

రెండూ ఒకేసారి రావటంతో జానకి మనసు కలవరపడిపోయింది.

ఇక తను ఎవరికి నచ్చుతుంది? అసలు తన పెళ్లి అవుతుందా ఈ జన్మకు? తన తర్వాత మరో అమ్మాయి పెళ్లికి ఎదుగుతున్నది. తన పెళ్లే అవకపోతే ఇక దాని పెళ్లి ఎప్పుడు అవుతుంది?

తల్లి – తండ్రి తనకు పెళ్లి కుదరలేదని ఎంతగా బాధపడుతున్నారో జానక్కి తెలుసు. పదిహేను వేల వరకు కట్నం ఇవ్వగలిగిన స్థితిలో వుండికూడా తన పెళ్లి కాలేదంటే ఇక తను పెళ్లి గురించిన ఆశ వదులుకోవచ్చును.

తల్లి భోజనం చెయ్యబోతూ వచ్చి జానకిని భోజనానికి రమ్మన్నది.

''నాకు తలనొప్పి తగ్గలేదు... నువ్వు తినెయ్యి'' అన్నది జానకి.

''నీ బాధ నాకు తెలుసే జానకీ! ఎవరిష్టం వాళ్లది... మనం బాధపడతామని వాళ్లు అలా రాయకుండా వుంటారా? తెనాలివాళ్ళు కాకపోతే మరో ఏలూరువాళ్ళు...ఎవరో ఒకరు చేసుకోక పోతారా? నాపెళ్ళి కాలేదూ? నేను నీకంటే ఎర్రగా వున్నానా? లే...వచ్చి రెండు ముద్దలు తిను'' అన్నది.

అయినా జానకి భోజనానికి వెళ్ళలేదు.

* * *

సాయంత్రం ఆరుగంటలు కావస్తోన్నది.

జానకి వరండాలో కుర్చీలో కూర్చుని ఏదో నవల చదువుకుంటున్నది. ఆమె తల్లిదండ్రులు ఎవరో తెలిసినవాళ్ళింటికి వెళ్లారు. జానకి బామ్మ పురాణం వినటానికి గుళ్ళోకి వెళ్ళింది...జానకి చెల్లెలు స్కూలు పిల్లలతో కలిసి ఏదో విహార యాత్రకు వెళ్ళింది.

వీధిగేటు తెరచిన చప్పుడు వినిపించి తలెత్తి చూసింది జానకి.

చెక్కకాలును టకటక లాడించుకుంటూ చిన్నగా లోపలకు వచ్చాడు ఓ పాతికేళ్ళ యువకుడు, అతని చేతిలో చిన్నడబ్బా వున్నది.

అతిడికేసి ఆశ్చర్యంగా చూసింది జానకి. అతన్ని రెండునెలల నించీ ఎదురింటి ముందు గదిలో చూస్తూనే వున్నది. కాని అతనుఎప్పుడూ తమ ఇంటికి రాలేదు.

అతను అందంగా వున్నాడు. కాని దురదృష్టం... అతనికి ఎడమకాలు మోకాలు వరకూ లేదు. చెక్కకాలు వున్నది.

''నాపేరు ఈశ్వర్... ఎదురుగా వున్న గదిలో వుంటున్నాను'' అన్నాడు అతను.

''కూర్చోండి'' అన్నది జానకి తను లేచి నిల్చుని...

''ఫర్వాలేదు... కొంచెం పనుండి వచ్చాను. కిరోసిన్ అయిపోయింది ... షాపులో కూడా లేదుట. నేను సెల్ఫ్‌కుకింగ్ చేసుకుంటాను. మీరు ఈ డబ్బాలో కిరోసిన్ పోసి ఇచ్చారంటే మళ్లీ రేపు తిరిగి ఇచ్చేస్తాను'' అన్నాడు.

''అలాగే కూర్చోండి'' అని అతని చేతిలో నించి డబ్బా తీసుకుని లోపలకు వెళ్లి కిరోసిన్ పోసుకుని వచ్చింది.

ఇంకా అతను నిలబడి వుండటం చూసి ''ఫర్వాలేదు. కూర్చోండి'' అన్నది చిన్నగా నవ్వి.

అతను కూర్చున్న తర్వాత ''మీరేం చేస్తున్నారు?'' అనడిగింది.

''ఇక్కడే తాలూకా ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నాను. ఆరునెల్ల క్రితం ఉద్యోగం వచ్చింది'' అన్నాడు.

''మీకెవ్వరూ లేరా?''

''ఒకే ఒక్క మేనత్త వున్నది. ఆమెకు అరవైయేళ్లపైనే వుంటాయి. ఆమె ఆ పల్లెటూరు వదిలి బయటకు రాదు. ఆమెకు ఈ పట్టణాల్లో వుండే ఇరుకు గదులు – ఈ వాతావరణ మంటే అసలు పడదు.'' అంటూ నవ్వాడు.

''మరి మీరు వంట చేసుకోవటం కష్టం కదూ.''

''తప్పదు. ఈ బాధ్యతలన్నింటినీ తన మీద వేసుకునే మనిషి వచ్చేవరకూ తప్పదు మరి.''

''అయితే ఇక ఆలస్యందేనికి? ఉద్యోగం కూడా వున్నదికదా! పెళ్లి ప్రయత్నాలు మొదలుపెట్టలేదా?''



''చూశారుగా. నేను అందరిలాంటి వాడిని కాదు. నా దురదృష్టం. ఏడాదిక్రితం ఓ కారు యాక్సిడెంటులో నా కాలు సగంవరకు పోయింది. ఇలా అంగవికలుడిని అయ్యాను. నన్ను సానుభూతితోఅర్థం చేసుకుని నేనంటే ఇష్టపడే మనిషినే నేను నా జీవితంలోకి ఆహ్వానించ దల్చుకున్నాను.''

''మిమ్మల్ని సానుభూతితో అర్థం చేసుకోని వాళ్లు ఎవరుంటారు?''

''అలా అనకండి... అవిటివాడని పరిహాసం చేసేవాళ్లే నాకు ఎక్కువ మంది కనిపించారు'' అన్నాడు ఈశ్వర్.

''అలాంటి వాళ్లు నా దృష్టిలో మనుషులు కాదు. అవిటితనం మీరు చేసిన నేరమా? ఇందుకు మీరెలా బాధ్యులవుతారు?'' అన్నది జానకి.

''థాంక్స్ మీ అభిప్రాయానికి. ఏమయినా ఒక కాలులేని అవిటివాడిని చేసుకోటానికి ఏ ఆడపిల్ల ముందుకు వస్తుంది?''

''అలా అనకండి. ఎవరయినా మిమ్మల్ని చేసుకోటానికి ఇష్టపడతారు.''

''అలాగంటారా? అయితే ఎవరో దాకా ఎందుకు మీరు ఇష్టపడతారా నన్ను చేసుకోటానికి?'' అన్నాడు ఈశ్వర్ వెంటనే ...

అతనలా అంటాడని వూహించని జానకి వెంటనే ఏమీ మాట్లాడలేకపోయింది అతను ఒక్కసారి ఆమెకేసి చూసి ''నెమ్మదిగా ఆలోచించండి... వస్తాను'' అని కిరోసిన్ డబ్బా తీసుకుని అక్కడినించి వెళ్లిపోయాడు

ఈశ్వర్ వెళ్లిన చాలాసేపటి వరకు జానకి అతని గురించి, అతను చివరగా అన్న మాటల గురించి ఆలోచిస్తూ వుండిపోయింది.

ఆ రాత్రి కూడా ఆమె నిద్రపోలేదు. ఈశ్వర్ గురించి ఆలోచనలతోనే గడిపింది.

* * *

పది రోజుల తర్వాత ఒకరోజు గుళ్లో పెళ్లి చేసుకుని ఈశ్వర్‌తో కలసి ఇంటికి వచ్చిన జానకిని చూసి ఇంట్లో వాళ్లంతా ఆశ్చర్యపోయారు. వాళ్లకు నోట మాట రాలేదు.

''నాన్నా... నన్ను క్షమించండి... స్వతంత్రించి ఈ నిర్ణయం తీసుకున్నాను. ముందుగా మీతో చెబితే మీరు ఒప్పుకోరని ఇలా చేశాను. మా ఇద్దరి భావాలు ఒక్కటే – ఒకరినొకరం అర్థం చేసుకున్నాము. ఒకటి కావాలని అనుకున్నాము. ఒకటయ్యాము. మీ మనసులను నొప్పించినందుకు మమ్మల్ని క్షమించి మనస్ఫూర్తిగా ఆశీర్వదించండి'' అంటూ పాదాలమీద వాలిపోయిన జానకిని ఏమనాలో తెలీక వాళ్లలా చూస్తూనే వుండి పోయారు.



# మట్టి పరిశ్రమ

## పింగాణీ వస్తువులను తయారుచేయుట

శ్రీ కాశీనాథుని సాంబశివరావు, బి. ఎస్. సి.

విజ్ఞానం ఆధారం చేసుకొని పరిశ్రమలు సాగించినట్లయిన దారిద్ర్య పిశాచమంతరించి సర్వజనకల్యాణ మేర్పడగలదు. పరిశ్రమలు రెండు రకములు [1] భూ జనితమైన వస్తువులచే సాగించునవి [2] వృక్షజంతు సంబంధమైన వస్తువులచే సాగించునవి. బంగారము, వెండి, రాగి, ఇనుము, మట్టి మొదలయిన వానితో నడుపు పరిశ్రమలు మొదటి తరగతివి. నూనె, సువాసన ద్రవ్యములు, సబ్బులు, వార్నీసు, దుంప నెయ్యి మొదలగువాటి పరిశ్రమ రెండవది.

భూమిలో నూటికి 60 పాళ్లు మట్టి కప్పులు, సాసర్లు, చలవరాళ్లు, జాడీలు, పెంకులు, సిమెంటు మొదలైనవన్నియు మట్టి పరిశ్రమ ఫలితములే. ఇనుప తూములకంటె మట్టితో చేసిన తూములు [హ్యూమ్ పైప్స్] ఎక్కువ గట్టిగా నుండి అధిక కాలము పని చేసినవని చెప్పుచున్నారు. లోహములను కరిగించు మూసలు 2000 లగాయతు 2800 డిగ్రీల వెంప రేచరుకు కూడ కరగనివై యుండవలెను. వీటిని మట్టితో చేయవలెను.

మట్టి పరిశ్రమ క్రీ. పూ. 5000, 3000 మధ్య ఈజిప్టులో ప్రారంభమయినట్టు తెలియును. 10 వేల సంవత్సరముల క్రితమే నైలు నదీప్రాంతంలో గాజు వస్తువులు తయారయినట్టు మరికొందరు చెప్పుచున్నారు. ఇది ఒకప్పుడు చీనా దేశమందు కూడా కలదట.

మట్టి పరిశ్రమకు ప్రధానమైనది బంక మట్టి– తడిపినప్పుడు అది అడుసువలె జిగటగ నుండవలెను. దానితో కోరిన వస్తువును చేసి, కాల్చినను స్వరూపము చెడగూడదు. నల్లరేగడ మట్టి, ఎర్రబంక మట్టి, బీహారు రాష్ట్రములోని భగల్‌పూరు, రాజమహల్ కొండలలోని మట్టి చైనా దేశపు తెల్లటి మట్టి, అస్సాములోని "బ్రహ్మకుండు", బొంబాయిలోని రత్నగిరి జిల్లా మట్టి ఈ పరిశ్రమకు పనికి వచ్చును.

బంకమట్టిలో నూటికి 45 – 50 పాళ్లు ఇసుకరేణువులు, 40–45 వంతులు అల్యూమినియపు భస్మమూ, 10–15 వంతులు నీరున్నూ ఉండును. మట్టి యొక్క జిగట కొంత వరకు దానిలో నున్న ఇసుకపాలుమీద నాధారపడి యుండి, ఇసుకపాలు జాస్తి అయిన కొద్దీ జిగట తగ్గిపోవును.

### మట్టిని శుభ్రపరచే పద్ధతి

ఏ యుపయోగమునకైనను యీ మట్టిని మొదట పరిశుభ్రపరచవలెను. ఈ మట్టి భూజనితమగుటవలన కొలది భాగము లోహ సంబంధమైన యినుము మొదలగువానితో కలిసి యుండును. అదియుగాక, అనేక వృక్ష జంతు సంబంధమైన కల్మష పదార్థములనుంచి మట్టిని పరిశుభ్రపరచుట కనేక విధములు గలవు. కాని ముఖ్యమైన వాటినిగూర్చి మాత్రమే మనవి జేసెద.

సాధారణముగ, ప్రతి పరిశ్రమలోను, మొదట మట్టిని తగినంతనీటితో గలిపి అడుసు వలె జేయుదురు. గృహ నిర్మాణమునకు గోడలు వగైరాలను కట్టుటకు, అడుసును, యేపాకములో తయారు చేయుదురో అంతకంటె కొంచెము ద్రవపదార్థముగా నుండునటుల యీ మెత్తని మట్టిని చేయుదురు. పలుచగా తయారు చేయబడిన దీనిని, యినుముతోగాని, మట్టితోగాని జేయబడిన పెద్దపెద్ద తొట్టెలలో షుమారు రెండుమూడు రోజులు నిలువయుంచుదురు. నీటిలో ఉప్పునుగాని, పంచదారనుగాని గలిపి ఒక గంటసేపు నిలువయుంచిన అవి నీటి యడుగు భాగమునకు యెట్లుచేరునో, అటులనే యీ మట్టిలోని కల్మష పదార్థముల రేణువులన్నియు తొట్టి యడుగు భాగమునకు చేరును. అప్పుడు ఆ మట్టిని తొట్టికి మధ్యగా నుండు తూము ద్వారా వేరొక తొట్టిలోనికి తీయుదురు. దీనినే మట్టి పరిశ్రమలో "ప్లొటేషన్ ప్రాసెస్" అని యందురు. యీ విధము వలన నూటికి 70 మొదలు 80 వంతుల కల్మష పదార్థములను దీసివేయవచ్చును. రెండవ విధమేమన, మట్టిని పైజెప్పిన విధముననే, నీటితో ద్రవ పదార్థము వలె జేసి యొక యినుపజల్లెడ మీదపోయుదురు. యీ యినుప జల్లెడను యేటవాలుగ బెట్టి పై భాగమున పలుచగ ద్రవపదార్థము వలె జేయబడిన మట్టిని పోయుదురు. మనము ధాన్యము వగైరా జల్లించుకొను జల్లెడ మాదిరిగా నీ యినుపపళ్లెముండును. యీ పళ్లెమును "విద్యుచ్ఛక్తి" చేత "అయస్కాంతము"గా చేయుదురు. మనము ఒక యినుపముక్కను తీసికొని దానినుంచి విద్యుచ్ఛక్తిని పంపిన యీ యినుపముక్క అయస్కాంతముగ మారును. ఈ అయస్కాంతముగా చేయబడిన దానివద్ద వేరొక యినుపముక్కనుంచిన దీనిని ఆ అయస్కాంత మాకర్షించును. అటులనే విద్యుచ్ఛక్తిని పంపి అయస్కాంతముగ జేయబడిన యినుప జల్లెడమీద పైజెప్పిన ద్రవ పదార్థమువలె జేయబడిన మట్టి యడుసును బోసిన ఆ యడుసునందలి యినుము మొదలగు లోహ సంబంధమైన కల్మషరేణువు లాకర్షింపబడును. ధాన్యము జల్లించునపుడు దానిలోని గడ్డలు, కల్మష పదార్థములు, జల్లెడమీదనే యుండి శుభ్రమైన ధాన్యము మాత్ర మడుగునకు దిగిపోవునటుల మట్టియందలి యినుము వగైరా కల్మష రేణువులు ఇనుప జల్లెడచే



# మట్టి పరిశ్రమ

**ఆంధ్రపత్రిక**
**1941 జూలై 9**
**సంచిక నుంచి**

నాకర్షింపబడి, శుభ్రమైన మట్టి మాత్ర మడుగునకు దిగిపోవును.

### శుభ్రము చేసిన మట్టిని అచ్చులో పోయుట

ఇక నీ కల్మషరహితమైన మట్టితో వస్తువుల తయారు చేయవలెను. దీనిని కొంచెము ఎండబెట్టిన లేక 100 మొదలు 150 డిగ్రీల వేడిమియుండు మూసలలో షుమారొక గంట సేపుంచిన దానియందలి నీరంతయు బోయి పొడిపొడిగా నుండు చక్కనిమట్టి తయారగును. కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి బొమ్మ స్టాట్యూనుగాని, తిలక్ గారి బొమ్మనుగాని, లేక కప్పు, సాసర్లుగాని, తయారు చేయవలయునను కొనుడు. మొదట మనము దేనిని తయారుచేయ వలయునని తలంతుమో దాని అచ్చు మోల్డు నొకదానిని తయారుచేయవలయును. వినాయక చవితి పండుగ దినమున తయారగు విఘ్నేశ్వర బొమ్మలను సంక్రాంతి పండుగలందు మనము చూచు బొమ్మలను పరిశీలించిన అవి యే విధముగ తయారగుచున్నది వాటి యచ్చుల బట్టి తెలియగలదు. ఆటులనే మట్టి పరిశ్రమలో తయారగు ప్రతివస్తువున కొక్కొక్క యచ్చుండును ఈ యచ్చులను మరొకవిధమయిన మట్టితో తయారుచేయుదురు. యీ మట్టినే రసాయన భాషలో ''క్యాలిషియమ్‌సల్ఫేట్'' ''ప్లాస్టర్ ఆఫ్ పారిస్'' యని యందురు.'' ''క్యాలిషియమ్ సల్ఫేట్'' అను మట్టిని షుమారు 120 డిగ్రీల వరకు వేడి చేసిన దానిలో నుండు నీటి భాగము కొంత యావిరిగ పోయి ''ప్లాస్టర్ ఆఫ్ పారిను'' అను మట్టి తయారగును. యీ రెండు రకముల మట్టికిని, కొంచెం నీటిభాగములో తప్ప, మరే విషయము నందునూ భేదములేదు. ఈ మట్టినే సీమసున్నపు పరిశ్రమ చాక్ ఇండస్ట్రీలో కూడ వాడుదురు. యీ పై జెప్పిన మట్టికి నీటినిగాని, మరి యే ద్రవపదార్ధమునుగాని, పీల్చుగుణము గలదు. దీనిని పరిశీలించిన దీనిలో బహుసూక్ష్మ రంధ్రములు పోర్స్ యున్నటుల తెలియగలదు. నీరుగాని, మరియే ద్రవపదార్ధముగాని యీ సూక్ష్మ రంధ్రములలోనికి బోవుటచేతనే యీ మట్టికి ద్రవమును పీల్చు స్వభావమేర్పడినది. మట్టి పరిశ్రమలలో నీ అన్ని అచ్చులను యీ మట్టిచేతనే తయారు చేయుచున్నారు.

ఇక నీ మట్టిని వదలివేసి పై జెప్పిన జిగట మట్టి అనగా శుభ్రపఱచబడిన మట్టిని గురించి విచారింతము. కావలసిన యచ్చులను తయారు చేసిన తరువాత మెత్తటి యీ మట్టిని మరల నీటితో అదుసువలె, లేక తేనెపాకమువలె కలిపి యచ్చులలో పోయవలెను. ఆటుల కొంచెము సేపుంచిన, ఆ యచ్చు, మట్టి యందలి నీటి నంతను బీల్చుకొనుటచే, ఆ యచ్చు లయాకారము వలె, అందుండు మట్టి ఊడి బయటకువచ్చును. మట్టిని, యెక్కువ నీటితో తడుపుటవలన, అచ్చు మట్టియందలి నీటిని పీల్చుకొనుటకు చాలకాలము పట్టును. ఒక్కొక్కప్పుడు మితము మీఱి యెక్కువ నీటిని మట్టితో కలుపుటచే, అచ్చునందుగల సూక్ష్మరంధ్రములు తాము పీల్చ దగిన ద్రవముకన్న, యెక్కువ ద్రవమా మట్టి యందుండుటచే పూడిపోవును. అచ్చులోని మట్టి యందింకను నీరుండుటచేతను, ఆ నీటిని అచ్చు ఇంకే మాత్రము, పీల్చజాలక పోవుటచేతను, అందుండు మట్టివస్తువు, ఊడి బయటకు రానేరదు. ఈ బాధలను తప్పించుకొనుటకై యిప్పటి నూతన పరిశ్రమలలో నీటికి మారుగ ''సోడియం సిలికేట్'' ''సోడియ కర్బనితము'' అను రసాయనిక పదార్ధముల నుపయోగించు చున్నారు. మట్టితో మొదట కొద్దిభాగము మాత్రము నీటిని కలిపి తరువాత పైజెప్పిన పదార్ధములను కలిపి యంత్రములలో బాగుగ మిశ్రమము చేయుదురు. ఇట్లు మిశ్రమము చేయుటవలన యెక్కువ నీరు నుపయోగించ కుండగనే వెనుక చెప్పిన పలుచని అదుసువంటి పదార్ధము తయారగుచున్నది. అప్పుడు దీనిని అచ్చులలో పోయుటకు చాల వీలుగనుండును. అచ్చుకూడ, మట్టిలో నీటిభాగము చాలతక్కువగ నుండుటచే త్వరలో ఆ కొద్ది నీటిని పీల్చగలుగుటకు వీలగుచున్నది. ఒక బండెడు రేగడిమట్టినిగాని, చీనా బంకమట్టినిగాని తీసికొనివచ్చి దానిలో కొంచెము అనగా సుమారు నాలుగు బిందెలనీరు పోసి, పైచెప్పిన ''సోడియం సిలికేట్'' ''సోడియం కర్బనితము'' అను పదార్ధముల మిశ్రమము సుమారు రెండు వీసెలను కలిపిన, 25 లేక 30 బిందెల నీరు పోసి కలిపిన ఎట్టి యదుసువంటి పాకమేర్పడునో, యట్టిపాక మేర్పడును.

### తయారైన వస్తువును నిప్పుతో వేడి చేయుట

అచ్చులలో నుంచి తయారైన వస్తువుల దీసి మూసలలో 100 మొదలు 300 డిగ్రీల వరకు ఉన్న వేడిలో షుమారు రెండుగంటలకాల ముంచి తీసిన తరువాత, వాటిని వేరొకమూసలో సుమారు 1000 డిగ్రీల వరకు కాల్చుదురు. అప్పుడు ఆ వస్తువులకు తగినంత బలము, గట్టి తనము వచ్చును. యీ వస్తువులను కాల్చు నపుడు వాటి నమితపు వేడిలో కాల్చకూడదు. ఎంత వేడిమిలో కాల్చునది, కాల్చబడు మట్టిమీద నాధారపడియుండును. మన యాంధ్రదేశములో దొరుకు రేగడమట్టి సుమారు 400 డిగ్రీల వేడిమికంటె యెక్కువ నాపజాలదు.

రాజమహల్, భగల్‌పూర్ కొండలలో నున్న తెల్లబంకమట్టి సుమారు 700 మొదలు 800 డిగ్రీల వేడిమిని కూడ ఆపగలుగును. చీనా తెల్లమట్టి సుమారు 1100 మొదలు 1200 డిగ్రీల వరకు కూడ వేడిమిని ఆపగలుగు

చున్నది. దీనికి గారణములు గలవు. కాని వాటినిట వితర్కించుటనవసరము. అదియు గాక, మన నల్లరేగడమట్టిచే, తయారగు వస్తువులు, చీనా తెల్లమట్టి వస్తువులంత బలముగను, గట్టిగ నుండవు. కాని మన రేగడ మట్టి యందు తగినంత యిసుకను సిలికా లేక క్వార్ట్జును కలిపి, వస్తువును తయారుచేసిన నిది చీనా మట్టితో తయారైన వస్తువంత గట్టిగ నుండి, దాదాపు 800 డిగ్రీలు వేడిమిని, కూడ నాపగలుగుచున్నది. ఇంక నెక్కువ వేడిమిని నాపగలుగు శక్తి కావలెననిన యీ క్రింది విధమున, చేయవచ్చును. రేగడమట్టిని తగినంత యిసుకతో కలిపిన, యీ మిశ్రమము 800 డిగ్రీల వేడిమిని కూడ నాపగలుగునని పై వాక్యమునందుదహరించితిని. యీ మిశ్రమమును 800 డిగ్రీలవరకు, కాల్చి మరలా కొంచెము రేగడ మట్టితో కలిపిన, నీ మిశ్రమము దాదాపు 1100, లేక 1200 డిగ్రీలవరకు వేడిమి కూడ నాపగలదు. కావున షుమారు 300 డిగ్రీలు తక్కువ వేడిమిని భరించు రేగడ మట్టిని షుమారు 1100 లేక 1200 డిగ్రీల యెక్కువ వేడిమిని కూడ భరించగలుగు నటుల, చేయవచ్చును. యీ విధముగనే 1100 డిగ్రీల వేడిమిని భరించు చీనా మట్టిని షుమారు 2500 మొదలు 2800ల డిగ్రీలవరకు వేడిమిని భరించ గలుగునటుల చేయవచ్చును. యిటుల చేయగలుగుటకు పైనుదహరించిన దానిని బట్టి ముఖ్యముగ రెండు కారణము లున్నటుల నూహింపవచ్చును.

1. మెత్తటి జిగటిమట్టిలో తగినంత భాగము సిలికా నిసుకను కలుపుట. యిటుల కలిపిన మిశ్రమమును నది యెంతవరకు భరించ గలుగునో నంత వేడిమిలో కాల్చుట.

2. అటుల కాల్చగా వచ్చిన మిశ్రమముతో మరల కొద్ది జిగట మట్టిజేర్చి మరల కాల్చుట.

ఈ కారణముచేతనే 1500 డిగ్రీలలో కరుగు, యినుమును, 2000 డిగ్రీలలో కరుగు అల్యూమినియ భస్మమును, మరియు నమితపు వేడిలో కరుగుననేక లోహములను పైచెప్పిన మట్టిరాళ్ల చేత కట్టబడిన మూసలలో, కరగిం చుటకు వీలగుచున్నది. మట్టిని యిసుకతో కలిపి కాల్చుటకు, మరల మట్టితో కలిపి మరల కాల్చుటకు విస్తారమైన బొగ్గు నుపయోగించ వలసియున్నది. అటుల బొగ్గును వృధా చేయ నక్కరలేకుండ అమెరికా దేశములోను, జర్మనీ, జపాను దేశములలోను, నూతనమార్గముల కనిపెట్టుచున్నారు. వాటిని గురించి ముచ్చ టించు టిచ్చట యనవసరము. ఏమైననూ మట్టి పరిశ్రమలో మెత్తటి మట్టితోపాటు, యిసుక కూడ చాల ముఖ్యమైన వస్తువు. ఇక నీ మట్టితో తయారు కాబడిన వస్తువులపై నున్నటి పింగాణియను పదార్థముకూడ వేయ వలసియున్నది.

## ఇ'వేమన'పద్యాలు




తల్లి గర్భమువను తాబుట్టినప్పుడు
మొలను బట్టలేదు మొనపి చూడ
నడుమ బట్టగట్ట నగుబాటు గాదొకో
విశ్వదాభిరామ వినుర వేమ.

### పింగాణి

ఈ పింగాణి పదార్థమును తయారుచేయు టకు ముఖ్యముగ మెత్తటి మట్టి, యిసుకను, బొరాక్సు అను వస్తువును వాడుదురు. కాబట్టి మట్టి వస్తువులమీద కనుపడు నున్నటి పింగాణి కూడ చాలవరకు మట్టితో చేయబడినదే. యీ వస్తువులను క్రమమైన పాళ్లలో మిశ్రమముచేసి ఎక్కువ వేడిమిని భరించగలుగు ఒక మట్టి గిన్నెలో కరగింతురు. కరగిన ఈ పదార్థమును పరిశీలించిన, నది తళతళలాడు గాజువలె నుండును. దీనిని తగినంత భాగము నీటితో కలిపి, కొంచెము ద్రవరూపమున నుండునటుల చేసిన తరువాత, మట్టి వస్తువుపై కుంచెతో వ్రాయుటగాని లేక, ఆ మట్టి వస్తువును యీ ద్రవరూపముననున్న పింగాణి పదార్థములో ముంచి లేవనెత్తుటగాని చేయుదురు. తదనం తరము నీవస్తువును తిరిగి మూసలలో సుమారు 1000 డిగ్రీల వరకు కాల్చుదురు. ఇదియే మనకు బజారులో కనపడు పింగాణి వస్తువు.★

# అద్భుత వ్యక్తులు

[15వ పేజీ తరువాయి]

రైన్ పట్టభద్రుడు. ప్లాంట్ ఫిజియాలజీలో 1920లో డాక్టరేట్ పొందారు. అనంతరం ఒక మంచి ఉద్యోగంలో ప్రవేశిద్దామని అనుకుంటున్న తరుణంలో ఈ అతీంద్రియ శక్తులను గురించి ఎక్కువగా విన్నారు. తన స్నేహితులకే ఈ అనుభవాలు ఎక్కువగా కలగడం ఆయనను ఈ శక్తుల పరిశోధనకు ప్రోత్సహించింది. ముఖ్యంగా ఒక సంఘటన ఆయనను ఎక్కువగా ఆలోచించే లాగ చేసింది.

ఒకసారి తన ప్రొఫెసర్ గారింటికి అర్ధరాత్రి పక్కింటివాళ్ళు వచ్చి ఆయన ట్రాక్టరును అర్జంటుగా ఇమ్మని అడిగారుట. ఇంత అర్ధరాత్రి ట్రాక్టరు అవసరం ఏమిటి అని అడిగినపుడు పక్కింటి యజమాని నిజం చెప్పడానికి ఒకింత ఇబ్బందిపడి చివరకు చెప్పేసాడట. తన భార్యకు అప్పుడే ఒక కల వచ్చిందనీ, అందులో ఆమె తమ్ముడు ఆత్మహత్య చేసుకోబోతున్నాడనీ, ఆవిడ కంగారుపడి లేచి తక్షణం తమ్ముడి దగ్గరకు తీసుకువెళ్ళమని భోరుమనిందని చెప్పాడు. ట్రాక్టరు తీసుకుని రెండు గంటలు వారు ప్రయాణం చేసి ఆమె తమ్ముడు ఉండే పొలం దగ్గరకు వెళ్ళేసరికి, సరిగ్గా ఆమె కలలో చూసిన పద్ధతిలోనే ఉరి వేసుకుని చనిపోయి ఉన్నాడు అతను.

ఇటువంటి కొన్ని సంఘటనలు చూసిన తర్వాత రైన్, వీటి అంతరార్థం తెలుసుకోవాలని, అతీంద్రియ శక్తుల సాధ్యాసాధ్యాలు విశ్లేషించి, యదార్థం గ్రహించాలని అనుకొని డ్యూక్ యూనివర్శిటీలో చేరి తమ పరిశోధనలను నిర్విరామంగా కొనసాగించారు. షెర్లాక్ హోమ్స్ పాత్రను సృష్టించిన సర్ ఆర్థర్‌కానన్‌డాలే ఇచ్చిన వేదాంత ప్రసంగం కూడా రైన్‌పై ఎంతో ప్రభావాన్ని చూపి, ఈ శక్తుల పరిశోధనకు బాగా స్ఫూర్తినిచ్చింది.

తన పరిశోధనలో ఒక భాగంగా ఈ ఎస్. పీ. (ఎక్స్‌ట్రాసెన్సరీ పెర్‌సెప్షన్) కార్డులు అనే ఐదు రకాల గుర్తులుండే పేకముక్కసైజు కార్డులతో అత్యంత ఆశ్చర్యకరమైన పరీక్షలు జరిపి అందరిని ఆలోచించేలాగ చేసారు. చదరము, నక్షత్రము, వృత్తము, ప్లస్ మరియు తరంగాల గుర్తులు ఉన్న ఐదు ముక్కలను ఒకరికి ఇచ్చి దూరంగా కూర్చోబెట్టి అటువంటి ముక్కలే మరో ఐదు, వేరే వ్యక్తికి ఇచ్చి అతన్ని దూరంగా కూర్చోపెట్టి వారిద్దరినీ, ఆ ముక్కలను ఒక వరుసక్రమంలో, ఎదుటివారు ఎలా పెట్టి ఉంటారో ఊహించి అదే ప్రకారం పెట్టి ఇవ్వమని చెప్పేవాడు. వారు అలా చేసిన అనంతరం, వారి ముక్కలను పరీక్షచేస్తే ఇద్దరి ముక్కలూ ఒకే వరుసక్రమంలో ఉండేవి. ఇలాగ ఎదురెదురుగా గాక కొన్ని మైళ్ళ దూరంలో కూడా వారిచేత ఈ పరీక్షలను దిగ్విజయంగాచేసి చూపించారు. వారిద్దరూ అలాగ ఒకే క్రమంలో పెట్టడానికి కారణం ముందుగా చేసుకున్న రహస్య ఒప్పందం కాదు. వారిద్దరి ఆలోచనా తరంగాలు ఒకే వేగంతో పయనిస్తున్నాయి అంటారు డాక్టర్ రైన్

డాక్టర్ రైన్ తన అనుభవాలను, పరిశోధనలు "ఎ మోడెస్ట్ లిటిల్ మోనోగ్రాఫ్-ఇ. ఎస్. పీ." అనే గ్రంథంలో వివరించి, విడుదల చేసారు. అది ప్రజలలోనూ, జర్నలిస్టుల్లోనూ ముఖ్యంగా సైంటిస్టులలో ఎంతో సంచలనాన్ని రేకెత్తించింది. ఒక సైంటిస్టు భౌతికవాదాన్ని కాదని ఇలా రాయటం ఎన్నో అనుమానాలకు దారితీసింది. డాక్టర్ రైన్ అందరికీ సముచిత రీతిలో సమాధానం చెప్పి వారి అనుమానాలను నివృత్తి చేసారు.

అతీంద్రియ విజ్ఞాన శాస్త్ర వ్యాప్తికై తన జీవితాన్నే అంకితం చేసిన డాక్టర్ రైన్ మన ఆంధ్రదేశంలోని ఆంధ్రా యూనివర్శిటీలో పారాసైకాలజీ విభాగం ప్రారంభించడానికి ఎంతో సహాయపడ్డారు. ఆయన 1980 లో తన ఎనభై నాలుగోసంవత్సరంలో దివంగతులయ్యారు.

[ఆధారం :
గ్రేట్ ఎస్కేపిస్ట్ హౌడినీ]

# సంపూర్ణ ఆరోగ్యానికి-సంతృప్తికర మైన భోజనానికి

**1**



**A. S.** బ్రాండ్ పప్పునూనె మరియు మాన్షన్ బ్రాండు నువ్వులనూనెతో తయారయ్యే వంటకాలతో మీరు ఎన్నడూ చేయనంత సంతృప్తిగా భోజనం చేస్తారు. వంటకాల్లో వచ్చే రుచి, కమ్మదనం అద్వితీయం.

**2**



అన్నిరకాల ఊరగాయలను సంవత్సర పొడువునా మెత్తబడనీయకుండ, రుచికరంగా, ఘుమఘుమలాడుతూ, తాజాగా ఉంచుతుంది.

**3**



గుండెపోటు, రక్తపోటు అరికట్టడంలో గొప్పగా సహాయపడుతుంది.

**16, 4, 2** కేజీల డబ్బాలలో ఇండియన్ గవర్నమెంట్ వారి అగ్‌మార్కు సీలుతో లభించును.






అంబటి సుబ్బన్న అండ్ కో. సామర్లకోట . A.P.

సీరియల్

# ఈ రాగానికదే తాళం

చక్కిలం విజయలక్ష్మి

## 16

( గత సంచిక తరువాయి )

"జయంతీ ! మనూ ఎలా వున్నాడు ? " హరి అడిగాడు.

"తేలిగ్గానే వున్నారు."

"నీవు రక్తం ఇచ్చావటగా ? "

"డాక్టర్ అందరి రక్తమూ టెస్ట్ చేశారు. నా రక్తం సరిపోయిందని తీసుకున్నారు."

నవ్వాడు హరి.

"కొందరు చేయని మంచి పనులు చేసినట్లు గొప్పలు చెప్పకుంటారు— నీలాంటి వాళ్ళు..."

"బావా, మీరీవేళ ఉదయం తీసుకునే టాబ్లెట్ వేసుకున్నారా ? "

"లేదు. నీవు హాస్పిటల్‌కు వెళ్ళావుగా. ఇవ్వు."

టాబ్లెట్ తెచ్చి ఇచ్చింది జయంతి.

"మనూ చాలా అందమైనవాడు. గాయాలు వాడి ముఖాన్ని వికృతం చేయలేదుగా ?"ఆదుర్దాగా అడిగాడు హరి.

"అదృష్టవశాత్తూ ముఖానికి మాత్రం గాయాలు తగల్లేదు"

రిలీఫ్‌గా నిట్టూర్చాడు హరి.

"అమ్మ అంటుంది వాడి రూపమెంత మృదువైందో వాడి బుద్ధి అంత పెడసరమని. కానీ నిజానికి వాడి మనసు చాలా మంచిది. కాకపోతే వివాహ విషయంలో వాడి అభిప్రాయాలు వేరుగా వున్నాయి. ఎవరి విషయంలోనైనా ఇది సహజమే కదా ? "

విషయం ఎటు మళ్ళుతుందో గ్రహించింది జయంతి. ఆ విషయాన్ని పదే పదే పరిగణనకు తెచ్చుకోవడం ఇష్టంలేదు జయంతికి. ఆతనికి తను నచ్చలేదు. ఆ విషయం చాలా ఫ్రాంక్‌గా చెప్పాడు. అంతే. కాకపోతే డబ్బుతో పెంచుకున్న అతని అహం తన మీద కొంచెం ప్రదర్శించబడింది.

"వివాహ విషయంలో మీ అభిప్రాయాలెలా వుండేవో తెలుసుకోవచ్చా ? " హాస్యానికన్నట్లుగా నవ్వుతూ అడిగింది జయంతి...

హరి ముఖం గంభీరంగా మారిపోయింది. ఒక నిముషం మౌనంగా వుండి, అన్నాడు "వివాహమై, భార్యను కూడా పోగొట్టుకున్న వాణ్ణి. ఇప్పుడు...కాబోయే భార్య నుంచి అప్పుడు నా అభిప్రాయాలెలా వుండేవో...ఇప్పుడుచెప్పటం చాలా అసందర్భంగా వుంటుంది."

తప్పు చేసినట్లుగా ఫీలయింది జయంతి.

"పాపను తెస్తాను" అంటూ ఇవతలకు వచ్చింది.

* * *

మన్‌మోహన్ ఇంటికి వచ్చాడు. ఆరోజు ఇంట్లో పెద్ద పండుగ చేశారు.

హాల్లో సోఫాలో ఎదురుగా కూర్చొబెట్టుకుని సుమిత్రమ్మా, రఘునాధరావూ కొడుకుని తనివితీరా చూసుకున్నారు. అలజడిని బట్టి తమ్ముడు వచ్చాడని గ్రహించిన హరి తడుముకుంటూ మెట్లదాకా వచ్చి "మనూ" అన్నాడు.

అందరూ పైకి చూశారు.

మన్‌మోహన్ లేచి నిలబడ్డాడు.

"అన్నయ్యా !"

తమ్ముడి స్వరం విన్న సంభ్రమంతో హరి ముందుకి వచ్చాడు. మెట్టు ఉన్నందువల్ల కాలు స్లిప్ అయి క్రిందికి జారింది. పడబోయి రెయిలింగ్ గట్టిగా పట్టుకుని కూలబడిపోయాడు.

అందరూ హాహాకారాలు చేశారు. జయంతి రివ్వున పైకి వెళ్ళి, హరిని లేవదీసి నెమ్మదిగా క్రిందికి తీసుకువచ్చింది క్రింది మెట్టుమీద వుండగానే మన్‌మోహన్ అన్న దగ్గరకువెళ్ళాడు.

"మనూ" అంటూ చాచిన హరి చేతుల్లో ఇమిడిపోయాడు.

ఆ అన్నాదమ్ముల కలయికను చూసి తల్లిదండ్రులకు ఆనందమో దుఃఖమో తెలియని భాష్పాలు రాలాయి.

తమ్ముడి ముఖాన్ని తడుముతూ "జయంతి నీ ముఖానికి గాయలేమీ తగల్లేదని చెప్పింది. నిజమేకదా ?" అని అడిగాడు హరి.

నవ్వుతూ జయంతివైపు చూసాడు మన్‌మోహన్.

జయంతి తల వంచుకుంది;

అప్పుడే కాలేజీ నుండి వచ్చిన గీత మన్‌మోహన్‌ను చూసి సంతోషంగా "హాయ్! మనూ అన్నయ్య వచ్చాడు. మనూ అన్నయ్య వచ్చాడు" అంటూ ఇద్దరన్నల నడుమ దూరింది.

## 17

బ్రష్‌మీద పేస్ట్ వేసి అందిస్తూన్న జయంతిని అడిగాడు హరి "రంగడేమయ్యాడు?"

"జ్వరం వస్తోంది. రాలేదు."

భారంగా నిట్టూర్చాడు హరి.

"రోజు రోజుకూ నీకు మరీ భారంగా తయారవుతున్నాను జయంతీ."

"అని ఎవరన్నారు ?" నవ్వింది జయంతి.

"ఎవరనాలి ! నేనే అంటున్నాను."

"భారం మోసేదాన్ని నేను. కానీ నాకేమీ భారమనిపించటంలేదే ?"

"భారం మోసేవాళ్ళెప్పుడూ ఉదారులై వుంటారు భారమని ఎప్పుడూ చెప్పరు."

"బాగుంది మీ వ్యాఖ్య ! రండి ముఖం కడుక్కుందురుగాని" చిరునవ్వు నవ్వింది జయంతి.

హరి ముఖం కడుక్కుని వచ్చాక ఓవల్టిన్ కలిపి ఇచ్చింది జయంతి.

"అంధులు చాలామంది తమ పనులు తామే చేసుకుంటారు. కొందరు చదువుకుని ఉద్యోగాలు

**జరిగిన కథ — 5 :** ప్రముఖ ఇండస్ట్రియలిస్ట్ రఘునాధరావుగారు జయంతిని తన ఇంటికి తీసుకొనివచ్చి, భార్య సుమిత్రకు పరిచయం చేస్తారు. ఆమె జయంతిని గుర్తిస్తుంది. తరువాత ఇంటిలోని సభ్యులకు ఒక్కొక్కరికి జయంతిని పరిచయం చేస్తారు. జయంతి మరునాడు ఒక్కొక్కరి గది పరిశీలుస్తూ మన్‌మోహన్ గదిలో అతని ఫోటోను చూస్తుంది. వారం రోజుల్లో ఆ ఇంటికి పరిసరాలకి అలవాటు పడుతుంది జయంతి. జయంతిని కొత్త వంటమనిషి అన్నందుకు మన్‌మోహన్‌ను గట్టిగా కోప్పడుతుంది సుమిత్రమ్మ. గీత, జయంతి స్నేహంగా ఉండటం పద్మినికి నచ్చదు. పద్మిని తండ్రి తన తమ్ముడి కూతురుని మన్‌మోహన్‌కు చేసుకొమ్మని రఘునాధరావుగారిని అడుగగా ఆయన మనూకి జయంతితో సంబంధం స్థిరపడినట్లు చెపుతారు. ఈ మాటవిని పద్మిని జయంతి విషయం తేల్చిచెప్పమని భర్తని నిలదీస్తుంది. గీతతో బజారుకెళ్ళిన జయంతిని పద్మిని అవమానిస్తుంది. గీత బర్త్‌డే రోజు జయంతి పాడిన పాట విన్న సుమిత్రమ్మ జయంతిని సంగీతం మాస్టారు దగ్గర సంగీతం నేర్చుకోమని చెపుతుంది. జయంతి తనకిపుడు సంగీతంమీద ఆసక్తి లేదని చెపుతుంది. కారు యాక్సిడెంట్‌లో పద్మిని మరణిస్తుంది; హరికి కళ్ళు పోతాయి. యాక్సిడెంటులో గాయాలయిన మన్‌మోహన్‌కు తన రక్తం ఇస్తుంది జయంతి.

కూడా చేస్తున్నారు. యాక్సిడెంట్ అయిన కొత్తలో నేనుకూడా నా పనులు నేనే చేసుకోవాలనీ, కళ్ళు లేని జీవితానికి అలవాటు పడాలనీ, ఎవరి పైనా ఆధారపడకూడదనీ, ఎవరినీ ఇబ్బంది పెట్టకూడదనీ అనుకున్నాను. కానీ నన్ను నీవు పూర్తిగా అసహాయుడిని చేస్తున్నావు జయంతీ. రోజురోజుకూ నీమీద ఆధారపడేలా చేస్తున్నావు. నేను అంధుణ్నే కాదు, పసిపాపను కూడా అయిపోతున్నాను. ఈ పరిస్థితి నాకు భయం గొల్పుతోంది !''

''భయమెందుకు బావా ?''

''జయంతీ, నీవు నాకు తల్లివి కావు. చెల్లివి కావు. భా... సారీ. నీవు నామీద దయతలచి చేస్తూన్న ఈ సేవలు నాకెన్నాళ్ళు లభ్యమవుతాయి ? ఆ తర్వాత నేను మరీ ఇబ్బంది పడవలసి వస్తుంది.''

జయంతి ఏమీ అనలేదు.

''అమ్మ చెప్పింది నీవు శాశ్వతంగా ఈ ఇంట్లో వుండిపోవాలని. కానీ మా దురదృష్టం, మనూ ...''

''బావా, పాప లేచినట్లుంది.''

గబగబా ఇవతలికి వచ్చింది జయంతి.

* * *

మన్‌మోహన్‌కు గాయాలు మానుబట్టినా ఒంట్లో నీరసం, నిస్సత్తువ ఇంకా పూర్తిగా పోలేదు. మామూలుగా బయట తిరిగే శక్తి లేక ఇంకా విశ్రాంతి తీసుకోవలసిన దశలోనే వున్నాడు. రోజులో మూడు వంతులు తన గదిలో మంచం మీదే వుంటాడు. స్నేహితులు, పరిచయస్తులు వచ్చి పరామర్శించి వెళ్లడం అయింది. తల్లి అనారోగ్యం మనిషి. పైకి రాలేదు. తండ్రితో పెద్దగా చనువు లేనందువల్ల రఘునాథరావుగారు ఎప్పుడో ఓ నిముషం అలా వచ్చి పలకరించటం తప్ప కొడుకుతో ఇష్టాగోష్ఠిగా మసలే పద్ధతి లేదు. ఆయనకు ఆ అవకాశం కూడా ఇవ్వదు ఆయన వ్యాపారం. గీత కాలేజీకి వెళ్లిపోతుంది. హరి సరేసరి. అంధుడు. తానే మనసు చెదరి వున్నాడు. మన్‌మోహన్‌కు ఒంటరితనంలో పిచ్చెత్తినట్లు అయిపోతోంది. పని వాళ్ళు వినయంగా పనులు చేయటం తప్ప వాళ్లనుండి ఆత్మీయత లభించదు. వారి ఆత్మీయత పంచుకోవాలనీ మన్‌మోహన్‌కు లేదు.

ఈ యాక్సిడెంట్ జరిగాక తనలో ఏదో మార్పు ? స్పష్టాస్పష్టంగా అతనికి అర్థమైందేమిటంటే తనలో ఏదో 'అసంతృప్తి'. దేనికి? ఏం తక్కువైందని ? మళ్లీ అది అర్థం కాదు.

మన్‌మోహన్ మంచంమీద పడుకుని వుంటాడు. చాలాసార్లు ఏదో పనులమీద అతని గది మీదుగా వెళ్తూ వుంటుంది జయంతి. లీలగా, రేఖాచిత్రంలా, మెరుపులా రెప్పపాటులో తన గది గుమ్మం దాటిపోయే జయంతి ఆ తర్వాత రోజంతా జ్ఞాపకాలు మిగుల్చుతుంది. చాలా రోజులకుగానీ అర్థం కాలేదు మన్‌మోహన్‌కు, తను జయంతి గురించి చాలా ఆలోచిస్తున్నాడని. అసలు జయంతి ఎందుకని రాదు తన గదిలోకి ? అందరూ వస్తారు. ఆమె మాత్రం రాదు. అన్నయ్య గదిలోకి వెళ్తుంది. తన గదిలోకి మాత్రం రాదు. అంటే ఆమె కావాలనే తన గదిలోకి రావటంలేదు !

తన అసంతృప్తికి కారణం దొరికింది మన్‌మోహన్‌కు.

రోజులో చాలా భాగం మంచంమీద పడుకుంటే, ఆ పడుకున్న సమయంలో చాలా భాగం గుమ్మంకేసి చూస్తూ వుంటాడు.

అసలెందుకు తనిలా చూస్తున్నట్టు ?

తన దీర్ఘమైన విశ్రాంతి సమయంలో ప్రొద్దుపోవడానికి ఇదో సాధనమా ? అలా అనిపించటం లేదు. ప్రొద్దు గడవడానికి ఎన్ని



## ఈ రాగాని కదే తాళం

సాధనాలు లేవు? రేడియో, టెలివిజన్, టేప్ రికార్డర్, పేక, బుక్స్ ...

క్షణంలో సగం కనిపించి కనుమరుగయ్యే ఆ అమ్మాయి తన ప్రొద్దు గడిపించటమేమిటి? కనీసం ఇటు తిరగదు. ఇటు చూడదు. ఏ అనుభూతి మిగుల్చుతోందని? ఎందుకు లేదు! ఆ తర్వాత దినమంతా ...!

కానీ అలా ఆమెను చూడని రోజు ఆ 'క్షణం' కోసం ఎంత ఆరాటం!

'డర్టీ జాబ్!' కసిగా గొణుక్కున్నాడు మన్‌మోహన్.

ఒకరోజు రంగాతో అదే పనిగా పిలిపించాడు జయంతిని.

''చూడూ, జయంతిని రమ్మను ఓసారి.''

రంగ తెల్లబోయి చూశాడు. పనివాళ్లకు యజమానులు పిలిచి రహస్యాలేమీ చెప్పవలసిన పనిలేదు. నిజానికి ఇంట్లో రహస్యమంటూ ఏదైనా వుంటే అది ముందుగా తెలిసేది పని వాళ్లకే. జయంతికీ, మనూకు మధ్య జరిగిన పెళ్లి తాలూకు మడత పేచీలన్నీ రంగకుతెలుసు. మన్‌మోహన్‌కు జయంతి పట్ల వున్న నిరసన భావమూ తెలుసు. అలాంటిది...!

వాడి తెల్ల మొహం చూసి విసుక్కున్నాడు మనూ.

''ఫూల్. వెళ్లి రమ్మని చెప్పు.''

గబగబా వెళ్లాడు రంగ.

ఆతృతగా అడుగుల చప్పుడుకై చెవులు రిక్కించాడు మన్‌మోహన్. ఐదు నిముషాల తర్వాత జయంతి మెత్తని అడుగు చప్పుడు వినిపించింది.

మన్‌మోహన్ గుండెలు పెద్దగా చప్పుడు చేశాయి.

జయంతి వచ్చి గుమ్మం అవతల నిలబడింది.

'పిలిచారట?' అని అడగలేదు.

''ఏం కావాలి?' అని పలకరించలేదు.

మౌనంగా, 'పిలిచినందుకు వచ్చాను. ఏం కావాలో నీవే చెప్పుకో. ఎంత సేపయినా నిలబడగలను' అన్నట్టుగా నిలబడిపోయింది.

నిముషం... రెండు నిముషాలు... రెండున్నర...

మన్‌మోహన్‌కు ఈ పరిస్థితి చాలా ఇబ్బందిగా తయారైంది. అనాలోచితంగా, అక్కసుగా రమ్మనయితే చెప్పి పంపాడుగానీ ఆమె వచ్చి ఎదురుగా నిలబడితే ఏం చెప్పాలో తోచలేదు.

''ఏం లేదు. ఏమీ... లేదు. తలనొప్పిగా వుంటేనూ...''

గిరుక్కున తిరిగి వెళ్లింది జయంతి.

రెండు నిముషాల తర్వాత అమృతాంజనం సీసా పట్టుకువచ్చాడు రంగ. ''అమ్మాయిగారు పంపారు. తలకు పూయమంటారా?'' అంటూ.

ఉక్రోషంతో నిజంగా తలపోటు వచ్చింది మన్‌మోహన్‌కు.

"నీ తలకు పూసుకో" అంటూ కసిరాడు.

వాడు బిత్తరపోయి అక్కణ్ణించి కదిలాడు.

"ఇదిగో తల పగిలిపోతోందని చెప్పు ఆవిడకి" కసిగా అన్నాడు మన్‌మోహన్.

వాడు పరుగుతీశాడు.

అరగంట గడిచింది దాదాపు.

డాక్టర్ హడావిడిగా గదిలోకి వచ్చాడు "ఏమిటి మనూ! సడన్‌గా ఇంత సివియర్ హెడేక్ ఏమిటి?" అంటూ.

డాక్టర్ రావటం మేలే అయింది. ఎందుకంటే డాక్టర్‌ను చూసి సివియర్ హెడ్‌ఏక్‌తో తల పట్టుకున్నాడు మనూ!

## 18

"ఏమిటంత దీక్షగా చదువుతున్నావు? నీకు బొమ్మలు చూడటం తప్ప కథలు, నవలలు చదివే అలవాటు లేదే!" నవ్వుతూ అడిగాడు మన్‌మోహన్.

"నీకు తెలీదూ? ఈ మేగజైన్లో జయంతి కథ అచ్చయింది" అంది గీత.

మన్‌మోహన్ కనుబొమలు ముడివడ్డాయి.

"జయంతి కథలు రాస్తుందా?" నొక్కి అడిగాడు.

"చాలా బాగా రాస్తుంది. మొదటి కథ ఫెయిర్ చేసి పోస్ట్ చేసింది నేనే. ఒకరోజు కథ రాసి టేబుల్‌మీద పెట్టి మరచిపోయింది. అనుకోకుండా నేను చూశాను. నేను ఏదైనా పత్రికకు పంపుదామంటే 'ఏదో తోచక రాశాను. ఇచ్చెయ్' అంటూ గొడవ చేసింది. నేనా ఇచ్చేది? ఫెయిర్ చేసి పోస్ట్ చేశాను. రెణ్ణెల్లకంతా యాక్సెప్ట్ చేసినట్లు ఉత్తరం వచ్చింది. ఆ తర్వాత మరో నెలకు కథ అచ్చయిన పత్రిక, ఆ వెంటనే యాభై రూపాయలకు చెక్కు పంపించారు. ఇది మూడవ కథ. అమ్మాయిగారు రెండవ కథ తనే స్వయంగా పంపారులే" కిలకిల నవ్వింది గీత.

మన్‌మోహన్ గీత చేతుల్లోని పత్రిక అందుకుని చాలా ఆసక్తిగా చూశాడు.

"మొదటి రెండు కథలు అచ్చయిన పత్రికలు నీ దగ్గరున్నాయా?" చెల్లెల్ని అడిగాడు.

"ఓ. తీసి పెట్టానుగా" అంటూ చెంగు చెంగున లేడిలా దూకి వెళ్లి బీర్వాలో దాచిన పత్రికలు తెచ్చి ఇచ్చింది.

"గీతా, ఈ విషయం నా కెప్పుడూ చెప్ప లేదేం?"

బుంగమూతి పెట్టింది గీత.

"నీకు... నీకు... జయంతి అంటే ఇష్టం లేదుగా? అందుకే చెప్పలేదు. పైగా జయంతి నీకు చెపితే చెవి మెలిపెడ్తానని బెదిరించింది. అసలు జయంతి ఎంత చక్కగా పాడుతుందో తెలుసా? నా బర్త్‌డేకు నీవు మేచెస్‌కని బొంబే వెళ్లావు. అప్పుడు– అబ్బ ఎంత అద్భుతంగా పాడిందని!"

సాలోచనగా తల వూపాడు మన్‌మోహన్.

* * *

మధ్యాహ్నం ఓ గంటసేపు మాత్రం తీరిక దొరుతుంది జయంతికి. లైబ్రరీ గదిలోకి వెళ్లి తన కిష్టమైన పుస్తకాలు చదువుతూ గడిపేస్తుంది ఆ సమయాన్ని. పద్మిని చనిపోయాక ఇటీవలే జయంతి 'లైబ్రరీ' ప్రయత్నం చేసింది. ఇంట్లో ఏ మూలపడ్తే ఆ మూల వున్న పుస్తకాల నన్నింటిని వెతికి పట్టుకుని ఓ వార్డ్‌రోబ్‌లో అందంగా సర్ది పైన 'లైబ్రరీ' అన్న స్లిప్ బోర్డ్ తగిలించింది. అది చూసి రఘునాథరావుగారు చిరునవ్వు నవ్వుతూ "లైబ్రరీ పట్ల నీకంత ఆసక్తి వుంటే ఓ గదిలోనే ఏర్పాటు చేసుకో" అంటూ ఆయనే ఆ ఏర్పాటు చేయించటమేకాక కావలసిన రాక్స్, రకరకాల సాహిత్యం తెప్పించి పెట్టారు.

ఆ రోజూ అలాగే గదిలో కూర్చుని 'రామాయణ కల్పవృక్షం' చదువుతోంది జయంతి.

పఠనంలో మునిగిపోయిన జయంతి ఎవరో తనను పరిశీలిస్తున్నట్లనిపించి తల ఎత్తి చూసింది.

వాకిట్లో నిలబడి తనకేసే చూస్తున్నాడు మన్‌మోహన్. చటుక్కున లేచి నిలబడింది జయంతి.

"కంగ్రాచ్యులేషన్స్ జయంతీ."

ఆశ్చర్యపడ్తూ "ఎందుకు?" అన్నది నెమ్మదిగా.

"నీవు రచయిత్రివని తెలిసి చాలా ఆశ్చర్యపోయాను."

జయంతి పెదిమలమీద చిన్న చిరునవ్వు విరిసింది.

"ఎందుకు? పనిమనిషి రచయిత్రి కావడం జీవితంలో మొదటిసారిగా విన్నందుకా?"

"జయంతీ!"

జయంతి చకచక అవతలి వాకిట్లోంచి బయటికి వెళ్లిపోయింది.

## 19

ఆ రోజు గీతను చూడ్డానికి పెళ్లివారొస్తున్నారు.

"ఇప్పుడే నాకు పెళ్లేమిటి!" అని గీత గునుస్తూ వుంది. కానీ సుమిత్రమ్మ పట్టు పట్టింది. పెద్దకొడుకు బ్రతుకలా బండలైంది. జయంతిని పెళ్లాడి కన్నుల పండువు చేస్తాడనుకున్న మనూ తలతిక్కవాడిలా తయారయ్యాడు. తన అనారోగ్యం తన నెన్నాళ్లు బ్రతకనిస్తుందో తెలీదు. కనీసం ఆడపిల్ల పెళ్లయినా కళ్ల చూడాలనే ఆరాటం సుమిత్రమ్మను నిలువనీయడంలేదు.

జయంతి ఇల్లంతా నీట్‌గా సర్దించింది. పెళ్లివారికి ఫలహారం తనే తయారు చేసింది. గీతకు పట్టుచీరె కట్టించి అలంకరించింది.

"ఈ చీరె నాకొద్దు బాబూ. నేను పావడ, పైట కట్టుకుంటాను" అంది గారాలుపోతూ గీత.

"ఈ చీరెలో పెళ్లికొడుకు నిన్ను చూశాడంటే ఇప్పుడే పెళ్లి చేయమంటాడు" బుగ్గ గిల్లింది జయంతి.

"చీరెతో చేయమంటాడా ?" కిల కిల నవ్వింది గీత.

"ఉహూ. చీరెలోని నీతో."

క్రింది నుండి సుమిత్రమ్మ కేక వినిపించింది. గబగబ క్రిందికి వెళ్లింది జయంతి.

పెళ్లివారొచ్చారు.

"పెద్దన్నగారు, మీరు లేకపోతే ఎలా ?" అంటూ హరిని కూడా తీసుకువచ్చి హాల్లో కూర్చోపెట్టింది జయంతి. భుజం నిండుగా పైట కప్పుకుని, మంగమ్మ ట్రే పట్టుకు రాగా అందరికీ కాఫీ, ఫలహారాలు అందించింది. తర్వాత గీతను తీసుకువచ్చి సోఫాలో కూర్చోబెట్టింది.

పెళ్లికొడుకు తల్లి గీతను పాట పాడమంది. గీత పాట రాదన్నట్లుగా తల అడ్డంగా వూపింది. పేరు, చదువు అడిగారు. 'ఆ మాత్రం తెలుసుకోకుండానే వచ్చారా ?' అన్నట్లుగా విసుగ్గా సమాధానం చెప్పింది గీత.

తర్వాత జయంతి గీతను లోపలికి తీసికెళ్లింది.

"పెళ్లికొడుకును చూశావా ?" గీతను అడిగింది జయంతి.

# ఈ రాగానికదే తాళం

"ఏదీ ? నన్ను ఇంటర్వ్యూ చేసింది అతని తల్లి కదా ?"

"ఓహో ! పెళ్లికొడుకు ఇంటర్వ్యూ చేయలేదని కాబోలు ఈ ఆగ్రహం !" నవ్వింది జయంతి.

"ఛ, పో" అంటూ చీరె లాగి పడేసింది గీత.

* * *

"జయంతీ, గీతను చూసి వెళ్లిన వాళ్లు ఉత్తరం రాస్తామన్నారు. రాశారా ?" హరి అడిగాడు పుస్తకం చదివి వినిపిస్తున్న జయంతితో.

"రాస్తే ఆ విషయం మీకు తెలుపకుండా వుంటారా ? ఇంకా రాయలేదు. బహుశా ఈరోజో, రేపో రావచ్చు."

"గీతకు పెళ్లయి వెళ్లిపోతుంది. మరి కొన్నాళ్లకు నీవూ... ఆ తర్వాత ఈ ఇల్లొక శూన్య మందిరంలా మిగిలిపోతుంది !" నిట్టూర్చాడు.

"ఎందుకలా అనుకోవాలికి. త్వరగా మీరు పెళ్లి చేసుకోండి. ఆమె నవ్వులతో మళ్లీ ఈ ఇల్లు కళకళ లాడుతుంది."

"జయంతీ !!!" కేకపెట్టాడు హరి.

"ఎందుకంత ఆశ్చర్యపోతారు బావా ? అక్కను మరచిపోవడం అంత సులభం కాకపోయినా పాపకోసం, మీకు కళ్లు కావలసిన ఇల్లాలి కోసం మీరు మళ్లీ పెళ్లి చేసుకోవాలి."

హరి ముఖం నల్లగా మాడిపోయింది.

"కళ్లులేని నేను నీ మీద ఆధారపడ్డానని మరీ ఇంత హేళన చేయడం బాగులేదు జయంతీ."

"బావా ! నేను ఎగతాళి చేస్తున్నానా ? లేదు ... లేదు. ఇందులో ఎగతాళి చేయడానికి ఏముంది ?"

"ఎగతాళి కానిది ఏముంది ? వివాహితుణ్ణి. ఒక బిడ్డకు తండ్రిని. అంధుణ్ణి. ఇప్పుడు ... నా పెళ్లి గురించి మాట్లాడటం ఎగతాళి కాదూ ?"

"పోయినవాళ్లతో మనమూ పోలేము. వివాహితులు మళ్లీ పెళ్లి చేసుకోవడం లేదా ? తల్లి లేని తన బిడ్డలకు తల్లిని తెచ్చుకోవడం లేదా ?"

"స్త్రీల ఔదార్యం నాకు తెలుసు. కానీ ఒక అంధుడికి భార్యవై జీవితమంతా నరకం అనుభవించమని ఒక స్త్రీని శపించే క్రూరత్వం నాకు లేదు."







''దాన్ని వరంగా భావించే స్త్రీ ఎదురు పడకూడదా ?''

నవ్వాడు హరి.

''పురుషుడికి అతని స్వప్న సుందరి ఎదురు పడవచ్చు. స్త్రీకి తన కలల్లోకి మన్మథుడు తారసపడవచ్చు. కానీ నాలుగు గోడలు విడిచి కాలు కదపలేని ఓ గుడ్డివాడికి నిన్ను పెళ్ళాడటం వరంగా భావిస్తాననే దేవతామూర్తి ఎదురు పడటం, పడుతుందని అనుకోవటం ఎంత హాస్యాస్పదం ! జయంతీ, మనిషిని కాబట్టి నాకు ఆశలుంటే వుండవచ్చుగానీ దురాశలు లేవు. అయినా పెళ్ళిగురించి ఇంత దూరం మాట్లాడ్డం ఎంత సిగ్గు చేటు ! జయంతీ, దయచేసి మరోసారి ఈ ప్రసంగం తీసుకురాకు.''

హరి తడుముతూ వెళ్లి బాల్కనీ పిట్టగోడ అంచున నిలబడ్డాడు.

నిట్టూర్చింది జయంతి.

*    *    *

ఆ రోజు పెళ్లివారి నుండి ఉత్తరం వచ్చింది. నీరసంగా పడుకుని వున్న సుమిత్రమ్మ మంచం దగ్గర కుర్చీలో కూర్చుని వున్నారు రఘునాధరావుగారు.

ఉత్తరం పట్టుకు వచ్చింది జయంతి.

కళ్లద్దాలకోసం జేబులు తడుముకుని, అవి కనిపించక పోవడంతో ''నీవే చదువమ్మా'' అన్నారు.

జయంతి కవర్ ఓపన్ చేసి ఉత్తరం తీసింది.

శ్రీ రఘునాథరావు గారికి,

నమస్కారములు. ఉభయకుశలోపరి.

ఉత్తరం రాయటంలో జాప్యం జరిగినందుకు అన్యథా భావించరని ఆశిస్తున్నాను. నిజానికి రాయాలనుకున్న విషయాన్ని రాయడానికి కొంత మోమాట పడినందున యధారీతిగా జాప్యం జరిగినది. ఇప్పటికయినా అబ్బాయి వత్తిడివల్ల రాయక తప్పలేదు.

జయంతి అనే అమ్మాయి మీ మేనకోడలని చెప్పారు. మా వాడికి మీ మేనకోడలు బాగా నచ్చిందట. అంటే మీ అమ్మాయి బాగా లేదని కాదు. అసలు జయంతిని చూశాక మా వాడు మీ అమ్మాయిని సరిగ్గా చూడలేదట. జయంతి మీ మేనకోడలే కాబట్టీ, మీ అమ్మాయికంటే పెద్దది కూడా కాబట్టి మా అబ్బాయికి ఆ అమ్మాయిని ఇవ్వడానికి మీకు అభ్యంతరం వుండదనుకుంటాను. అసలు మా వాడు...

ఆ పైన చదవలేక పోయింది. పెదిమలు అదురుతూండగా, అడుగులు తడబడగా ఉత్తరాన్ని రఘునాధరావుగారి ముందు పడేసి ఏదో తప్పు చేసినదానిలా గదివిడిచి పరుగుతీసింది.

## సాపేక్షత

గీత ప్రక్కన రేఖ ఉంది
అందుకే గీత పొట్టి
రేఖ పొడుగు
రాత్రి ప్రక్కన పగలు ఉంది
అందుకే రాత్రి చీకటి
పగలు వెలుగు
మొత్తం అంతా పగలయితే
ఇంక వెలుగుకు విలువేమిటి ?
చీకటికి దిగులేమిటి ?

— సి. వి. సర్వేశ్వరశర్మ

ఈ అనుకోని సంఘటనకు నిశ్చేష్టులై పోయారు సుమిత్రమ్మ, రఘునాధరావుగార్లు.

*    *    *

''ఈ రోజుకూడా ఉత్తరం రాలేదా జయంతీ ?'' హరి అడిగాడు.

''అత్తయ్య, మామయ్యకంటే మీకే ఎక్కువ తొందర వున్నట్లుందే !'' నవ్వింది జయంతి.

''ఆడపిల్లలు పెళ్ళయి వెళ్లిపోతారని బాధగానే వుంటుందిగానీ, మళ్లీ పెళ్లి ఆలశ్యమైపోతూందే అని ఆరాటంగానూ వుంటుంది.''

''ఆలశ్యమైపోవడానికి గీతకు ఎన్నేళ్లని ?'' అంది జయంతి.

''సంబంధం మంచిదని నాన్నగారు చెప్పారు. వయసులేదని మంచి సంబంధాన్ని పోగొట్టుకోవడం తెలివితక్కువతనమే కదా ?''

జయంతి ఏమీ అనలేదు.

''ఇంతకూ ఉత్తరం రానట్లేనా ?''

''వచ్చింది. గీత నచ్చిందట వాళ్లకు. కానీ గీతకే ఆ అబ్బాయి నచ్చలేదట.''

''ఏమైంది అబ్బాయికి !?''

''గీతకు అబ్బాయి అందంగాలేదు. ఈడూ జోడూకాడు.'' అబద్ధాలు చెప్పవలసి వచ్చినందుకు బాధపడింది జయంతి.

''పెళ్లికొడుకు అందచందాలు పరిశీలించేంత పెద్దదయిందా గీత !'' నవ్వాడు హరి.

''మీ చెల్లెలింకా చిన్నపిల్ల అనుకుంటున్నారా ?'' జయంతికూడా నవ్వింది.

''ఇప్పుడేకదా గీత కెన్నేళ్లని అన్నావు ?''

''పెళ్లికి చిన్నదే. పెళ్లికొడుకు అందచందాలు చూడ్డానికికాదు.''

''బాగుంది నీ వాదన.''

(ఇంకా ఉంది)



# ఏ స్వామిదో ఈ శిలా మంచం ?

ప్రాచీన కళాఖండాలు, శిల్పాలు, శిలా శాసనాలు అలనాటి సంస్కృతీ నాగరికతకు ప్రతీకలు. వివిధ ప్రాంతాలలో ఆలనా పాలనాలేక దీనస్థితిలో మూల్గుచున్న చారిత్రక నిదర్శనాలను పరిరక్షించాల్సిన బాధ్యత పురాతత్వశాఖవారిది.

నేటి అనంతపురంజిల్లాలోని రాయదుర్గం తాలూకా ప్రాంతం అలనాడు భూపతిరాయల పాలనలో వెలసిల్లింది. ఇచ్చటి శిథిలమైన శిల్పాలను తిలకించిన నాటి శిల్పుల కళానైపుణ్యం, కుశాగ్రబుద్ధి బోధపడుతుంది. రాయదుర్గం తాలూకా 75 వీరాపురం గ్రామంలో (రోడ్డుకు కిలో మీటర్ దూరంలో) అద్భుతమైన శిలా మంచం ఒకటుంది. దీనికి 12 గజాల దూరంలో ఓ చిన్న శివాలయం వుంది. ఈ శివాలయాన్ని ఇచ్చట గ్రామస్థులు బండెప్పగుడి అంటున్నారు. ఈ శిలామంచాన్ని బండెప్ప మంచం అనీ, మరి కొందరు ముత్యప్ప మంచం అని అంటున్నారు. పూర్వము ఇచ్చట బండేశ్వరుడనే యోగీశ్వరుడుండేవాడని, అతడు ఈ శిలామంచాన్ని జ్ఞాన పీఠంగా వుపయోగించుకొని యుండవచ్చుననీ కొంతమంది వృద్ధులు తెలిపారు.

ఈ శిలా మంచం విశిష్టత ఇలా వుంది : ఈ శిలామంచం పొడవు 79 ఇంచులు (దాదాపు 6 అడుగులు) వెడల్పు 51 ఇంచులు. (దాదాపు 4½ అడుగులు) ఈ శిలా మంచం కొంచెంకూడా ముక్కు పోలేదు. ఇక ఈ శిలా మంచంపైగల శిల్పకళను తిలకిద్దాం.

మంచానికి అంచున నాలుగు వైపులు 'లత' తీగలు మలచబడినవి. మంచానికి [3 వైపుల తల దిండ్లు ప్రత్యేకమైన రాతితో] కలవు. మంచం మందం 6 ఇంచులు. ఈ శిలా మంచానికి క్రింది భాగాన 3 పుష్పములు చిత్రీకరించబడినవి. మధ్య గల పుష్పమునకు 4 వైపుల నాగసర్పం పడగ గుర్తులు మలచారు. మిగిలిన రెండు వృక్షములకు 4 వైపుల చిలుకల గుర్తులు మలచబడినవి. ఈ శిలా మంచానికి 4 కాళ్ళు డిజైనుతో మలచారు.

శివాలయం ప్రక్కన ఓ రాతి దోణి వుంది. ప్రస్తుతం ఇందులో కొన్నిమాత్రం నీళ్ళున్నాయి. ఈ రాతి దోణిలో రాతికి ఇరువైపుల 'లింగం ఎదుట నంది' మలచబడినవి. ఈ శివాలయానికి తూర్పున మాత్రం ఓ చిన్న ద్వారం వుంది. పశ్చిమాన దాదాపు 14–15 అడుగుల ఎత్తైన ధ్వజస్థంభం వుంది. ఈ ధ్వజస్తంభంపైగల గుర్తులు :–

1. నాగరాజు గుర్తు
2. ఇద్దరు మ్రొక్కేగుర్తు
3. ఏనుగు గుర్తు
4. ఒకరు మ్రొక్కే గుర్తులు కలవు.

శివాలయానికి కొద్దిదూరంలోని ఆంజనేయ స్వామి ఆలయం వద్ద అసంపూర్ణ శిలాశాసన మొకటున్నది. దీనిని తిలకించినట్లయితే ఇది 15వ శతాబ్దానికి చెందినట్లుగా తోస్తున్నది. ఈ శిలామంచానికి పోలిన మరో శిలామంచం మైసూరు జగన్మోహన బంగ్లాలో యుందని తెలిసింది. అద్భుతమైన, అపురూపమైన ఈ శిలామంచం శిథిలం కాకముందే పురాతత్వశాఖ వారు పరిశీలించి దీనిని ప్రదర్శన శాలలో యుంచాలి.

ఇంతకూ ఈ శిలామంచం ఏ స్వామిదో ? పురాతత్వ శాఖ వారు పరిశీలన జరిపితే అలనాటి రాజులు స్వామివారి సేవకోసం శిలా మంచాన్ని కూడా ఉపయోగించారేమో ?– వెల్లడవుతుంది.

– జయసుమన్

# వ్యక్తిగతం



భారత వాణిజ్య పరిశ్రమల సమాఖ్య వారి వనితా విభాగం భారత దేశంలోని ఉత్తమ వనితా వ్యాపారిగా ఎన్నుకున్న శ్రీమతి దీనా జెయిన్ ...



అసలు పేరు గారీ హార్ట్ సెన్స్. హార్ట్‌గా పేరుని మార్చుకున్నాడు. వయసుని కూడా ఒక సంవత్సరం తగ్గించుకున్నాడు. ఆయన తీరిక సమయాలలో మట్టితో ఎక్కువగా గద్దల బొమ్మలు చేస్తూ ఉంటారు. ఇంతకీ ఆయన అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షపదవికి ఆశపడే డెమోక్రెటిక్ పార్టీ అభ్యర్థులలో ఒకరు...



సుప్రసిద్ధ సంస్కృత పండితుడూ, ఇటలీ దేశస్తుడూ అయిన ప్రొఫెసర్ గ్యెసెప్ తుచ్చి ఇటీవలే మరణించారు...



ఎదోఆర్డోపోంటీ (11 ఏళ్ళు) సినిమాలలో వెయ్యటం మొదలు పెడుతున్నాడు. అతను వేసే మొదటి చిత్రం ప్రొడ్యూసరు తండ్రి కార్లోపోంటీ. తల్లి సోఫియాలోరెన్‌కూడా ఈ సినిమా (అరోరా)లో వేస్తోంది. సినిమాలో ఇద్దరూ తల్లికొడుకులుగా వేస్తున్నారు...



సూపర్ మాన్, సూపర్ బాయ్ తర్వాత సూపర్ గరల్ — హెలెన్ స్లేటర్‌కి 20 ఏళ్ళు ...

# వారఫలం

4–5–1984 శుక్రవారం మొదలు 10–5–1984 గురువారం వరకు

♈ మేషం: మీరు వ్యాపారం చేసే లాగైతే అఖండ వ్యాపార లాభం అనుభవించగలరు, వృత్తి లో పెంపు కనిపిస్తుంది. రాజకీయంగా బాగా అనుకూల వారం. ఉద్యోగ యత్నాలు సఫలమయి, ఉద్యోగం వారాంతానికి లభ్యం కాగలదు. స్త్రీలకు: శుభ ప్రస్తావనలు ఉంటాయి.

♉ వృషభం: భూ వివాదం ఉన్నది గదా! పరిష్కార మార్గం వారాంతానికి చెప్పదగిన అంశం. ఇల్లు మారాలనే సంకల్పం ఉన్నది గదా! అదికూడ అనుకూలమే. రాజకీయంగా, సాంస్కృతికంగా, సామాజికంగా మీకు అభివృద్ధి చెప్పదగిన కాలం. స్త్రీలకు: చాల కాలంగా కుదిరి రాని వస్తు సేకరణకు అవకాశం, అప్పులు వసూలయ్యే మార్గం గలవారం.

♊ మిథునం: వివాదగ్రస్త విషయాలు మీకు అనుకూలదాయకం, యంత్ర సంబంధంగా, నల్లని వస్తు సంబంధంగా వ్యాపారం చేసే వారికి గాని, గనులందు పని చేసే వారికి గాని, బ్యాంకు ఉద్యోగస్థులకు గాని మంచి అనుకూల వాతావరణం ఏర్పడు తుంది. కొందరకు అప్రయత్నంగా డబ్బు చేతి కందే మార్గమున్నది. స్త్రీలకు: విలాస వస్తు సేకరణ కలదు.

♋ కర్కాటకం: చాల వారాలుగా తికమక చేసే వ్యవహారం, ముఖ్యంగా ఆస్తి సంబంధమైన వ్యవహారం, ఈవారం అనుకూలం. కాని వారి బెడద నుండి తప్పించుకో గలరు నూతనాంశాలు గ్రహింపునకు రాగలవు. ఆదాయమందు అభివృద్ధి చేకూరుతుంది. స్త్రీలకు: బంధువుల రాక ఉద్యోగ వికాసం గల వారం.

♌ సింహం: ఇతరులతో వివాద పడటం వలన చికాకు ఉదయించ గలదు. ఏమీతోచని స్థితి గత కొన్ని వారాలుగా ఉన్నదిగదా! ఈ వారాంతంనుండి హాయిగా ఉంటుంది. ఆదాయం గలదు. వస్తు విక్రయమందు లాభదాయకం. చిన్నదో పెద్దదో ప్రయాణం కూడ చేయవలసిన పరిస్థితి ఉన్నది. స్త్రీలకు: మాట పట్టింపులు, అనవసర ఖర్చులు చెప్పదగిన దినాలు.

♍ కన్య: అభివృద్ధి కనిపించునని ఆశించిన గృహ వ్యవహారం ఎదురు తిరుగుతుంది. ఆరోగ్య మందు కూడ చెప్పరాని యిబ్బంది ఏర్పడుతుంది. అవకాశం కళా సాహితీ రంగాన చిక్కినట్లే చిక్కి జారిపోతుంది. చలన చిత్ర విరామ తలకు సర్వానుకూల వారంగా చెప్ప వచ్చు. స్త్రీలకు: వృత్తి యందు వికాసం లభ్యం, ఉద్యోగ రీత్యా కొందరకు 'ప్రమోషన్' లభించగల వారం.

♎ తుల: కుటుంబ కలతలున్నవి. వృత్తి లో చికాకులున్నవి రాజకీయంగా చెప్పరాని యిబ్బందులున్నవి. రాశియందు స్థితుడైన 'శని' ఉచ్ఛుడై కాపాడుచున్నందున ఆరోగ్య విషయమందు తప్ప, తక్కిన వ్యవహారాలలో ఒక మాదిరిగా ఉంటాడు. స్త్రీలకు: చికాకులు ధనాభావం కనిపిస్తుంది.

♏ వృశ్చికం: వస్తువులు, కొనటం, అమ్మటం వలన లాభించే మార్గమున్నది. ప్రయాణం చేయ వలసిన అగత్యం ఉన్నది, అయినా చాల మంది మాను కోవటం శ్రేయస్కరం. దాయాదులతో పట్టింపులు రాగలవు. మనశ్శాంతి లోపింపవచ్చు. అందుకు తోడు, ఆరోగ్యం లోపిస్తుంది. స్త్రీలకు: కళా సాహితీ రంగాలలో మేలున్నది.

♐ ధనుస్సు: వారాంతంలో ఆదాయం, వృత్తి యందు ఔన్నత్యం, కార్యానుకూలం, ఇంట శుభం జరిగే అవకాశం, గృహానందం, సంతానం వలన ఆనందం, వైద్య వృత్తికి సంబంధించిన వారైనా, బ్యాంకులందు ఉద్యోగించే వారయినా, మేలు సంభవమయ్యే సమయం, గ్రహించండి. స్త్రీలకు: దూర ప్రయాణ సన్నాహాలకు అవకాశం, బంధు మిత్ర సంభాషణకు అవకాశం గల వారం.

♑ మకరం: చాల కాలంగా 'కాదని' వదలి వేసిన ఒకానొక గృహ వ్యవహారం ఈవారం సానుకూలం కాగలదు. మాటల చాకచక్యంతో కొన్ని పనులు సవరించుకోగలుగుతారు. కాని వారి ఉచ్చుల నుండి తప్పించుకోగలుగుతారు. స్త్రీలకు: అప్రయత్న ధన లబ్ధి, వృత్తి యందు పెంపు సమకూడగలదు.

♒ కుంభం: మంట నలుగురిలో చెలామణి అవుతుంది. ప్రత్యర్థులతో చికాకులు రావచ్చు, పనులు చకచకా జరుగక పోవచ్చు, రాజకియంగా అనుకూలత నందవచ్చు. రాబడియందు వృద్ధిని చూడవచ్చు. స్త్రీలకు: శ్రమించి నందులకు ఫలితం లభించినదని ఆనందిస్తారు. వ్యవహార విజయం చేకూరుతుంది. డబ్బు చేతికి అంది అవసరాలు తీరటం గమనిస్తారు.

♓ మీనం: నయంతో, ప్రియంతో పనులు సాధించుకొంటారు. హాయి, ఆనందం చూరగొంటారు. పని పాటలు చేసి కొనే వారికి లాభదాయకమే. భారీ వ్యాపారం చేసే వారు మిక్కిలి జాగ్రత్త వహింపదగిన వారం. వివాద గ్రస్త విషయం యిట్టే తేలిపోయిందని ఆనందింపనున్నారు. స్త్రీలకు: వస్తు, వస్త్ర సేకరణకు అవకాశం, ద్రవ్యాదాయం, ఉద్యోగ వికాసం చెప్పదగిన ముఖ్యాంశాలు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# హైదరాబాద్ నోట్‌బుక్

## యోగాచార్యుడు

## పెరుమాళ్ల రామకృష్ణ :

సీనియర్ ఇంజనీర్ పి. రామకృష్ణ గారిని కలుసుకోవాలి. ఆయన ఎక్కడ ఉంటారో చెబుతారా ? అనడిగాను రామచంద్రాపురంలోని బి. హెచ్. ఇ. ఎల్. కు వెళ్లి. అయ్యా పి. రామకృష్ణలు పాతిక మంది వున్నారు. ఏ పి రామకృష్ణో వివరాలు చెప్పండి — అన్నారు కొందరు. ఏవేవో చెప్పాను. వారు తెలుసుకోలేక పోయారు. చివరికి యోగాసనాలు చేస్తారు, నేర్పుతారు, ఆయనండీ — అన్నాను. ఓహ్ ! ఆయనా ! యోగి రామకృష్ణ. అదిగో కొత్తగా కట్టిన క్వార్టర్స్‌లో రెండవ వరసలో మొదటి ఇల్లు, మేడమీద—అన్నారు వారు. ముందువచ్చిన చెవులకన్నా వెనుక వచ్చిన కొమ్ములు వాడి అన్న సామెతగా ఇరవైయేళ్ల ఇంజనీరు సర్వీసుకన్నా, ఆరేడేళ్ల యోగశిక్షణ గొప్పదయిందికదా ! —అని నవ్వుకుంటూ రామకృష్ణను కలుసుకొన్నాను. రామకృష్ణ నాకు శీర్షాసనంలో దర్శనమిచ్చారు. ఆయన అనుష్ఠానం అయ్యేవరకు వేచి వున్నాను. రామకృష్ణది ఉన్నత పండితాచార్య వంశం. చిన్ననాటి నుంచి గాయత్రి ప్రాణాయామం చేసిన అలవాటు వల్ల సన్నని నడుము, విశాలమయిన వక్షస్థలం, వర్చస్సు ఒలికే ముఖం, తాను చేస్తున్న దానిని చక్కగా, కదళీపాకంగా చెప్పే వాగ్మిత అతని ప్రత్యేకతలు. ఒక గదిలో పరచిన చాపపై వీణ కనిపించింది. నా అభిప్రాయం గ్రహించే కాబోలు వీణను తానే అభ్యసిస్తున్నానని, బి.హెచ్.ఇ.ఎల్. టవున్‌షిప్‌లోని శ్రీమతి శేషమాంబగారు తమ గురువని అన్నారు రామకృష్ణ. యోగానికీ, సంగీతానికీ సంబంధమేమిటని ప్రశ్నించేలోగానే ''నాదం యోగంలో భాగం— అందువల్ల నాకు సంగీతంపై అభిరుచి కలిగింది. వీణ నేర్చుకుంటున్నాను. అనాహత శబ్దాన్ని తెలుసుకొనడానికి ప్రయత్నిస్తున్నాను. ఓంకారం అనాహత చక్ర నుంచి వెలువడుతుంది. సరిగమ పదనిసలు మూలాధారం నుంచి సహస్రారం వరకు వుండే చక్రాలకు సంబంధించినవి. వీణానాదం చక్రానుసంధానానికీ, తద్వారా కుండలినీ యోగానికీ సహాయకారి, ఈ విధంగా మనోబుద్ధులు ఆధ్యాత్మిక ప్రవణాలవుతాయి'' అన్నారు. నా ముఖంలోని సందేహాన్ని గుర్తించారేమో రామకృష్ణ ''యోగంవల్ల మనిషిలో అంతర్లీనమయిన శక్తులు వ్యక్తమౌతాయి. మనస్సు ఉద్రిక్తంకాదు. తొందరపాటు తొలగిపోతుంది. ప్రశాంతంగా ఆలోచించే శక్తి కలుగుతుంది. యోగం అనే సంగతి తెలియకపోయినా మంచి చేసేవారు యోగి''— అన్నారు. ఎప్పటి నుంచీ యోగం నేర్పుతున్నారు ? — అనడిగాను. దీనిలో నా ప్రయోజకత్వం తక్కువ. బి. హెచ్. ఇ. ఎల్. డిప్యూటీ జనరల్ మేనేజర్ శ్రీ బి. కె. ఎం. నాయరు, కమర్షియల్ జి. ఎం. శ్రీ జి. పి. భట్టాచార్య బి. హెచ్. ఇ. ఎల్.లో యోగ శిక్షణకు బాధ్యులు. ఇంజనీర్ ట్రెయినింగ్‌లో యోగ శిక్షణను వారు అధికారరీత్యా ఏర్పాటు చేశారు. స్వామిశివానంద శిష్యులు స్వామిసత్యానంద మొదట ఈ శిక్షణ ప్రారంభించారు. వీరి ప్రధాన కార్యాలయం ముంఘైర్‌బహార్ స్కూలు ఆఫ్ యోగ సచ్చిదానంద సరస్వతి సత్యానంద పరమహంస పర్యవేక్షణలో 1976 ఆగస్టు 29 న రామచంద్రాపురం బి.హెచ్. ఇ. ఎల్.లో యోగ మిత్రమండలి అనే సంస్థ స్థాపించారు. ఈయన ఏటా వచ్చి యోగ శిక్షణ ఇచ్చి, గోష్ఠులు, సదస్సులు నిర్వహించేవారు. ఈ మండలికి నేను కార్యదర్శిని. మొదట ఈ శిక్షణ దేవాలయంలో ప్రారంభించాము. 1983 నుంచి ఇంజనీర్లకు అధికారరీత్యా శిక్షణ ఇవ్వడం లేదు. కాని ఎవరికి వారు ఆసక్తితో నేర్చుకొంటున్నారు. పబ్లిక్ స్కూల్ హాలులో ఉదయం 5 నుంచి 6 వరకు, సాయంకాలం ఏడు నుంచి ఎనిమిది వరకు శిక్షణ వుంటుంది. నేను 1976 నుంచి శిక్షకుడిని. శ్రీ ప్రమీత్‌కుమార్, శ్రీ శ్యామారావు నాతో సహకరిస్తున్నారు. శ్రీమతి ప్రమీత్‌కుమార్ స్త్రీలకు శిక్షణ ఇస్తున్నారు. దాదాపు సంవత్సరంగా ఇంటర్ నేషనల్ క్లబ్బులోనూ ఉదయం ఈ శిక్షణ కొనసాగుతున్నది. వేసవిలో 10 మొదలు 17 వయసు పిల్లలకు శిక్షణ ఇస్తున్నాము. యోగంతో చికిత్స చేస్తున్నాము. వాతం, మధుమేహం, ఉబ్బసం ఆసనాల వల్ల నయమవుతున్నాయి. 23 ఏళ్ల మధుమేహం, రెండు శాతం షుగర్ రెండు నెలల్లో పాయింట్ ఐదు శాతానికి తగ్గింది. అంతకుముందు ఆ వ్యక్తి పదిరోజులు ఆస్పత్రిలో వుండి వచ్చాడు. ఇన్‌సిలిన్ బిళ్లలు రోజూ తీసుకోమని డాక్టర్లు సలహా ఇచ్చారు. ఆసనాలు ప్రారంభించగానే ఇన్‌సిలిన్ మానుకున్నాడు. పవనముక్తాసనాలు, సూర్య నమస్కారాలు, అర్ధమత్స్యేంద్రాసనం, జలనేతి [ముక్కుతో నీరు పీల్చడం], కుంజల్, సర్వాంగాసనం, వజ్రాసనాలు, ప్రాణాయామాలు, కపాలభాతి, నాడీశోధన వంటి వాటిని ఆహార నియమంతో అభ్యసించగానే ఈ జబ్బులు కుదురుతున్నాయి. అనుభవం వల్ల ఏ వ్యాధికి ఏ ఆసనం అనేది సన్నిహిత పరిశీలనతో గ్రహించాలి... ఇంతవరకు 2000 మంది పెద్దలకు, 250 మంది పిల్లలకు యోగశిక్షణ ఇచ్చాము. ఈ శిక్షణలో హఠయోగషట్కర్మలు, యోగనిద్ర, ధ్యాన పద్ధతులు [అంతర్మౌనం, జపం, అజపాజపం, ఉజ్జయి ప్రాణాయామం] వుంటాయి. రక్తపోటు ఎక్కువగా వుండే రోగులకు యోగనిద్ర వల్ల ప్రయోగాత్మకంగా చికిత్స చేయమని బి. హెచ్. ఇ. ఎల్. ఆస్పత్రివారు కోరారు; చికిత్స చేస్తున్నాము. ప్రతి బుధవారం భజన కీర్తనలు చేస్తాము. ఇది నాదయోగంలో భాగం— అన్నారు రామకృష్ణ. కులమతాల రాజకీయాలు వున్నాయా మీ శిక్షణలో ? — అనడిగాను. అలాటివేమీలేవు. కొందరు ముస్లిములు, క్రైస్తవులు కూడ ఆసనాలు నేర్చుకొంటున్నారు — అన్నారు. ఆయన సతీమణి శ్రీమతి లావణ్య హిందీ ఎం. ఓ. ఎల్. బహుభాషావేత్త. భర్తకు యోగశిక్షణలోను తోడ్పడుతున్నారు. రామకృష్ణకు చిత్రలేఖనంలోను అభిరుచి వుంది. త్యాగరాజారాధన, గురుపూర్ణిమ, కృష్ణాష్టమి ఉత్సవాలు గొప్పగా చేస్తారు. ప్రశాంతంగా, నిరాడంబరంగా మానవ కల్యాణానికి తోడ్పడుతున్న రామకృష్ణ వంటివారు ప్రతి సంస్థలోను ఒకరిద్దరున్న ఎంతో టెన్షన్ తొలగిపోతుందని అనుకుంటూ సెలవు తీసుకొన్నాను.

పెరుమాళ్ల రామకృష్ణ



## ఉపశ్రుతి :

మార్చి 21, 22, 23 లలో యువభారతి వారు నిర్వహించిన శ్రీ ఆరుద్ర ప్రసంగాలకు వెళ్లారా ? — అనడిగాను మిత్రులు శ్రీ నిడదవోలు సుందరేశ్వరరావును. ఎవరైనాసరే, నన్నెబోడుని కళావిలాసం, ఎర్రన రామాయణం, సోమన వసంత విలాసం దొరికాయని నిరూపిస్తే, వారి ప్రసంగాలు వింటాను. అలా కానప్పుడు పాత కబుర్లెందుకూ ? — అని సుందరేశ్వరరావు నన్ను కోప్పడ్డారు.

**— తిరుమల రామచంద్ర** ★

## న్యూఢిల్లీ లేఖ

[6వ పేజీ తరువాయి]

కాని నిజంగా పొత్తు కుదరదు. కమ్యూనిస్టులకీ శ్రీమతి గాంధీకీ తేడా ఏమిటి? తమకి అవసరం అనిపించగానే శ్రీమతిగాంధీ అత్యవసర పరిస్థితిని అమలుపరిచారు. కమ్యూనిస్టులు ఇంకా అన్యాయం చేస్తారు – రష్యాలో గత 60 ఏళ్ల పయిగా, తూర్పు యూరోపులో దాదాపు 40 సంవత్సరాలుగా, ఆఫ్‌గనిస్తాన్‌లో సుమారు 5 సంవత్సరాలుగా వాళ్లు చేస్తున్నదేమిటి? ఇవాళ ఆఫ్‌గనిస్తాన్‌లో అధికారంలో ఉన్న వాళ్లు శ్రీయుతులు డాంగే, రణదివే, పి. సి. జోషి లాంటివాళ్లు. ఈ కమ్యూనిస్టు నాయకులు యుద్ధ సమయంలో బ్రిటిషు వాళ్లతో కలిసి పని చేశారు. డాంగే, రణదివేలు అప్పటిలో గాంధీ, సుభాష్‌చంద్రబోస్‌లని తిట్టిపోసే వాళ్లు. ఎమర్జెన్సీ ముందు జయప్రకాశ్ నారాయణకి అడ్డుతగిలారు కమ్యూనిస్టులు. 1942 ఉద్యమాన్ని చెడగొడదామనుకున్నారు కమ్యూనిస్టులు. వానపాములు మారవు. అప్పుడప్పుడు పొకడని మార్చుకుంటాయి అంతే. ఆ రోజుల్లో బ్రిటిషువారి అనుగ్రహం కోసం తాపత్రయపడ్డారు. ఈ రోజుల్లో శ్రీమతి గాంధీ అనుగ్రహం కోసం తాపత్రయం పడగలరు. ఏది చేసినా వానపాములు వానపాములే కదా! దేశద్రోహులు ఎవరికి ద్రోహం చేస్తారు? దేశానికా? కాదు, తమకే! లెనిన్ నుంచి నేటిదాకా కమ్యూనిస్టులు చేస్తున్నదంతా ఇదే. సోవియెట్ యూనియన్ కేవలం నిరంకుశత్వానికి ఒక చిహ్నం కాదు. ఆ దేశం విప్లవం పేర జరిగిన ఆత్మద్రోహానికి చిహ్నం! ★




Printed and Published by S. Nageswara Rao at The Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna.